# మాస్టర్ C.V.V.-గారి
# ఎలక్ట్రానిక్-యోగం


రచన :

**డా|| వేదవ్యాస** I.A.S. Ph.D.



ప్రచురణ :

వేద విశ్వవిద్యాలయము

*UNIVERSITY OF VEDIC SCIENCES,*

**8, Plot No. 56, Jubilee Hills, HYDERABAD - 33.**

*INDIA-USA*

వెల రు.73/-

ప్రథమ ముద్రణ "ఉగాది"-5-4-2000



వెల : రు.73/- (Paper Back Edition)
రు.91/- (Library Edition)

కాపీలకు : స్పెషల్ ఆఫీసర్

వేద విశ్వవిద్యాలయం (ప్రచురణ విభాగము)
రోడ్ నెం. 8, ప్లాట్ నెం. 56, జూబ్లీహిల్స్,
హైదరాబాద్ - 500 033.

# విషయసూచిక

# పీ ఠి క !

తెలుగు సాహిత్యంలో **మాస్టర్ CVV** గురించి — వారి అద్భుతమైన ఎలక్ట్రానిక్ యోగం గురించీ పరిచయం చేయడమే ఈ చిన్నిపుస్తకం ఉద్దేశం!

మాస్టర్ CVV ఇప్పటికీ దక్షిణాదిన ఆశ్చర్యంతోనూ, గౌరవం తోనూ శిష్యులు నిత్యమూ ప్రార్థించే సద్గురువుగా ఉపాసింపబడుతూనే వున్నప్పటికీ — నిజానికి తెలుగువారిలో చాలామందికి ఆయన అద్భుత జీవితం గురించీ, మహత్తర ఆదర్శం గురించిగానీ తెలియనివాళ్ళే కనిపిస్తారు!

అటువంటి వారికి సైన్సు పరిభాషతో తెలుగుభాషలో తేలికగా అర్థమయ్యేలా **మాస్టర్ CVV యోగాన్నీ** ఆయన అద్భుత జీవితాన్నిగురించీ, పరిచయంచేయడం అవసరం. దీనితోపాటు తెలుగువారికి సుప్రసిద్ధులు, పండితులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిలాంటి ఎందరో శిష్యులకు **మాస్టర్ CVV** అంటే, మానవరూపంలో అవతరించిన పరబ్రహ్మమే! ఇప్పటికీ ఆంధ్రదేశంలో హైదరాబాదు, ఒంగోలు, నెల్లూరు వంటి అనేకచోట్ల

రహస్యంగా అనేకులు **మాస్టర్ CVV** యోగకేంద్రాల్నీ, యోగమిత్రుల సామూహిక ధ్యానగోష్టి జరుపుతూ అద్భుతమైన **మాస్టర్ CVV** యోగంలో ప్రచ్ఛన్నంగా సాధనలో వున్నవారే! అలాంటివారిలో శార్వరి, శ్రీ NRBV, శ్రీరమణయ్యగారు, గూడూరు నమశ్శివాయగారు, శ్రీ మైనంపాటి నరసింహం (MN), పోతరాజు నరసింహం, శ్రీ V.V. వెంకటరమణరావుగారు, డా॥ గాలి బాలసుందరరావుగారు, డా. ఎక్కిరాల కృష్ణమాచార్య, శ్రీ వేటూరి ఆనందమూర్తిగారి వంటివారు ఇంకా అనేకు లున్నారు!

ఐనప్పటికీ తెలుగుభాషలో **మాస్టర్ CVV** అద్భుత జీవితం గురించి తెలిపే గ్రంథాలు అందులోనూ **మాస్టర్ CVV** దర్శించిన ఇంగ్లీషు మంత్రాలగురించీ వారి జీవితకాలంలో ప్రత్యక్షంగా చూపిన ఆశ్చర్యకరమైన యోగసిద్ధుల గురించీ, సమగ్రమైన గ్రంథం వెలువడలేదు! మాస్టరు CVV గారి యోగంలోని ఆశయాల వివరాలు CVV-గారి 'నోటు' ఆధారంగా సామాన్య మధ్యతరగతి పాఠకులకు అందించడమే ఈ గ్రంథంయొక్క ముఖ్య ఉద్దేశం!

ఇంగ్లీషులో మంత్రాలు కనిపెట్టి — ప్రతీమంత్రమూ మూడుసార్లు ఉచ్చరించినంతనే ఎటువంటివారికైనా అసాధ్యమైన రోగాలు నయం కావడం మాత్రమేకాక, గాయాలూ, పాముకాట్లు, దీర్ఘరోగాల వంటి అనేక ఇతర అపాయాలనుంచీ ఇప్పటికీ క్షణాలమీద ఆరోగ్యాన్ని ప్రసాదించే ఈ అద్భుత ఎలక్ట్రానిక్ యోగం కలిగించిన యదార్థ అనుభవాలను పాఠకులముందు ఉంచడమే నా ఉద్దేశం!

ఈ గ్రంథం వివరించేది ఎప్పుడో జరిగిన మహాత్ముల కథలు కాదు! సమకాలీన అనుభవాలు! ఇప్పుడింకావున్న అంటే జీవించివున్న ప్రఖ్యాత డాక్టర్లు, నిన్న మొన్నటిదాకా జీవించివున్న ఆంధ్రపత్రిక, తెలుగు వారపత్రిక

సంపాదకుడుగా పనిచేసిన పిలకా గణపతి శాస్త్రిగారు, విజయవాడలో "మృత్యుంజయ ఆయుర్వేద ఫార్మసీ" అధినేత శ్రీ గూడూరి నమశ్శివాయగారు, మాస్టరు యోగంలో పాల్గొన్న శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారివంటివారూ ఇంకా అనేకులు ఈ యోగంయొక్క అనుభవాలతో ప్రత్యక్షంగా లాభం పొందినవారే ఎందరో గుప్తంగా వుండిపోయారు!

ఈ **మాస్టర్ CVV యోగం** పూర్వకాలపు సాంప్రదాయపు యోగమార్గం వంటిది కాదు! ఇది క్షణాలమీద పనిచేసే అద్భుత యోగశక్తి! ఒక ఎలక్ట్రానిక్ — విద్యుత్తు, కరెంటులవలే **మాస్టర్ CVV** పేరూ, వారిచ్చిన ఇంగ్లీషు మంత్రాలనూ, ఉచ్చరించినంతనే సాధకుని శరీరంలో "కరెంటు" వంటి 'శక్తి' ప్రవహించి కుండిలినీశక్తి మేల్కొనుటమూ మూడవనేత్రం (యోగనేత్రం, దివ్యదృష్టి) తెరుచుకొనటమూ వంటి ఎన్నో ఆశ్చర్యకరమైన అనుభవాలను కలిగించే సైన్సువంటి ఒక అద్భుత యోగప్రక్రియ — ఈ CVV యోగం, అని చాలామందికి తెలియదు! అందుకే ఈ గ్రంథంలో ప్రత్యేకించి ఈ యోగమార్గంలోని ఆధ్యాత్మిక రహస్యాలు ఎన్నోకొన్ని వివరించబడినాయి!

అంతేకాదు, అసలీ యోగం **మాస్టరు CVV** నుంచి ఎట్టి ప్రయత్నమూ లేకుండానే 1910లో **హేలీ తోకచుక్క** కనపడినపుడు ఒక పిడుగువలే, విద్యుత్తువలే, కరెంటువలే షాక్ కొట్టినట్టు భూమిమీదకు దిగి — మాస్టర్ CVV శరీరంలో ప్రవేశించి — ఆనాటినుంచీ ఒక సంపూర్ణ యోగమార్గంగా అవతరించింది! ఈ అనుభూతికి పూర్వంచూస్తే, **మాస్టర్ CVV** అనబడే సద్గురువు ఒక, అతి సామాన్యమైన వ్యక్తి! ఏవిధమైన ఆధ్యాత్మిక వాసనా లేనివారు! వ్యాపారమూ, బిజినెస్ PWD కాంట్రాక్టు పనులు చేసుకునే తెలుగు నియోగి బ్రాహ్మణుడుగా సంపన్న గృహస్థుడుగా వుండి — ఈ అకస్మాత్తుగా తనలో దిగిన బ్రహ్మసాక్షాత్కార సిద్ధివల్ల మరుక్షణంలో ఇనుము

సూదంటురాయిలా మారిపోయినట్టు మామూలు మనిషి కాస్తా మాస్టర్ CVV గా మారటం ఒక — అణుబాంబు పేలినంత అకస్మాత్తుగా జరిగింది! అందుకే దీనిని "ఎలక్ట్రానిక్ యోగం" అన్న పేరు సరిపోతుంది!

మాస్టర్ యోగం ప్రపంచానికి ప్రచారం కాకముందే రష్యన్ సిద్ధురాలు యోగిని మేడమ్ H.P. బ్లావెట్స్కీ అనే రష్యన్ మహిళ లండన్‌లోని రాయల్ సొసైటి (Royal Society) సైంటిస్టుల ముందరే తన యోగశక్తితో, సిద్ధితో ఒక గాజుసీసాలో **పాదరసం తీసుకొని** రెండు మూడు క్షణాలు ధ్యానించి దాన్ని **బంగారంగా** మార్చి ఆ సైంటిస్టులకిచ్చింది! ఈ మార్పును 1889–98 మధ్యప్రాంతంలో ఈమె యదార్థంగా ఋజువుచేసింది!

ఈమె హిమాలయ పర్వతాలలోని సిద్ధగురువుల ఆశ్రమాలలో ఏడు సంవత్సరాలు యోగసాధనచేసి శిక్షణ పొందింది. కొందరు — **"శంబల"** వంటి దివ్యప్రదేశాలను దర్శించిందనికూడా అంటారు! ప్రపంచానికి ఈమె **దివ్యజ్ఞాన సమాజం** (Theosophical Society) అన్న నూతన ఆధ్యాత్మిక మార్గాన్ని 1897 ప్రాంతంలో (Secret Doctrine - Isis Unvield) అనే తన అద్భుతగ్రంధాల ద్వారా ఆలోచనాప్రపంచంలో ఒక నూతన శకాన్నే ఆరంభింప చేసింది! దీంతో యూరప్‌దేశాలలోని సైన్సుకూ — చర్చి మతాధికారులకూ నిరంతరం సాగే పోరాటంలో — ఒక నూతన సమన్వయం చేయ్యటంతో 1) అటు సైన్సు 2) మతము 3) వేదాంతం 4) యోగశక్తి 5) ప్రాచీన యుగాలనాటి చరిత్ర 6) ఇటు సిద్ధగురువుల రహస్య ఉపదేశమార్గం వంటివి ఎన్నింటినో తెలియచేసే మహత్తర గ్రంధాలుగా ఇప్పటికీ ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సులో వేలాదిమంది శిష్యులు ఆమె గ్రంధాలను పూజ్య భావంతో చదివి — దివ్యజ్ఞాన సమాజం కేంద్రాలలో నిత్యం ధ్యానసాధన చేస్తారు! ఇది ఆధునిక చరిత్రలో రెండవ ఆధ్యాత్మిక 'తరంగం' అని

చెప్పవచ్చు!

అలాగే రష్యాలో 1910 ప్రాంతంలో G.I. గుర్జీఫ్ ఆయన శిష్యుడు **C.D. ఔస్పెన్స్కీ** (Ouspensky) ల రహస్య సాధనా మార్గంద్వారా ఒక — సైన్సువంటి యోగశక్తులను ప్రసాదించే మానసిక శిక్షణను — సక్రమ సాధనావిధానాన్ని ప్రకటించారు. ఇది ఇంకో ఆధ్యాత్మిక తరంగం!

అలాగే శ్రీ భగవాన్ రమణమహర్షి మద్రాసుకు దక్షిణంగా తిరువన్నామలై అనే సుప్రసిద్ధ శైవక్షేత్రంలో తపస్సిద్ధిని పొంది, తన బ్రహ్మజ్ఞానాన్ని ప్రపంచంలోని సాధకులందరికీ ప్రసరింపచేసి తద్వారా — మూడవ ఆధ్యాత్మిక "తరంగాన్ని" ప్రసరింపచేశారు!

అలానే బెంగాల్‌లో శ్రీరామకృష్ణ పరమహంస అన్నిమతాలు చూపిన సాధనలనూ తనలో సమన్వయంచేసి భగవత్ సాక్షాత్కారాన్ని అనుభవించి స్వామి వివేకానందునిద్వారా తన శిష్యులు ఎలాంటివాళ్ళో ఒక రాకెట్ పేల్చినట్టుగా పాశ్చాత్య ప్రపంచానికి నిరూపించారు!

దీనితో అమెరికాలోని చికాగో సర్వమత (Chicago World Parliament of Religions) మహాసభలలో స్వామి వివేకానందుడు చేసిన వేదాంతగర్జన ప్రాచీన భారతీయ వేదఋషుల ఉపదేశాలకు తృళ్ళిపడి మేల్కొనేలా చేసింది!

ఆతర్వాత శ్రీ అరవిందయోగి ఫ్రెంచి స్థావరమైన పాండిచ్చేరిలో శ్రీకృష్ణ భగవానుని సాక్షాత్కారం పొంది ఫ్రెంచిమహిళ మాతృశ్రీ అనబడే మీరాతో కలిసి అంతర్జాతీయ అరవిందాశ్రమాన్ని స్థాపించి తద్వారా వందలాదిమంది సాధకు లను ప్రపంచానికి ప్రసాదించారు! ఇది మరొక ఆధ్యాత్మిక తరంగం!

అరవిందయోగి ప్రపంచానికి ప్రకటించిన ఆశ్చర్యాలలో ముఖ్యమైనది — మానవ మనస్సుకు అతీతమైన ఒకానొక దివ్యమైన శక్తి **"సూప్రా-మెంటల్ డిస్సెంట్"** (Supra-Mental Descent) అనబడే **యోగశక్తి** 1910 నుంచే

భూమికి అవతరించడం చూశానని — అది క్రమక్రమంగా 1920–1930 కల్లా భూమి పర్యావరణంలోకి ప్రవేశించి ఆ భగవత్ శక్తితో మన **భూగోళాన్నే ప్రచోదన** చేస్తున్నట్లుగా తాను ప్రత్యక్షంగా దర్శించానని — ఆ దైవ-శక్తి యదార్థంగా **1934 లో భూమిపైకి అవతరించిందనీ** దాని ఫలితాలు అనేకమంది సాధకులకు తన ధ్యానమార్గంద్వారా ప్రసరింపచేశామని శ్రీఅరవిందుడూ, మదర్ (Mother) బహిరంగంగా ప్రకటించారు!

వారితర్వాత ఫ్రెంచి మహిళ **'మదర్'**గా పాండిచ్చేరి ఆశ్రమంలో 97 ఏళ్ళవయస్సు వరకూ జీవించి అనేకమంది యూరోపియన్లను భారతీయ సాధనామార్గంలోకి మలచి ఒక అంతర్జాతీయ యోగకేంద్రాన్ని ప్రారంభించింది!

అలానే మద్రాసుకు దక్షిణంగా కడలూరు సమీపంలోని వడలూరు అన్న ఓ కుగ్రామంలో రామలింగం అనబడే ఒక మహాపురుషుడు అవతరించి రహస్య సాధనద్వారా జ్యోతిరూపంలో సుబ్రహ్మణ్యస్వామి సాక్షాత్కారం పొంది — ఆయన అనుగ్రహంద్వారా తాను శరీరంతోసహా ముక్తినిపొంది జ్యోతిగా మారిపోతున్నానని **ముందే చెప్పి** — అకస్మాత్తుగా తలుపుతాళం వేసిన గదిలో కూర్చున్నవాడు కూర్చున్నట్టే — **గాలిలో కరిగి, మాయమైపోయాడు — జ్యోతి రామలింగస్వామి** అన్నపేరు సార్థకం చేసుకునేలా! ఇది మహోన్నత మైన యోగసిద్ధి!

పై ఆధ్యాత్మిక మహానుభావుల యోగపరంపరతో బాటు **మాస్టర్ CVV** యోగం అవతరణా, కుంభకోణంలో నివసించిన మాస్టర్‌గారి నూతన యోగ మార్గంయొక్క అద్భుతాలూ పాఠకులకు పరిచయం చేయడమే ఈ గ్రంథం లక్ష్యం! ఇందులోని తర్వాత అధ్యాయాలద్వారా ఇంగ్లీషుమంత్రాలు మీకు అందించటం ఈ చిన్న గ్రంథం లక్ష్యం!

అంతేకాదు — ఈ పుస్తకంలో పైన చెప్పిన సిద్ధపురుషుల విభిన్న

యోగమార్గాలను సైన్సుదృష్టితో సరిపోల్చి విశ్లేషించి సాధకులకు వివరించే ప్రయత్నమే ఈనా గ్రంధానికి వెనుక సంకల్పం! ఐతే ప్రయత్నం ఒక్కటే నాది — కాని సంకల్పం మాత్రం నాదికాదు — నాపైనుంచి నాద్వారా మీకు అందిస్తున్నది!

దీనిని — ఆధ్యాత్మిక సాధకులూ విశేషించి భగవత్ సాక్షాత్కార రహస్యాలను తెలుసుకోవాలన్న ఆసక్తిగల — సైన్సుదృక్పధం కల సాధకులకూ ఇది అన్నివిధాలా సహాయకారిగా వుండాలని — తెలుగు సైన్సు భాషలో దీన్ని మీకందిస్తున్నాను!



1

# మాస్టరు C.V.V. - పరిచయం!

మనలో చాలామంది గుడికి వెళ్ళేవారు వున్నారు! కొబ్బరికాయకొట్టి దేవుడిని పూజించేవారూ వున్నారు! దారిలో ఎక్కడైనా దేవుని ఊరేగింపు ఎదురైతే భక్తితో లెంపలు వేసుకొని సాష్టాంగ నమస్కారంచేసి చేతితో ఫలమో, పుష్పమో, దక్షిణో సమర్పించి గాని వెళ్ళనివాళ్లూ అనేకమంది వున్నారు!

కాని చాలామందికి జీవితంలో 'భగవత్ చింతన' అంతమాత్రంతోటే ఆగిపోతుంది. వీరికి దైవత్వమంటే ఏమిటో, అసలు మానవుడు భగవంతుడిని ఎందుకు పూజించాలో, లోతుగా ఆలోచించే ఆసక్తిగాని, తీరుబడిగాని వీరికి వుండదు! అంటే దైవచింతన వీరిలో అంతటితోటే ఆగిపోతుంది!

నిజానికి 'భగవంతుడు' అనే మాటకు అర్థమేమిటి? అసలు మానవుడు భగవంతుడిని ఎందుకు పూజించాలి? ఒకవేళ మనం భగవంతుడిని కనుక పూజించకపోతే ఆయనకి కోపం వస్తుందనో, లేక కష్టాలు పాపాలు కలుగుతాయనో, మరీకాక పోతే ఈ ప్రపంచంలో

దైవచింతన పూర్తిగా అడుగంటిపోతే పాపాలు పెరిగిపోయి ప్రళయాలు, వరదలు, తుఫాన్లు, భూకంపాలతో మానవజాతి మొత్తమే నశించి పోగలదనో అనుకుంటారు! దీనిని దైవభీతి అనవచ్చు! పాపభీతి అనికూడా అంటాం!

నిజానికి 'దైవం' లేక 'భగవంతుడు' అన్న సత్యం ఎటువంటిది? ఈ సృష్టిని అంతటినీ పరిపాలించేవాడు దేవుడు అనిమాత్రమే ఊహించు కుంటారు చాలామంది! కాని అది కేవలం వారి ఊహమాత్రమే! దానిని నేరుగా తెలుసుకోవాలని ప్రయత్నించేవారిని 'సాధకులు' అంటాము!

మనిషి తనలోవున్న అంతరాత్మను తెలుసుకోవడానికి చేసే ప్రయత్నమే 'సాధన' అనవచ్చు! నేనెవరు? నా లోపలినుంచి ఆలోచనలు ఎవరివలన పుట్టుకుని వస్తున్నాయి? ప్రతీక్షణము గడియారంలాగ నాలో కొట్టుకునే హృదయస్పందన క్రమం తప్పకుండా నడిపించే **'శక్తి'** ఏది?

ఏ శ్వాస ఆగిపోతే కొన్ని క్షణాలలోనే మనం మరణిస్తామో ఆ 'ప్రాణం' అంటే ఏమిటి? అది ఒక కరెంటువంటి **శక్తియా?** లేక 'మనస్సా'? ఆ "ప్రాణం" మనకి పోసేది ఎవరు? ఆఖరిశ్వాస దాకా ఒక గడియారం కీ ఇస్తే కొట్టుకుంటున్న మాదిరిగా ఒక గడియారంలాగా దానంతటదే పనిచేసే ఈ 'యంత్రారూఢమై' పనిచేసే మాయాశక్తి ఏది?

సమస్తమూ నాకే తెలుసనుకునే మనిషికిగాని గొప్ప సైంటిస్టుకుగాని రాజకీయనాయకుడికిగాని, పామరుడికిగాని, ఒక కవికిగాని, కళాకారుడికిగాని తనలో ఈ సమస్తాన్ని సాధించే తన మూలవ్యక్తిత్వాన్ని తెలుసుకోగలగటం ఎంత ప్రయత్నించినా ఎందుకని సాధ్యపడదు? విద్యుత్తునూ, రైళ్ళనూ, గ్రహాంతరయానాన్ని, కంట్రోలుచేసే ఈ మానవుడికి పరిపరివిధాల పరిగెత్తే తన మనస్సును నిగ్రహించడం ఎందుకని సాధ్యంకాకుండా పోతున్నది?

నిజానికి మనిషికి గుండెకొట్టుకునే హృదయస్పందనల వెనుక మన

లోని నిత్యప్రాణస్పందనను నడిపించే ఈ శక్తీ — ఈ విశాలవిశ్వాన్ని నడిపించే 'విశ్వ-శక్తీ' ఒకటేనా? ఏ మహాశక్తి సూర్యుడు, చంద్రుడు, భూమివంటి బ్రహ్మాండ మైన గోళాలను నిత్యమూ ఇంజనువలే నడిపిస్తూ గతి తప్పకుండా కాలచక్రం లో తిప్పుతున్నదో — అదే శక్తి మన లోపలి ప్రాణాన్ని మన జీవితాన్నికూడా నియంత్రణ చేస్తున్నదా? నిజానికి మన లోపలవున్న **ఆత్మకీ**, — ఈ విశ్వాన్ని పరిపాలించే **పరమాత్మకీ** — ఎటువంటి 'లింకు' (Link) ఏర్పడివున్నది!

ఈ మహత్తర సత్యాలను తరచి తెలుసుకొని ఒక **నూతన యోగాన్ని** అధునిక ప్రపంచానికి అందించిన ఒక మహాసిద్ధపురుషుడే '**మాస్టర్ C.V.V.** గారు!'

చాలామందికి మనలో **మాస్టర్ C.V.V.** గురించి తెలియదు! వారి అద్భుత నూతన యోగం (New Yoga) ఒక ఎలక్ట్రానిక్ యోగంవంటిది! మాస్టరుగారు 500లకు పైగా ఇంగ్లీషులో మంత్రాల్ని దర్శించి మనవజాతికి ఇచ్చివెళ్ళారు! అందులో ప్రతిఒక్కటీ ఒక ఆటంబాంబులాగా పనిచేసే మహాశక్తివంతమైన **"యోగా కోర్సులు"** అనబడే వైబ్రేషన్ శక్తికలిగిన కరెంటు వంటి ఇంగ్లీష్ పదాలు — వీటిని మాస్టర్‌గారు 'కోర్సులు' అని పిలిచారు!

వీటిని మామూలు మంత్రాలమాదిరిగా నూరుసార్లూ లేదా వెయ్యిసార్లు నిత్యం జపంగా చేయవలసిన పనిలేదు! వాటిని స్మరించి, ఉపదేశించిన విధంగా ఈ ఇంగ్లీష్ మంత్రాలను మూడే-మూడుసార్లు ఉచ్చరించి ప్రేయరు లో కూర్చునే సాధకులకు గుండెజబ్బులవంటివి క్షణాలలో తగ్గిపోవడం, అనేక మొండివ్యాధులు వైద్యానికి సహితం లొంగనివి, రోజుల వ్యవధిలో పూర్తిగా నిర్మూలించబడటమూ అనుభవంలోని విషయాలు (చూ. అధ్యాయం-17)!

అలాగే **మాస్టర్** C.V.V. గారి శిష్యుడైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తిరుపతిలో తమ ఇంటివద్ద దాదాపు 30 సంవత్సరాల పాటు అజ్ఞాతంగా రోగనివారణచేస్తూ వందలాదిమంది రోగులకు ప్రాణదానం చేసిన సంగతీ ప్రత్యక్షంగా చూసినవారూ అనేకమంది వున్నారు — నావంటి వారు!

ఏకారణంవల్లనో నాకు తెలియని ఊహకందని పరిస్థితులవల్ల మాస్టర్ C.V.V. గారు కుంభకోణంలో రహస్యంగా వ్రాసిపెట్టుకున్న మూడు యోగా-డైరీలు పెద్దపెద్ద సంపుటాలు నాచేతిలోకి 1968 ప్రాంతంలో కుంభకోణం నుండి వచ్చి చేరాయి! దీనితో నాజీవితంలో మాస్టర్ C.V.V. యోగంతో పరిచయభాగ్యం కలిగింది!

అనేక సంవత్సరాలు 1969 నుండీ 1979 వరకూ ఈ **'మాస్టర్ యోగాస్కూలు'** హైదరాబాదు సరస్వతీనగర్ (న్యూనల్లకుంట) లోని నా స్వగృహంలోనే నడిచింది! ఆ తరువాత మాస్టర్‌గారి ఆదేశంద్వారా "షాపు మూసివేయి" అన్న వాక్కు వినబడగానే యోగాస్కూలును 1999 వరకూ మూసివేయడం జరిగింది! అట్టి మహత్తర విచిత్రయోగం ఇప్పుడు ఈ రానున్న మిలీనియం ఆరంభమై గత సహస్రాబ్ది పూర్తయ్యే సమయంలో ప్రపంచానికి అందించే తరుణం ఆసన్నమైంది! మానవజాతి మొత్తం ఒక **నూతన యుగంలోకి** ప్రవేశించబోతోంది!

ఇందులో మాస్టర్‌గారి కోర్సులలో నిముషాలమీద కుండలినీశక్తి మేలుకునే యోగాకోర్సులు వున్నాయి! క్షణాల మీద దుష్కరమైన రోగాలను తగ్గించి ఆరోగ్యాన్ననుగ్రహించే యోగమంత్రాలూ ఇందులో వున్నాయి! ఇంకా అనేకం ఇటువంటివి మాస్టర్‌గారి జీవితంలోని అద్భుత సంగతులు చాలా మంది తెలుగువారికికూడా తెలియనివి, ఇన్నాళ్లపాటు దాగివున్నవి ఈ

గ్రంథరూపంలో ఇప్పుడు మీముందుంచుతున్నాను!

ఇందులో ఏఒక్కటీ నా సొంతంకాదు! నాకు ఇవ్వబడినవే! ఇందులో ప్రతీ విషయము చిన్నపిల్లలకు కూడా బోధపడేంత సరళమైన తేలికభాషలో మీకందివ్వడం జరుగుతుంది!

కాని ఒక గొప్ప హెచ్చరిక చెయ్యాలి! ఇందులో భాషమాత్రమే తేలికైనది! విషయం-మాత్రం ఎంతో లోతుగా ఆలోచించి మళ్ళీమళ్ళీ చదివి ఎంతో అనుభవంతో జీర్ణంచేసుకుంటేనేగాని అంతుపట్టనంతటి గహనమైన జీవిత సత్యాలూ యోగరహస్యాలు, అనేక దేవరహస్యాలూ ఇమిడివున్నాయి!

ఇందులో

1) మానవ మెదడు నిర్మాణంలోని రహస్యాలు — మెదడు లోపలి కేంద్రాలు కుండలినీశక్తిని మేలుకొలిపి కంట్రోలుచేసే నాడీకేంద్రాలు
2) శరీరంలోకి ప్రాణాన్ని ఆకర్షించే శక్తికేంద్రాలు
3) మామూలు మనస్సుకు పైనవుండే బుద్ధితో 'యోగసిద్ధి'. భగవంతుడితో చేరుకొనగలిగే విశ్వమనస్సుతో మనకి లింకు!
4) మన శరీరంలోంచి మనం బయటకి నిర్గమించే మృత్యు రహస్యాలు తిరిగి మనిషి తల్లిగర్భంలో పిండంలోకి ప్రవేశించే జన్మ ప్రక్రియను తెలిపే రహస్యసూత్రాలు.
5) అంతేకాక మరణించిన తర్వాత, తిరిగి జన్మించేముందు మనం ఎక్కడ వుంటామో తెలుసుకోవడానికి ఉపాయం ఈ నిద్రవంటి మాయ (Unconscious State) లేక మత్తు ఏర్పడటానికి హేతువు, దానిని నివారించి ఆకాశంలోని మేఘాలు తప్పుకుంటే సూర్యుడు

వెలిగినట్టు మనలోని అంతరాత్మ మనకే ప్రత్యక్షంగా కనపడే ఆధ్యాత్మిక రహస్యాలు.

6) ఈ మాస్టర్‌గారి యోగపరిశోధనలోని మానవ **నాడీమండలంలోని రహస్యకేంద్రాలు** — ఇందులో కొన్ని మనిషి భవిష్యత్ పరిణామానికి సంబంధించినవి! అవి కరెంటు-స్విచ్‌లాంటివైతే — మరికొన్ని బోర్డుని కంట్రోలుచేసే మెయిన్ స్విచ్ లేక ఫ్యూజు (Fuse) వంటివి! వీటిలో కొన్ని తాకకుండా వదిలివేయడం మంచిది!

7) మరికొన్ని మనలోని దైవిక శక్తిని మేలుకొలిపే కేంద్రాలు! ఇంకొన్ని మనలో ప్రాణశక్తిని పెంచి రోగనివారణ చేయగలిగేవి :

ఇంకాఎన్నో యోగాకోర్సులు మాస్టర్‌గారు మనకి వారి స్వదస్తూరితో రాసుకున్న మాస్టర్ C.V.V. డైరీలలో నిహితమైవున్నాయి! ఇవన్నీ పూర్తిగా అందించడం అంటే అనేక సంపుటాలు పట్టవచ్చు — అదంతా చదివి అవగాహన చేసుకునే శక్తిగాని, ఆసక్తిగాని చాలామందిలో లేకపోతే ఆ నా ప్రయత్నమంతా వ్యర్థమేకావచ్చు! అందుకనే కేవలం మాస్టర్ C.V.V. గారి యోగాన్ని ఆయన జీవితంలోని ముఖ్యఘట్టాలు ఆయన చేసిన యోగ మహత్యాలు, మీకు పరిచయంచేసి తెలపటమే నావంతు! ఈ యోగాన్ని ప్రచారంలేకుండా వుంచే ఆయన నిరాడంబరత్వంవల్ల రహస్యంగావున్నదాన్ని సామాన్యులకు అందించడం కోసమే నాయీ చిన్ని గ్రంథం!

ఈ చిన్న పరిశోధనాగ్రంథంలో సామాన్య తెలుగు పుస్తకాలు చదివే పాఠకులెవ్వరికీ దొరకని అమూల్య యోగ రహస్యాలు మాస్టర్ C.V.V. గారి అద్భుత చరిత్రయేకాక వారి యోగంలోని అద్భుత విశేషాలతోపాటు సరస్వతీనగర్, హైదరాబాదులోని మాయింటివద్ద పదేళ్ళపాటు యోగాస్కూలు

నడిపినప్పుడు మాస్టర్‌గారి 'ప్రేయర్'లలో జరిగిన అద్భుతానుభవాలతో సహా అందించగలగటం కేవలం మాస్టరుగారి ఆశ్చర్యకరమైన అనుగ్రహ విశేషమే!

మాస్టరుగారు, వారి ఇంగ్లీషుమంత్రాలూ మానవాళియొక్క ఆధ్యాత్మిక చరిత్రలోనే అపూర్వమైనవి! మానవజాతి **ఆధ్యాత్మిక పురోగతిలో** — ఎంతో వెనకబడివున్నదని, మానవజాతికి చేయూత కావాలని గ్రహించిన మాస్టర్‌గారు ఈ నూతన యోగాన్ని ప్రారంభించి, అందులో అనేక అనూహ్యమైన ఈక్రింది విజయాలను సాధించారు :-

1) తమ ముసలి (80 ఏళ్ళ వృద్ధురాలైన) మేనత్తగారు **మరణించిన మూడవరోజున** మాస్టర్‌గారు **బ్రతికించిన** అద్భుత లీల!

2) భార్యభర్తలమధ్య శారీరక **దాంపత్యం లేకుండానే** మాస్టర్‌గారు తమ రెండవభార్యయైన మదర్ వెంకమ్మగారి **కడుపున అయోనిజుడుగా** ఒక గ్రహాంతరవాసియొక్క అంతరాత్మను ప్రవేశపెట్టి **'అద్భుత సృష్టి'** సాధించడం కనీవినీ ఎరుగని అపూర్వవిజయం!

3) మనిషి మరణించినతర్వాతా, తిరిగి జన్మించేముందూ, పై లోకాలలో కాలచక్రంలో "ఆత్మ"గా ఎక్కడవుంటాడో అన్న ఆధ్యాత్మిక రహస్యాలను యోగసాధనతో దర్శించి, ఆ ఫలితాలను తమ యోగా డైరీలలో రికార్డుచేసి, చిట్టా పుస్తకాలరూపంలో మనకి అందించడం.

4) మానవుడి అంతరాత్మలోనూ, బైటి విశ్వంలోని గ్రహగోళ కుటుంబంలోనూ ఒకే ప్లాను నడుస్తున్నట్లు ఋజువుచేస్తూ ఆ వివరాలను చిత్రాలతోసహా మాస్టర్‌గారి యోగాడైరీలలో రహస్యంగా ఇచ్చారు.

5) అలాగే మాస్టర్‌గారు తమ ప్రియశిష్యులైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి అనారోగ్యాన్ని అద్భుతరీతిలో నివారించడమే కాక మాస్టర్‌గారు

శ్రీ శాస్త్రిగారికి స్వయంగా అనేక వందలమందికి రోగాలు తగ్గించి ఆరోగ్య దానంచేసే శక్తిని అనుగ్రహంగా ప్రసాదించడం!

6) మాస్టరు CVV-గారి ఈ అద్భుత యోగశక్తి మాస్టర్‌గారు 1922 లో పరమపదించిన తర్వాతకూడా మరింత శక్తివంతమైన 'ఎలక్ట్రానిక్' యోగంగా శరీరంలో 'బ్యాటరీ' (Battery) పెట్టినట్టు పనిచేస్తూండటం ఇంకొక మహత్తర యోగవిజయం!

ఇలాంటివెన్నో అపురూప విషయాలు, ఈ ఆధునిక యోగప్రక్రియ తాలూకు విశేషాలు ఏ యితర యోగులలోనూ కనిపించని ఆధ్యాత్మిక రహస్యాలెన్నో శ్రీవారి జీవితంలో మనకి లభిస్తాయి!



## 2

# అసలు - "యోగం" - అంటే ఏమిటి?

మనలో చాలామందికి అసలు **'యోగశాస్త్రం'** అంటే ఏమిటో సరైన అవగాహనలేదు! కొందరు **యోగం** అంటే ఈ ప్రపంచంలో అన్ని పనులూ మానేసి కళ్ళుమూసుకొని జపం చేసుకోవటమే అనుకుంటారు. మరికొందరు భార్యాబిడ్డలను ఉద్యోగం వృత్తి ఇతర బాధ్యతలనూ తప్పించుకుని భగవంతుడి పేరు చెప్పకొని సోమరిగా నిద్రమత్తులో జోగే అసమర్థ స్వభావులుగా ఊహించుకుంటారు.

అసలు **'యోగం'** అంటే **ఏమిటి?** సైన్సు దృష్టితో యోగాన్ని పరిశోధించిన విదేశీడాక్టర్లు సహితం ఆధునికదేశాలైన జర్మనీ, ఇంగ్లండు, అమెరికావంటి దేశాలలోకూడా అక్కడి డాక్టర్లు, వైద్యులు, 'యోగా'లో శిక్షణా తరగతులుపెట్టి శిక్షణ పొందుతున్నారంటే — యోగాన్ని రోగనివారణకు రోగనిర్ణయానికి (Diagnosis), యింకా మానసిక రోగాలైన డిప్రెషన్ (Depression), హిస్టీరియా (Hysteria), మతిమరుపు, పిల్లలలో బుద్ధి మాంద్యం, పెద్దలలో భయాల నివారణకై మానవజాతికి గల ఏకైక వరంగా

యోగాన్ని స్వీకరించి సైన్సుగా అంగీకరించారంటే భారతీయులమైన మనకే — ఈ '**యోగం**' గురించి **ఎంత తక్కువ తెలుసో** అని — ఆశ్చర్యంవేస్తుంది! అందుకే '**యోగం**' అంటే ఏమిటో కొంచెమైనా తెలుసుకుందాం.

## 'విశ్వ-మనస్సు' :

ఈ విశాల విశ్వంలో గ్రహగోళాలు, సూర్యమండలం (Solar System, నక్షత్రాలూ, గెలాక్సీలు (Galaxies) అనేకం వున్నాయి గదా? — వీటన్నింటినీ, **ఒక కంటికి కనిపించని అదృశ్యశక్తి** — కంట్రోలుచేసి క్రమబద్ధంగా **నడిపిస్తున్నది** — ఆ శక్తిని మనిషి **తెలుసుకోగలడా?**

ప్రపంచాన్ని కంట్రోల్ చేసే ఒక కంప్యూటర్ పరికరంవలే — విశ్వాన్ని నడిపిస్తూ పరిపాలిస్తున్న కరెంట్‌వంటి **ఆశక్తి ఏమిటి?** దీనిని ఒక '**విశ్వవ్యాప్తమైన మానసికశక్తి**' (Universal Mind) — అనవచ్చా?

## 'జడ'సృష్టి - 'చైతన్య'సృష్టి :

నిర్జీవ పదార్థాలైన రాళ్ళూ, ఖనిజాలూ, లోహాలూ, పర్వతాలూ మొదలైన వాటికి భిన్నంగా '**ఆలోచన**', సుఖదుఃఖాల విజ్ఞానం, ధర్మాధర్మాల **వివేకం** కలిగివున్న మనలోని ఈ "ప్రాణం" ఎలా ఏర్పడింది? ఇది ఈ **పదార్థం** (Matter) లోంచి వచ్చిందా? — లేదే? పదార్థం **జడమైంది!** అంటే **తనను తాను** గుర్తించి, తన **ఉనికిని తాను తెలియనట్టి** నిద్రాణమైన (Inert) సృష్టి — **పదార్థ** సృష్టి!

## "ప్రాణా" :

కాని మనలో బ్రతికివున్నవాడికీ, చనిపోయిన శవానికీ ఈ పదార్థసృష్టి సమానమే! — కాని మరణించిన వాడిలో బైటికి వెళ్ళిపోయేది మాత్రం

మనల్ని జీవించి వుండేలాగ చేసేది ఈ **ప్రాణశక్తి** (Vital Prana) అనే ఒక చైతన్యమైన, జీవిస్తూవుండే **ప్రాణశక్తే**!

ఈ ప్రాణశక్తిని మన ఊపిరిద్వారా మన శ్వాసక్రియను క్రమబద్ధంచేసి మనస్సుతోపాటు ప్రాణాన్ని లయబద్ధంచేసి ప్రాణాయామ ప్రక్రియద్వారా మనలో 'జీవించివున్న' "**తాను**" అన్న వస్తువును తెలిసికోగలడా మనిషి?

వేదకాలపు మహర్షులు లక్షల సంవత్సరాల క్రితమే ఈ ప్రశ్నలను తమ అగాధమైన తమ విజ్ఞానంతో వెతికి జవాబులను కనుగొన్నారు! అంతేగాదు. వాటికి సమాధానాలనుకూడా ఈ '**యోగశాస్త్రం**' ద్వారా మానవజాతికి ప్రసాదించారు. ఇందులో కొన్ని మూలసత్యాలను ఇక్కడ తెలుసుకుందాం!

## 'ప్రాణశక్తి' – సైన్సుకు అందదు :

బైటి పదార్థమయ జడసృష్టివేరు. సజీవమైన "**ప్రాణశక్తి**" వేరు! ఈ ప్రాణాన్ని సైన్సు తయారుచేయలేదు. అసలు ఆమాటకొస్తే ఈ విశ్వవ్యాప్తమైన ప్రాణశక్తే మన శరీరాన్ని సజీవంగా వుంచి బ్రతికివుండేలా చూస్తోంది! ప్రతీక్షణం గుండెకొట్టుకోవడం ద్వారా మనల్ని బ్రతికించి వుంచుతోంది!

అంతేకాదు — ఇదే ప్రాణశక్తి మనం తల్లి గర్భంలోంచి పుట్టగానే పురిటిలోనే **ఆకలిరూపంలో** ఆహారాన్ని జీర్ణంచేసి — మన తల్లికూడా మనల్ని బ్రతికించి వుంచలేని విధంగా అప్పుడే పుట్టిన ప్రాణిని — ఆహారంద్వారా ఆకలిద్వారా బ్రతికించి వుంచుతోంది!

మన ప్రయత్నం లేకుండానే జరిగే అనేక 'జీవన ప్రక్రియలు' (Life Processes) అనబడే (1) **శ్వాస** — లేక ఊపిరిని పీల్చటం, (2) **గుండెకొట్టుకోవడం**, (3) మలమూత్ర విసర్జన, (4) **ఆకలీ**, (5) **నిద్రా**, **మెలకువా**, (6) **మృత్యువూ**, (7) **జననమూ**, (8) **సెక్సూ** ద్వారా ఒక (9) '**కాలచక్రం**'

(Life Cycle) లో మనిషిని కట్టివేసి గానుగ చక్రంలాగ (Zodiac = రాశిచక్రం) జీవితాన్ని త్రిప్పుతున్నది.

## గ్రహాలను త్రిప్పే 'గానుగ'–ఏది?

అంటే ఏమిటి? ఏ **"అదృశ్య-శక్తి"** కంటికి కనిపించకుండా ఈ విశాలవిశ్వమంతా వ్యాపించివుండి బైటకనిపించే బ్రహ్మాండంలో సూర్య, గురు, అంగారకాది గ్రహగోళాలను **క్రమబద్ధంగా త్రిప్పుతూ** అనంతకోటి నక్షత్ర మండలాల్ని నిత్యమూ సృష్టించి పోషిస్తూ — ఏది ఈ విశ్వాన్నే నడిపిస్తున్నదో ఆశక్తే నిజంగా (1) మనలోని **"తాను"**గా (2) మనస్సురూపంలో (3) **జీవుడి** రూపంలో, (4) ప్రాణంరూపంలో (5) శరీరానికి రక్తప్రసరణమూ, (6) జీర్ణ ప్రక్రియవంటి అనేక "ప్రాణకర్మ"లనే పనులనూ నిర్వహింపచేస్తున్నది.

ఈ ప్రధాన శక్తిని తెలుసుకోవడానికి టెలిస్కోపులూ, సైన్సుపరికరాలూ, అణుబాంబులూ, రాకెట్లూ పనిచేయవు! సైన్సు అందుకోలేదు.

అగాధమైన లోతులకు వెళ్ళి మన పుట్టుకను — మన పుట్టుకనిచ్చిన ఈ విశ్వాన్ని పుట్టించిన **ప్రధాన భగవచ్ఛక్తినీ** ప్రత్యక్షంగా అర్థంచేసుకొని దర్శించే ఒక సైన్సువంటి శిక్షణే **'యోగశాస్త్రం'!**

## 'సిద్ధాంతం' కాదు – "శక్తి" :

యోగశాస్త్రం ఒక సైన్సు! ఇది చాలామంది మరిచిపోతారు. వేదాంతం లాగా లాజిక్ (Logic) అంటే తర్కంమీదో, లేకపోతే నాస్తికవాదంలాగో తెలివి తేటలూ వాదోపవాదాలమీద ఆధారపడ్డ కేవలం ఒక ఆర్గ్యుమెంటు (Argument) లేక శుష్కసిద్ధాంతం అనుకుంటారు. అదేం కాదు!

ఈ సత్యాన్ని మరచిపోయి మధ్యకాలంలోని బౌద్ధ, క్రైస్తవ, చార్వాక, అద్వైత మతస్థులందరూ కేవలం **వాదోపవాదాలపై** నిలబడి ప్రత్యక్ష

**అనుభవాన్ని** (Direct Experience) **కోల్పోయారు**. దీనివల్లనే వేదమతం ప్రత్యక్షంగా అనుభవంలేని శుష్కమైన వేదాంతంలాగ క్రిందికి దిగజారి పోయింది.

దాంతో **మతానికీ** మనిషి **నిత్యజీవితానికీ** సంబంధం లేకుండా పోయింది! దీనితో బద్ధకస్తులూ, అనుభవంలేని క్రమశిక్షణలేని మతగురువుల చేతుల్లోకిపోయి ప్రపంచంలోని అన్నిమతాలూ దిగజారిపోయాయి. దీంతో "మతం" అంటే — మనిషి జీవితసమస్యలకు సమాధానం చెప్పలేని ఒక మూఢవిశ్వాసంగా మారిపోయింది!

ఎందుకంటే **విశ్వాసాన్ని అనుభవంగా** మార్చే సైన్సుఅయిన 'యోగాన్ని' మరిచిపోవటం వల్లనే! అందుకే ఇరవైయ్యవ శతాబ్ది చివరిభాగంలో సైన్సు కూడా విఫలమైన తరుణంలో, భూమ్మీద మానవజాతి క్షణంలో నశించిపోయే అణుబాంబుల ప్రళయం నిత్యం పీకలమీద కత్తివలే ఏర్పడింది. ఈ విపరీత విపత్కర పరిస్థితిని ఎదుర్కోనలేక అటు **మతమూ** (Religion) ఇటు సైన్సూ (Science) — రెండూ నిస్సహాయంగా నిలిచిపోయాయి.



# 3

# "చిరంజీవులు"-సైన్సు దృష్టిలో?

"యోగం" యొక్క చరమలక్ష్యం జన్మ-మృత్యువులనుండి విముక్తి పొందటమే, అని ప్రాచీన యోగశాస్త్రగ్రంథాలు తెలుపుతాయి! 'మాస్టరు CVV' యోగం శ్రీ అరవిందుడు, జ్యోతిరామలింగస్వామి వంటివారు — "మృత్యువుపై విజయం" తమకు లక్ష్యంగా ఎంచుకున్నారు. ఐతే మృత్యువును జయించటం ఎలాసాధ్యం? 'చిరంజీవులు' — అనబడే మహాత్ములు మార్కండేయునిలా మృత్యువును 'జయించినవారేనా? మనిషి మృత్యువును జయించడమనేది నేటి వైద్యశాస్త్రంనుంచీ ఆధునిక యోగులైన గుర్జీఫ్, శ్రీ అరవిందయోగి, శ్రీరమణమహర్షి, వడలూరు రామలింగస్వామి వంటివారిదాకా గొప్పలక్ష్యంగా నిలిచింది గాని, వీరిలో ఈ ఆధ్యాత్మికలక్ష్యాన్ని సంపూర్ణంగా చేరుకోగలిగింది ఒక్క జ్యోతి రామలింగస్వామివారే! అందువలన ఈ మహాయోగుల జీవిత చరిత్రలను తులనాత్మకంగా పరిశోధించితే మనకి అనేక యోగరహస్యాలు లభిస్తాయి!

మానవచరిత్రలోచూస్తే ఇలా మృత్యువును జయించిన యోగులు గతంలో అనేక మంది కనిపిస్తారు!

అనాదిగా అనేకమంది యోగులు, మహాత్ములు జనన మరణాల నుంచి శాశ్వతంగా విముక్తిని సాధించాలని ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు! అలాంటి వారిలో మహర్షులు, సిద్ధగురువులు, యోగీశ్వరులెందరో చేరి వున్నారు. అటువంటి ఉదంతాలను ఎన్నింటినో మన పురాణాలలోకూడా ఈనాటికీ స్పష్టంగా గమనించవచ్చు!

ఉదాహరణకు :-

1) **మార్కండేయమహర్షి** చిన్నతనంలోనే తనకు 16 ఏళ్ళుమాత్రమే ఆయుష్షువున్నదని తెలిసి మృత్యుంజయుడైన పరమశివునికి శరణాగతిచేసి యమధర్మరాజుని సహితం జయించి **చిరంజీవత్వాన్ని** పొందాడని తెలుస్తుంది. అంతేకాక ఆయన అనేక **యుగాలు** జీవించాడనడానికి తార్కాణంగా మహాభారతకాలం వరకు చిరంజీవుడైవుండి పాండవులకు వనవాసంలో శరీరంతో వారికి దర్శనమివ్వడమేకాక కొన్నిరోజులు వారి ఆశ్రమంలోవుండి — "రానున్న **ప్రపంచ భవిష్యత్తునూ, కలియుగాంతంలో** వచ్చే **ప్రళయాలు, కల్కిభగవానుని అవతారం**" గురించి భవిష్యత్తుగా తెలిపిన అనేక వివరాలను శ్రీ వేదవ్యాస మహర్షి మహాభారతం అరణ్యపర్వంలో గ్రంధస్థంచేశాడు!

## "సనాతన - ధర్మం" :-

2) అలానే సృష్ట్యారంభంలో 'బ్రహ్మమానస-**పుత్రులు**'గా సాక్షాత్తుగా బ్రహ్మలోకంనుంచి అవతరించిన '**నిత్యముక్తులు**'గా నిలిచివున్న సనత్కుమార, సనక సనందన, సనత్సుజాత, సనాతన మహర్షులు — **శరీరంతోనే చిరంజీవులై** వుండి శ్రీకృష్ణప్రభువు ముత్తాతగారైన యదుమహారాజుకు దత్తాత్రేయులు

నారాయణఋషితోసహ దర్శనమిచ్చి అనేక యోగరహస్యాలను ఉపదేశించి నట్లు, శ్రీకృష్ణప్రభువే, తన అవతారం చివరలో ఉపదేశించాడు!

## "సనాతన"–ధర్మం అంటే? :

ఇట్టి మహర్షులలో **సనాతనుడు** మానవజాతికి అందించిన బ్రహ్మావిద్యా సారమే దేశకాలాలకు అతీతంగా చెక్కుచెదరని **"సనాతనధర్మం"**గా నిలిచి పోయింది! ఈ **'సనాతన ఋషి'**యొక్క ఉపదేశసారమే — **సనాతనధర్మం!** అదే సమస్తవేదాల సారం.

3) తర్వాతకాలంలో వ్యాసమహర్షి పుత్రుడైన శుకయోగి చిరంజీవత్వాన్ని సాధించి పరీక్షిత్తు మహారాజుకు కేవలం **ఏడు రోజులలోనే** ముక్తిపొందే మార్గాన్ని అందించాడు శ్రీమద్భాగవతం ఏకాదశస్కందం రూపంలో!

4) తర్వాత అనసూయ అత్రి మహర్షుల పుత్రుడై అవతరించిన **దత్తమూర్తి** త్రిమూర్తుల అంశతో జన్మించి ఇప్పటికీ అనేకమంది భక్తులను అనుగ్రహిస్తునే వున్నాడు చిరంజీవుడై నిలిచి! ఈ మహానుభావుని జన్మదినాన్నే మార్గశిరశుద్ధ పూర్ణిమనాడు "గురుపూర్ణిమ"గా డిసెంబరునెలలో భారతదేశ మంతటా జరుపుకుంటున్నాము!

నేటికీ దత్తప్రభువుయొక్క అవతారములు అనేకం ప్రఖ్యాతిగాంచాయి! అందులో షిరిడీ సాయినాధుడు నిన్నమొన్నటివరకూ జీవించి ఖండయోగాన్ని సాధించి మూడురోజులపాటు భౌతికశరీరాన్ని వీడి **మరణించి** — తిరిగి **జీవించిన** 'మృత్యుంజయుడి'గా అద్భుత అనుభవం శ్రీ సాయినాథచరిత్ర పారాయణచేసే భక్తులందరికీ చిరపరిచితమే! వారందరూ మహర్షుల సాంప్రదాయానికి చెందిన **సిద్ధ గురువులే!**

5) ఇక ఆధునిక కాలానికివస్తే **మాస్టర్ C.V.V.** అన్న పేరుతో

కుంభకోణంలో 4-8-1868 అవతరించి 12-5-1922న శరీరత్యాగం చేసిన **మాస్టర్** C.V.V. గారు, తెలుగు నియోగి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన వారు పరమ గురువు కావడం తెలుగువారైన మనకందరికీ ఎంతో గర్వ కారణం! ఈయన **'కంచుపాటి'** అన్నఇంటిపేరుతో తెలుగు నియోగి బ్రాహ్మణులైన శ్రీ వెంకట్రావుగారి దత్తపుత్రునిగా **వెంకాస్వామిరావు** అన్న నామధేయంతో **మాస్టర్** C.V.V. అన్న పొడి అక్షరాలనే మంత్రంగా నూతనయోగాన్ని **'భృక్త రహిత తారక రాజయోగం'**గా ప్రసాదించిన మహనీయుడు!

మానవుడిని రోగములనుండి, బాధలనుండి, దుఃఖంనుండి శాశ్వతంగా విముక్తిచేసి **ఒకే జన్మలో** మోక్షాన్ని సాధించిపెట్టగల యోగంకోసం ప్రత్యేక సాధనలు చేసారు **మాస్టర్** C.V.V.! ఫలితంగా 29-5-1910 తేదీన **హేలీ తోకచుక్క** (Halley's Comet) నుండి ఒక విద్యుత్తువంటి మెరుపుతో తన శరీరంలోకి ఒక దివ్యశక్తి ప్రసరించగా సిద్ధపురుషత్వం సిద్ధింపచేసుకొని తానే పరబ్రహ్మనని గుర్తించి ఇంగ్లీషుమంత్రాలతో ఈ నూతనయోగాన్ని అనేకమంది యోగమిత్రులకు ఉపదేశించాడు! ఇది యోగసాధనలోను రోగనివారణలోనూ ఆంధ్రదేశమంతా ప్రఖ్యాతిపొందిన మహాపండితులు పరిశోధకులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి దివ్యానుభవాలలో నేరుగా **మాస్టర్** C.V.V. **వద్దనుండి** అద్భుత యోగాన్ని ఉపదేశంగా పొందినగాథను వారి ఆత్మకథ నుండి వెన్నవలే సారంగాతీసి మీకందించాను ఈ గ్రంథంలో!

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి అనేక రోగాలతో బాధపడి మందులతో నయంకాక ఇక ఆత్మహత్య ఒకటే శరణ్యమని దుఃఖపడుతున్న సమయంలో **మాస్టర్** C.V.V. అనుగ్రహం ఎలా లభించిందో వివరిస్తూ తర్వాతి కాలంలో తనవలే బాధపడే అనేకమంది రోగులకు శాశ్వతరోగ విముక్తిని ప్రసాదించే

మాస్టర్‌యోగం ప్రార్థనను తమఇంట్లో ప్రతినిత్యం నిర్వహించి తన జీవితపు ఆఖరిశ్వాస దాకా మానవసేవ చేసిన అరుదైన మనీషి!

ఇదేకాక మనిషికి — **జన్మించినవానికి మరణం** తప్పదనే సిద్ధాంతం **'తప్పు'** — అని ప్రకృతియే ఎలా నిరూపిస్తున్నదో గమనింతాము! గొంగళి పురుగు నిరంతరం పచ్చి ఆకులు మేస్తూ బ్రతికే నికృష్టజీవి — అకస్మాత్తుగా తన తిండిని ఆపేసి ఒక దీర్ఘమైన నిద్రావస్థలో గూడు కట్టుకొని ఆహారమూ శ్వాసా లేకుండా ఒక యోగ సమాధివంటి స్థితికి వెళ్ళిపోయి నిద్రావస్థలో తిరిగి తన శరీరాన్ని బద్దలు కొట్టుకుని బయటికివచ్చి — రంగురంగుల సీతాకోకచిలుకలాగా తిరిగి అవతరించే **యోగప్రక్రియద్వారా ప్రకృతియే** మానవుడికి మృత్యువునుండి తప్పించుకునే **మార్గాన్ని** చూపిస్తోంది! సీతాకోక చిలుక తన జీవితంతోనే ఎంతో రమ్యంగా అందంగా సైన్సు సాక్ష్యాలతో ఋజువుపరుస్తూ, తద్వారా మాస్టర్ యోగంద్వారా చిరంజీవత్వాన్ని సాధించటం సైన్సుప్రకారం సాధ్యమేనని ప్రకృతిసూత్రంగా నిరూపించింది!

ఇట్టి తరుణంలోనే 1910 ప్రాంతంలో రష్యాలోని సిద్ధపురుషుడు **శ్రీజార్జి ఇవానోవిట్జ్ గుర్జీఫ్** (G.I.Gurdjieff) ద్వారానూ, మనదేశంలోని కుంభకోణంలో **మాస్టర్ CVV యోగం**గానూ, — ఇంకా పాండిచ్చేరిలో **అరవిందయోగికి** శ్రీకృష్ణుని అనుగ్రహంరూపంలోనూ, — మరెక్కడో దూరాన అరుణాచలం పర్వతంపైన **శ్రీరమణమహర్షి** 14 ఏళ్ళ బాలకుడిగా ఉండగానే అద్భుతంగా ప్రత్యక్ష మైన అరుణగిరిజ్యోతిగానూ — పైనుండి ఈ అద్భుత మైన **"భగవత్‌శక్తి"** భూమిమీద **అవతరణం**కావడం జరిగింది.

అంతేకాదు యదార్థంగా **అనుభవంలోకే** వచ్చింది! ఒక నిద్రలాగా, మెళకువలాగా మనిషికి తెలిసేలాగా ఈ భగవచ్ఛక్తి **శరీరంలోకి** దిగటం మొదటిసారిగా ఈ మహనీయులే గుర్తించారు!

వీరిద్వారా అనేక మంది రోగపీడితులు సైన్సుకందని మానసిక శారీరక బాధలతో అలమటించి పోయే దురదృష్టవంతులకూ ఈ '**భగవచ్ఛక్తి**' ఒక 'కరెంటు'లా శ్వాసద్వారా శరీరంలోకి దిగి, వారి బాధలను మాయంచేసింది! దానితో **యోగం** ఒక్కసారిగా ఇటు సైన్సు దృష్టిగలవారికి **సైన్సుగానూ**, అటు ఆధ్యాత్మిక దృష్టిగలవారికి ఒక **భగవచ్ఛక్తిగానూ** — బాధితులైన రోగులకు **తరణోపాయంగానూ** — అవతరించింది.

## విశ్వరహస్యాలు తెలిపే 'విద్య' :

ఇంతేకాదు! ఈ మహత్తర "**యోగావతరణ**" వెనుక అనేక విశ్వ రహస్యాలు మునుపెన్నడూ మనిషికి అంతుపట్టనివి అనేకం స్పష్టంగా మబ్బుతెరలు వీడినట్లు సూర్యుడు తెరతీసినట్లు మనిషి మేధస్సుకు పైన వుండే పరబ్రహ్మతత్త్వాన్ని **ప్రత్యక్షంగా దర్శించే** విధానంకూడా మానవజాతికి వరంగా లభించింది.

ఇందులో వీరు కనుగొన్న మహత్తర సత్యాలను ఈ మహాత్ములు మనకందించిన వాటిలో ముఖ్యమైనవి ఇవి :-

(1) ఈ విశాల విశ్వంలో సూర్యుడూ, గ్రహాలూ, నక్షత్రాలూ తమ తమ విధులను నిర్వహించినట్టే — మన శరీరంలోని, మెదడూ, గుండె, మూత్రపిండాలు, ఊపిరితిత్తులూ, నాడీమండలమూ — అన్నీ ఒక క్రమబద్ధమైన చిన్న ప్రపంచంవలే నడిపించబడుతున్నవి.

(2) బైటవుండే విశాల ప్రపంచానికి "**బ్రహ్మాండ**" మని పేరు! మన లోపల వుండే ఈచిన్ని ప్రపంచానికి "**పిండాండ**" మని పేరు!!

(3) ఇదే ఏర్పాటుతో — చిన్ని అణువులోకూడా పరమాణువులు నిరంతరం పరిభ్రమిస్తూ ఒకచిన్న **సూర్యమండలముగానూ** — యింకా

అనేక నక్షత్ర మండలాలలోనూ అతి చిన్నరూపంలో పరమాణువు లోనూ చోటుచేసుకునివున్నాయి.

అటు **అణువు** లోపలా — యిటు విశాల **విశ్వంలోనూ** ఒకటే దైవశక్తి కంటికి కనిపించకుండా కరెంటువలే లోపలవుండి అన్నింటినీ 'కాలం' లాగా నిత్యం తిరుగుతూ వుండేలాగ **'శ్వాస'**, రక్తప్రసరణ, గుండెకొట్టుకోవటం, నాడీస్పందనలద్వారా బ్రతికించి వుంచుతున్నది.

(4) ఈ **భగవచ్ఛక్తిని** తెలుసుకోవడం మనిషికి **సాధ్యమే!** దీనికి కావలసింది — తన చిన్న మెదడుతో విశ్వాన్ని కొలవడానికి ప్రయత్నించే **అహంకారం** కాదు తన చిన్న 'అహం'ను ఆహుతిచేసే — **ధ్యానం!**

(5) ధ్యానం అంటే **ఆలోచన కాదు!** ఈ ఆలోచనలు **ఎక్కడినుండి** పుట్టుకొనివస్తాయో అక్కడినుంచే **ధ్యానమూ** ఉద్భవిస్తుంది. ఆకాశం లోని మబ్బులవంటివైతే **ఆలోచనలు** — ఆ మబ్బులవెనుక నిర్మలంగా ప్రకాశించే **ఆకాశం** వంటిదే — **మనస్సు!**

(6) ఈ ఆకాశానికి యింకా పైగా — బుద్ధికి అందకుండా నిలిచి అన్నిటినీ నియంత్రించేది **'కాలం'!**

ఈ కాలాన్ని మనిషి కంట్రోలుచేయలేడు — కాలమే మనిషిని కంట్రోలుచేస్తుంది జననం - మరణం రూపంలో!

అంతేకాదు — ఈ "యోగం" మనం **పుట్టకముందు** ఎక్కడి నుంచి వచ్చామో, మరణించాక తిరిగి ఎక్కడికి వెడతామో ఆ ఆదిమూలమైన, విశ్వజన్మ స్థానమైన పరబ్రహ్మతత్వాన్ని మనకు, మరణించకముందే జీవించివుండగానే మనలోపల్నుంచే చూపించ గలదు.

(7) ఒక ఇంటిలో కూర్చున్నవాడు ఇంటిలోంచి బైటికి వెళ్ళకుండానే తన కిటికీ తెరచి బైటి సూర్యుణ్ణి చూసినట్టే, ఆ **కిటికీలోంచే** బైటి సూర్యుని ఎండా, కాంతీ, వెచ్చదనమూ లోపలుండి అనుభవించినట్లే — ఈ యోగప్రక్రియ ద్వారా మనస్సు అనే కిటికీతలుపులు తెరిస్తే — మనస్సుకు పైనవున్న భగవంతుడి శక్తి మన బుద్ధి అనే కిటికీద్వారా శరీరంలో ప్రవేశించి మన **జీవితాన్నే మార్చివేస్తుంది.**

(8) అప్పుడు పరిమితమైన **స్వార్థజీవిగా** జీవించే మానవుడు అపరిమిత భగవచ్ఛక్తితో కలిసి జీవించే అవతారమూర్తిగా, **భగవత్స్వరూపునిగా** మారిపోతాడు.

అప్పుడే మనిషికి **జరుగబోయే** భవిష్యత్తూ, కాలమూ, జరిగి పోయిన కాలమూ — సమస్తం **దివ్యదృష్టికి** గోచరిస్తాయి. అసాధ్య మనుకున్నవన్నీ సాధ్యపడతాయి.

(9) చరిత్రలో యిలాంటి అద్భుతానుభవాన్ని యదార్థంగా అనుభవించిన వారే శ్రీరాముడూ, శ్రీకృష్ణుడూ వంటి అవతారమూర్తులూ, సిద్ధపురుషులూ, జీవన్ముక్తులైన మహర్షులూ!

వీరిద్వారానే **యోగశాస్త్రం** ప్రపంచానికి ఒక సైన్సులాగ సూత్రబద్ధం చేయబడి అందించబడింది.

(10) అలాంటివారిలో **పతంజలిమహర్షి** అతిప్రాచీనుడు, **"యోగం"** అనే వేదశాస్త్రానికి మూలపురుషుల్లో ముఖ్యుడు.

(11) అలాగే కృతయుగంలో అవతరించిన విష్ణుభగవానుని అవతార మైన **కపిలమహర్షి** యోగశాస్త్రానికి రెండవ మూలగురువు.

(12) కాలక్రమేణా మానవజాతి పోగొట్టుకున్న ఈ యోగశాస్త్రాన్ని తిరిగి భూమికి తెచ్చి ఉపదేశించిన విశ్వగురువు **శ్రీకృష్ణభగవానుడే!**

(13) ఆ తరువాత అనుభవశూన్యమైన వాదోపవాదాలలో పడి సిద్ధాంతంగా మతం రూపంలో మిగిలిపోయిన ఇప్పటి ప్రపంచ మతాలన్నిటినీ సైన్సు కూలద్రోసింది!

(14) మానవుడికి తిరిగి ఆధ్యాత్మిక అనుభవాన్ని అందించగలిగేది ఒక్క సైన్సువంటి యోగశాస్త్రమే అని **మాస్టర్ CVV యోగాకోర్సులు** (Courses) అనబడే **ఇంగ్లీషు మంత్రాలద్వారా** మన **నిత్యజీవితంలో** భగవచ్ఛక్తిని ప్రత్యక్షంగా అనుభవించి దాని ద్వారా రోగనివారణ, మనశ్శాంతీ, ఆరోగ్యమూ, బలంతోపాటు పరిపూర్ణ **ఆత్మజ్ఞానం** ఆపైన మన **ఆత్మకు** పైన వుండే పరబ్రహ్మజ్ఞానం అనుభూతిగూడా పొంద వచ్చునని నిరూపించినదే **మాస్టర్ CVV** యోగం!

ఇందులో మనలోని యోగచక్రాలు వెన్నుపూసనుండి క్రమంగా క్రిందికి గ్రహమండలాలులాగా తీర్చబడివున్నాయి. మన శరీరంలోని గ్రహాలే ఈ యోగచక్రాలు! కంటికి కనిపించే బైట తిరిగే గ్రహాలలో కంటికి కానరాని ఛాయాగ్రహాలైన **రాహుకేతువులవంటిదే** మనిషి శరీరంలో నిద్రాణంగావుండే **"కుండలినీశక్తి!"**

ఒక్కమాటలో చెప్పాలంటే — మనిషే **జీవించే విశ్వం!!!**

ఇది తెలుసుకుని అనుభవంలో రుచిచూస్తూ సుఖదుఃఖాలకు అంట కుండా ఒక బాల్య క్రీడవలే ఆనందిస్తూ లీలామాత్రంగా జీవించడమే — **జీవన్ముక్తస్థితి!** అట్టి మహాత్ములనే మనం నిజంగా **'కదిలేబ్రహ్మమూ - నడిచే దైవమూ'** అని పిలుస్తాము.



# 4

# "మాష్టరు"-అనగా ఎవరు?

చాలామంది మనలో **మాస్టర్** CVV పేరు విన్నంతనే ఆశ్చర్యంతో ప్రశ్నిస్తారు — **"మాస్టర్" అంటే ఎవరు?** ఈ మాస్టర్ అన్న ఇంగ్లీష్ పదానికి సరైన తెలుగుమాట ఏమిటి? అసలీ **మాస్టరు** అన్న పేరుతో పిలవబడేవారు ఎలాంటి వ్యక్తి!

మాస్టర్ CVV గురించిన — **మాస్టరు** అన్న పై ప్రశ్నను అర్థంచేసుకోవాలంటే ఈ 20వ శతాబ్దం ముందరిభాగంలో ప్రపంచంలో జరిగిన ఆధ్యాత్మికచరిత్ర నేపథ్యం కొంత తెలియాలి! అదేమిటో తెలుసుకుందాం!

గత అధ్యాయాలలో రష్యన్ యోగిని మేడమ్ బ్లావెట్స్కీ గురించి ఆమె సద్గురువులైన 'మాస్టర్స్' అనబడే సిద్ధపురుష యోగ మండలి గురించి కొంచెంగా తెలిపాను! ముందుగా మాస్టర్ అన్న ఈపదాన్ని వాడిందీ, ప్రచారంలోకి తీసుకొనివచ్చిందీ **మేడమ్ బ్లావెట్స్కీ** అనబడే రష్యన్ యోగినీ, రచయితా, **దివ్యజ్ఞాన సమాజం** (Theosophical Society) స్థాపకురాలు!

ఆమె జీవితంలో ఈ మాస్టరు అనబడే మహాపురుషులతో ఆమెకు ఉన్న సంబంధం ఎలావచ్చిందో ఆమె జీవితంలోని కొన్ని రహస్యఘట్టాలు తెలిస్తేనే కాని తెలియదు!

రష్యన్ రాజకుటుంబంలో "హెలీనా పెట్రోవ్నా బ్లావెట్స్కీ" (Helena Petrovna Blavasky) 19వ శతాబ్దం చివరిభాగంలో 13-ఆగష్టు తేదీన జన్మించింది! ఈమె బాల్యంనుంచీ ఇహలోక వాంఛలులేని పవిత్ర భావనలు కలిగివుండే బాలిక! నిత్యం ధ్యానం అంటే, ఆధ్యాత్మిక విషయాలంటే ఎంతో ఆసక్తిగా వినేది! ఎంతో తన్మయత్వంతో మనసు ఏకంచేసి లీనమైపోయేది!

అప్పటి సాంప్రదాయాలనుసరించి బ్లావెట్స్కీకి 13 ఏళ్ళురాగానే వివాహం చేయాలని తలపెట్టారు! కాని ఈమె బంధాలన్నీ మనిషిని పశుత్వంలోకి నెట్టే సెక్సు-బంధాలుగా ఏవగించుకునేది! శాయశక్తులా వివాహాన్ని తప్పించుకోవాలని ప్రయత్నించింది! కాని బలవంతంమీద 17వ ఏట ఒక సైనికాధికారితో పెద్దలు పెండ్లి జరిపించారు!

బ్లావెట్స్కీకి చిన్నతనంనుంచీ కొన్ని విచిత్రమైన అనుభూతులు జరిగేవి! ఒకసారి ఎత్తైన గోడమీద దేవతామూర్తుల పటాన్ని ఆమె గోడకు మేకుతో కొట్టి సరిచేస్తూండగా తూలి క్రిందపడింది! ఆ దెబ్బకు నిచ్చెనపైనుండి క్రిందపడి ఎముకలు విరగాల్సి వుండేదే! కాని ఆశ్చర్యంగా పైనుంచి పడుతూనే మధ్యలో ఆగి — క్రింద పడిపోకుండా తమాయించుకుని భద్రంగా దిగింది! ఆసమయంలో క్రింద నిచ్చెన పట్టుకున్న ఒక బంధువుతో ఆమె — కిందపడకుండా ఆకాశంలో నిలిచి, ఒక మహాత్ముడు తన స్పటికం లాగా గాజు లాంటి చేయిని చాపి నిచ్చెన మీదనుంచి పడుతున్న తనకి ఊతమిచ్చి రక్షించాడని చెప్పింది! ఎవరూ నమ్మలేదు! కాని తర్వాత గోడమీద పరిశీలనగా చూస్తే దుమ్ముతో నిండిన ఆ పటం క్రింద **అరచేతి అచ్చు**

— స్పష్టంగా కనిపించింది! అది బ్లావెట్స్కీ చేయికన్నా ఎంతో పెద్దది! పొడుగాటి కణుపులు తేలిన వేళ్ళతోవున్న పురుషుని చేతిముద్ర — అది! ఇలాంటి అనుభవాలు తరచూ జరిగేవి!

ఒక్కోసారి ఆమె ఉదయమే లేచి ధ్యానంలో మునిగిపోయేది! ఎవరో మాట్లాడుతున్నట్టు చిరుగజ్జెలు మోగుతున్నట్టు ఆకాశంలో సున్నితమైన పొగవంటి పొగమంచులాంటి దేవతలు తలపై ఎగురుతున్నట్టు గులాబి సెంటు, అగరు వత్తులు పరిమళం ఎక్కడినుంచో గుప్పుమని వచ్చినట్టు అనిపించేది! మగత నిద్రలాగా వచ్చి గంటల తరబడి ధ్యానంలో మునిగి పోయేది!

ఈ దశలోనే ఈమె వివాహం బలవంతంగా చేయడం జరిగింది! భర్త బలవంతంగా సంసారం చేయాలని ప్రయత్నించడంతో విసిగిపోయిన బ్లావెట్స్కీ రహస్యంగా ఎవరికీ తెలియకుండా రాజమందిరం వంటి ఎత్తైన భవనంనుండి దూకి — దట్టమైన మంచులో చీకటిలో ఇల్లువిడిచి పరారై పోయింది! ఇదే ఆమె ఆఖరి సమావేశం — తన కుటుంబంతో! ఆతర్వాత అయిదేళ్ళపాటు బ్లావెట్స్కీ గురించి సమాచారంకాని, భోగట్టాకాని లేకుండా ఎవరికీ ఈమె ఎక్కడవుందో పత్తాలేదు!

ఆతర్వాత అమెరికాలో ఇంగ్లండులో వార్తాపత్రికలలో ఒక వింతైన రంగురంగుల డ్రస్సులువేసుకొని రకరకాల దేశాల భాషలు మాట్లాడుతూ గాలిలో తన చేతిని వూపి వారికి తీపి దినుసులు, రాసుకునే పెన్నులు, చాక్లెట్లూ డిన్నరు స్పూను (Spoons), ఫోర్కుల (Fork) వంటి పరికరాలు అద్భుతంగా తీసి ఇస్తుండేది! ఇలా బ్లావెట్స్కీ అద్భుతంగా గాలిలోంచి తీసిన వస్తువులలో ఉంగరాలు, ఉంగరపు రాళ్ళు, పెన్ను, స్పూను, ఫోర్కుల వంటి భోజన పరికరాలూ ఇప్పటికీ మ్యూజియంలో భద్రపరచి వుంచారు!

దీంతో ఈమె పేరు సమాజంలో, పత్రికలలోనూ, వార్తలలోనూ గుప్పుమంది!

ఈమె దాదాపు 89 ఏళ్ళు జీవించింది! ఈజిప్టు (Egypt), టిబెట్ (Tibet), మెక్సికో (Mexico), కాశీ, గయ, ప్రయాగ, మద్రాసు, ఊటీ, ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలోని అనేకమంది మహాత్ములను చూసింది! 'కీరో' (Cheiro) కలిసింది జాతకం చెప్పించుకుంది! తాను కూర్చున్నచోటనే గదిలో రాసుకుంటూ — ప్రపంచంలోని లండన్, ప్యారిస్, న్యూయార్కు వంటి నగరాలలో పెద్దపెద్ద లైబ్రరీలలోవున్న గ్రంథాలను దివ్యదృష్టితో చూసి కావలసిన వాక్యాలను ఎత్తి తన పుస్తకంలో వ్రాసింది యథాతథంగా!

అలానే ఈమె శరీరంలోకి సిద్ధగురువులు ఆవేశించి వేరువేరు విషయాలను వ్రాస్తూవుండేవారు — అప్పటి అమె ముఖ కవళికలుకూడా పూర్తిగా మారిపోయేవి! ఆ పేజీలలోని దస్తూరి, చేతివ్రాతకూడా పూర్తిగా మారిపోయి వుండేది!

ఇలా తన సద్గురువులైన హిమాలయపర్వతాలలో వున్న ఋషీశ్వరులే ఈ దివ్యజ్ఞానాన్ని తనద్వారా ప్రపంచానికి అందిస్తున్నానని ఆమె ఋజువు చేసింది!

అంతేకాక తరచు ఆమెకు — రైలులో ప్రయాణిస్తున్నా లేక లండన్, ప్యారిస్, న్యూయార్కు నగరాలమధ్యన సముద్రంమీద ఓడలో ప్రయాణిస్తున్నా సరే — **ఆకాశంలోంచి ఉత్తరాలు రాలిపడేవి** — ఆమె సద్గురువులనుంచి!

ఇలాంటి జాబులు దాదాపు నూరుదాకా దివ్యజ్ఞాన సమాజంవారు ప్రింటు చేయించారు పరమగురువులవారి దస్తూరితోసహా!

ఒకసారి లండన్‌లోనూ, ఇంకోసారి న్యూయార్కులోనూ ఒకపెద్ద ఊరేగింపు రాజపట్టాభిషేకం ఉత్సవాలలోనూ నడిచివెళ్తున్న ఒక పొడుగాటి

ఆజానుబాహులైన వ్యక్తినిచూసి బ్లావెట్స్కీ గుర్తించి — కిటికీలోంచి చూపిస్తూ — అరుగో నా "మాస్టర్" అని తన మిత్రులకు చూపింది! దీనితో మాస్టరు అన్న పదం ఇంగ్లీషుభాషలో విస్తృతంగా ప్రచారమైంది!

ఇలా హిమాలయ పర్వతాలలోవుండి అక్కడనుంచే ఉత్తరాలద్వారా ఈమెతో నిత్యం ఏడుగురు మహాత్ములు రాసిన జాబులు — అనేక విషయాలను ఆశ్చర్యంగా వివరిస్తాయి! ఈమెకు కష్టాలుగాని, సమస్యలుగాని ఎదురైనప్పుడు వారినుండి సహాయము, ఆశ్రయమూ లభించేది! ఒకసారి ఈమె తనకు గురుదేవుల ఉత్తరం గాలిలోంచి వచ్చి రాలి బ్లావెట్స్కీ ప్రయాణిస్తున్న రైలుపెట్టెలో పడింది! దాంట్లో అర్జెంటుగా సమాధానం రాయమని వున్నది!

పక్కనేవున్న ఆల్కాట్‌దొర — "నీగురుదేవులకు సమాధానం ఎక్కడికని రాస్తావు? అడ్రసులేదు ఎలా?" అన్నాడు వెటకారంగా నవ్వుతూ!

మారు మాట్లాడకుండా బ్లావెట్స్కీ ఒక కాగితంమీద తన గురుదేవులకు సమాధానం రాసి మడతపెట్టి దానిపై తన "గురుదేవులకు" అని రాసి రైలుపెట్టెలోంచి బయట వేగంగా వీస్తున్న గాలిలోకి వదిలేసింది!

ఆ కాగితం గాలికి కొట్టుకొనిపోయింది! — కాని ఆశ్చర్యంగా గంట సేపట్లో బ్లావెట్స్కీ సమాధానం తనకు అందినట్టుగా హిమాలయపర్వతాల నుండి గురుదేవులనుంచి సమాధానం వచ్చింది! ఇవన్నీ తన 'మాస్టరు' పదవిలోవున్న సద్గురువులు తనపై చూపే అనుగ్రహం అని ఎన్నోసార్లు తెలిపేది!

అంతేకాదు ఈ మాస్టరు పేరుతో అనేకమైన ఆశ్చర్యాలు చేసిన వ్యక్తులు వేరువేరు శరీరాల్లో వేరేవేరే దేశాల్లో రకరకాల పేర్లతో చలామణి అవుతున్నారని చెప్పేది! టిబెట్‌లోని ఈమె సద్గురువు ఒక సైనికాధికారి

వేషంలో అమెరికాలో పనిచేస్తున్నారు — యూరోపియన్ శరీరంతో!

అనేకసార్లు లండన్‌లో, న్యూయార్కులో, పారిస్‌లో ఈమె సద్గురువైన **మాస్టరు K.H.** మహాశయులు స్వయంగా ఈమె గదిలో ప్రత్యక్షం కావడం తిరిగి గది తలుపులన్నీ గడివేసి వుండగానే గోడలోంచి కరిగిపోయి మెరుపు మెరిసినట్టు మాయం కావడం ఆల్కాట్‌దొర కూడా అనేకసార్లు స్వయంగా చూశాడు! ఇలా మహాత్ములైన **మాస్టర్** సద్-గురువులు ఒకరు దక్షిణ భారత దేశంలో మద్రాసు సమీపంలో ఒక బ్రాహ్మణ శరీరంలో వున్నారని చూచాయగా బ్లావెట్స్కీ అప్పుడు కుంభకోణంలో **మాస్టర్ CVV** గారు జీవించివుండగానే తన రచనలో సూచించింది!

ఒకసారి తన సద్గురువులను చూడాలన్న బెంగ పెరిగిపోయి బ్లావెట్స్కీ స్వయంగా మంచు శిఖరాలున్న టిబెట్‌లోకి మారువేషంలో కొందరు ప్రయాణికులతో కలిసి గుర్రంపై రహస్యంగా చేరుకుంది! ఆరోజుల్లో విదేశీ యులు టిబెట్‌లోకి ప్రవేశించడం నిషేధం! ప్రతీచోటా కొండపైకి వెళ్ళేదారిలో కాపలావాళ్ల చెక్‌పోస్టుఉండేది! మరికొంతమంది మంచు తుఫాను గాలులు అడ్డం వచ్చి వెనక్కి మళ్ళాల్సి వచ్చేది! అలా జరిగినప్పుడల్లా బ్లావెట్స్కీ తన గురుదేవులను ప్రార్థిస్తూ ఆటంకాలను దాటుకొని పోసాగింది! చివరకు టిబెట్‌లో కాంచన గంగ గౌరీశంకర్ పర్వతశిఖరాలను దాటి, మానససరోవరం మీదుగా ప్రయాణిస్తూ ఒక ఎత్తైన లోయవద్ద తన గుర్రాలను ఆపి ఆమె విశ్రాంతి తీసుకుంటోంది!

ఇంతలో నలుగురు ఆజానుబాహులైన వ్యక్తులు — పెద్దపెద్ద గుర్రా లపై స్వారీచేస్తూ ఎదురుగా వచ్చి ఆ లోయవద్ద ఆగారు! ఇంతలో అకస్మాత్తుగా "ఇక్కడ బ్లావెట్స్కీ ఎవరు?" — అని తనపేరు రహస్యంగా ఎవరికీ తెలియకుండా ప్రయాణిస్తున్నాసరే — వారు పిలవడంతో కంగారు

పడిన బ్లావెట్స్కీ — వినయంగా ఆ గుర్రంమీద వచ్చిన వ్యక్తులముందు నిలబడింది!

పొడుగాటి గడ్డమూ, విశాలమైన నుదురూ ఎత్తైన గద్దముక్కువంటి కోటేరుముక్కు వెడల్పైన ఛాతీకలిగిన నలుగురు వ్యక్తులు దృఢంగా బలిష్టంగా తేజస్సుగా వున్నవారు తనను, పేరుపెట్టి పిలిస్తే ఒకసారిగా ఉలిక్కిపడింది బ్లావెట్స్కీ! వారు ఆమె దగ్గరికి రాగానే "నీవు శంబలకు రావాలని ప్రయత్నిస్తున్నావు! దీనికింకా టైం రాలేదు! ఇప్పుడు వెనుదిరిగి పో! మమ్మల్ని చూడాలని బెంగపడుతున్నావు గనుక, మేమే ఇక్కడికి వచ్చి నీకు దర్శనమిస్తున్నాం!" అనిచెప్పి చిరునవ్వుతో ఈమెకు గుర్తువచ్చేలాగా ఒక **సంజ్ఞచేసి** కుడిచేయి ఎత్తి ఆశీర్వదించి ఆపైన క్షణంలో గుర్రాలను వెనక్కిమళ్ళించి దౌడుతీశారు!

పరుగున వెంటనే లోయలోకి దగ్గరగావెళ్ళి చూస్తే ఎవరూ లేరు! అలావచ్చిన నలుగురు "ఆజానుబాహులైన వ్యక్తులలో ఇద్దరు బ్లావెట్స్కీకి జీవితంలో అడుగడుగునా రక్షిస్తుండే **మాస్టర్ KH, మాస్టర్ M** అనబడే సిద్ధపురుషులని వారిమధ్యనే మహారాజ ఠీవితో దర్శనమిచ్చినవారు — **వైవస్వతమనువు**" అనీచెప్పి ఆమె రుమాలుతో ఆనందభాష్పాలు తుడుచుకుంది! భక్తితో నమస్కరించి వెనక్కితిరిగింది! వారు ఆగినచోట కొంతధూళిని తీసి — భద్రంగా తనదగ్గర వుంచుకొంది!

ఇలాంటి దివ్యపురుషులే — **"మాస్టర్"** అన్న పేరుతో వేరువేరు రూపాలలో పనిచేస్తూవున్నారని వీరిలో చాలామందికి **శంబల** గ్రామంలోనూ, రాబోయే అవతారమూర్తి కల్కి **భగవానుడితోనూ** నిత్యం రాకపోకలు, సంబంధాలు కలిగివున్నట్టూ వీరు ప్రపంచ పరిస్థితులను గమనిస్తున్నట్టూ, అవసరమైనపుడు ప్రత్యక్షమై తమ సహాయాల్ని అందచేస్తారని బ్లావెట్స్కీ తన ఉపన్యాసాలలో అనేకసార్లు చెప్పేది!

దీన్నిబట్టి **మాస్టర్ CVV** గారి పేరులోని "**మాస్టర్**" అన్న పదానికున్న ప్రత్యేకార్థం — కొంతైనా మనం ఊహించుకోవచ్చు!

**మాస్టర్ CVV** తన మీడియంల ద్వారా లేక CVV యోగ ప్రయోగాల ద్వారా లెక్కలేనంతమందికి ఆరోగ్యం, బాధానివృత్తి, ధ్యానంలో దివ్యానుభ వాలు, ఇంకా ఉత్తరాలద్వారా టెలిగ్రాముల ద్వారా లేక మరొక వ్యక్తిద్వారా పంపే సందేశాల రూపంలోనూ తమ శిష్యుల బాధలు, సమస్యలు మెరుపు మెరిసినట్లు తొలగించేవారు!



5

# హేలీ తోకచుక్కతో అవతరించిన మాస్టరు C.V.V.

అది మే నెల, 1910వ సంవత్సరం. బజార్లో అందరూ ఆకాశాన దేదీప్యమానంగా వెలుగుతున్న ఒక భయంకరమైన '**తోకచుక్క**'ను చూసి గుంపులు గుంపులుగా ప్రోగై చిత్ర విచిత్రాలుగా దాన్నిగురించి చెవులు కొరుక్కుంటున్నారు. ఈ **తోకచుక్క** జార్జిరాజు మరణాన్ని సూచిస్తుందని కొందరంటే, మానవజాతికి ఓ ప్రపంచయుద్ధాన్నే తెచ్చిపెడుతుందని ఇంకొంద రంటున్నారు. లేదు — అణుయుద్ధం లేక రాకెట్ల దండయాత్రలవంటివి రావచ్చని మరికొందరంటే, కలిపురుషుడు వచ్చి ప్రపంచంలోని మానవజాతిని ప్రళయంలోకి పంపుతాడని ఇంకొందరూ — 'అసలు ఇదంతా సైన్సు ప్రకారం చూస్తే వట్టి మూఢవిశ్వాసమే! ఇది ఆకాశంలోని నక్షత్రమే! దీనివల్ల యుద్ధం వుండదు, ఏమీవుండదు, అనే సైన్సు దృక్పథంగలవాళ్ళు ఇంకొందరు! ఇలా ఎవరికి తోచినట్లు వాళ్ళు అనుకుంటున్నారు.

అదే సమయాన దక్షిణ భారతదేశంలో 'కుంభకోణం' అనే ఒక ఊరిలో ఒక మధ్యతరగతి కుటుంబీకుడైన బ్రాహ్మణుడు 'తూర్పు దబీరు వీధి' లోని తన పెంకుటింట్లో కూర్చుని ఏవో లెక్కలు సరిచూసుకుంటున్న సమయంలో ఒక అత్యద్భుతం జరిగింది! ఆకాశంలో వెలిగే 'హేలీ తోకచుక్క' ఆరిపోతూ మాయమై ఒక్కసారి మిరుమిట్లుగొలిపే కాంతితో మెరుపుతీగెలా ఆకాశంలో అంతర్ధానమై దాని 'తోక' పిడుగుపడే విద్యుల్లతలాగ వెలిగి, ఆకాశంనుంచి క్రిందకుదిగి చిలువలు పలువలుగా మెరుస్తూ ఆ పెంకు టింట్లో దూరి, రాసుకుంటున్న ఆ మాస్టరుగారి శరీరంలో ప్రవేశించి, అంతర్ధానమైంది!

"చచ్చిపోయాడు, వెంకాస్వామి!"

అనుకుంటూ పరుగెత్తుకువచ్చి చూశారు. అప్పటికే తెలివితప్పి అచేతన స్థితిలో తనకు తాను తెలియని స్థితిలో ఉన్నారు వెంకాస్వామిరావు! అది ఒక పెద్ద కరెంట్‌షాక్, లేక పిడుగుపడ్డ షాకు అనుకొని ఆయనకు ఎన్నో సపర్యలు చేశారు. ఏదో మత్తులో మైకంలో ఉన్నవాడిలాగ నిద్రలోంచి మేలుకొంటున్నట్లుగా అయిపోయిన వెంకాస్వామిరావు జీవితంలో మరి ఎప్పుడూ పూర్వంమనిషి కాలేదు! త్రుళ్ళిపడి మేల్కొన్నట్లు లేచి, చుట్టూ ప్రపంచాన్ని ఆశ్చర్యంగా చూశారు.

**"ఇక్కడెందుకున్నాను నేను! — అసలు నేనెవరు? నేనెందుకొచ్చానీ శరీరంలోకి?"** అంటూ, పదేపదే తన్ను తానే తరచి తరచి ప్రశ్నించుకుంటూ తననే తాను పరిశోధించుకోనారంభించారు, C.V.V. గా మారిన 'వెంకాస్వామి' రావు! ఆ **'హేలీ'** తోకచుక్క శరీరంలో ప్రవేశించిన క్షణంనుంచీ ఒక నూతన తేజస్సు ఒక నూతనమైన **ఎరుక** (Awareness) ఆయనలో ప్రవేశించింది.

ఆ ప్రవేశించిన నూతన వ్యక్తిత్వం — పూర్వపు మనిషికాదు! ఆ

పూర్వపు మనిషికి **ఈనాడుండే** శక్తులులేవు! ఆ క్షణాన్నుంచి మనిషే పూర్తిగా మారిపోయారు. మెదడునూ నాడీమండలాన్నీ ఆవేశించిన 'ఒకానొక దివ్యశక్తి' ద్వారా అనేక 'యోగప్రక్రియలు', **'రోగనివారణ-కోర్సులు'** అనబడే ఇంగ్లీషు మంత్రాలు, ఇలా కొన్నివందలు వారినుండి వెలువడ్డాయి!

**"ఇంగ్లీషులో మంత్రాలేమిటి?"** — వినడానికే ఆశ్చర్యంగావుంది కదూ! అవును! నిజంగా ఇవి ఇంగ్లీషు మంత్రాలే! అయితే ఇవి మన మామూలు మంత్రాల్లాగ వెయ్యిసార్లు, లక్షసార్లూ జపం చెయ్యనక్కరలేదు — **చెయ్యకూడదు** కూడా! చేస్తే ప్రమాదం! ప్రతి ఇంగ్లీషు మంత్రాన్నీ కేవలం మూడుసార్లు మాత్రమే మానసికంగా ఉచ్చరించడం కాకుండా నోటితో స్ఫుటంగా ఉచ్చరించాలి! ఉచ్చరిస్తూనే దాని శబ్దశక్తిని **వింటూ** ధ్యానించాలి! అంతే! ఉపదేశించిన 'గురువు పేరులోని **మాస్టరు CVV** అనే అక్షరాలే' — ఒక మంత్రంలాగ. ఉచ్ఛరించి ఆయనకే నమస్కారం పెట్టగానే...

"...పెట్టగానే? ...ఏం జరుగుతుంది?"

ఇంకేముంది? ఒక్కసారిగా మనస్సులోంచి మన శరీరంలో ఒకపెద్ద పిడుగు పడ్డట్టవుతుంది! శరీరం కంపించడం ప్రారంభిస్తుంది. చలికి గగుర్పాటు, ఆనందానికి పులకరింతల్లాగ తెరలు తెరలుగా కరెంటువంటి శక్తి మెదడునుండి నాడీమండలంద్వారా శరీరంలో అన్నిపక్కలకూ పరుగెత్తుకుని పోతుంది — దేహంలోని అన్ని ఇంద్రియాలకూ ఒక **టెలిగ్రాం** ఇచ్చినట్లుగా శరీరంలోని **చక్రాలు**, 'నాడులూ' మెరుపులు మెరిసినట్లూ, విద్యుత్తూ అన్నివేపులకూ పరుగెత్తినట్లూ — కళ్ళముందు అనేక రంగురంగుల జ్యోతులు వెలిగినట్లూ — ఒక పెద్దమార్పే ప్రారంభమౌతుంది!

ఈ ఇంగ్లీషు మంత్రాలనే **'కోర్సులు'** (Courses) అంటారు. ప్రతి ఒక్క కోర్సునీ కేవలం **మూడుసార్లు** మాత్రమే ఉచ్చరించాలి! అంతకంటే

ఎక్కువ అనరాదు! జపంచేసినట్లు పురశ్చరణచేస్తే ఆ పుట్టే శక్తికి నరాలు ఎలక్ట్రిక్ ఫ్లగ్గులో ఫ్యూజు మాడిపోయినట్లు — పేలిపోగలవు!

ఇది ఒక **'నూతన యోగం'** (New Yoga)! చాలామంది పుస్తకాల్లోనూ, ప్రసంగాల్లోకాని **'మాస్టర్ C.V.V.** యోగం' అన్నపేరు వినేవుంటారు. అందులోని **'యోగప్రక్రియ'**లే పైనచెప్పబడినవి! ఇందులోనివి 'ఇంగ్లీషు' మంత్రాలే!

ఈ **కోర్సులు** — పూర్వం వేదమంత్రాల్నెలాగైతే ఋషీశ్వరులు ధ్యానం చేస్తున్నప్పుడు దర్శించారో, అవెలాగ వారికి 'అతీంద్రియావస్థ'లో వినిపించాయో అలాగే ఈ **కోర్సులు** (ఇంగ్లీషు మంత్రాలు) కూడా, ఈ **'నూతన యోగాన్ని'** ఆవిష్కరించిన సద్గురువుకు 'ధ్యానావస్థ'లో వినిపించాయి! అవి అత్యంత శక్తివంతమైన "ప్రజ్ఞా-శక్తి" తరంగాలు (Waves of Shock-Thought energy), కాబట్టి వాటిని ఉచ్చరించి ఒక్కసారి నాడీమండలంలోకి తీసుకుంటే చాలు! క్షణాలమీద 'అతీంద్రియావస్థ'లోకి మనుష్యుడు కొనిపోబడతాడు.

ఇలా మాస్టర్‌గారికి — (ఈ సంప్రదాయంలో 'నూతన యోగం' కనుగొన్న 'సద్గురువును **మాస్టర్**-గారంటారు) 'కుండలినీశక్తి' మేల్కొనేందుకు ఒక ఇంగ్లీషుమంత్రమూ, 'మూడవకన్ను' (దివ్యచక్షుస్సు లేక 'జ్ఞాననేత్రం') తెరచుకోవడానికి మరో **యోగా-కోర్సు** (Yoga Course), అలానే శరీరాన్ని రోగాలనుండి, అనారోగ్యంనుండి, మానసిక మత్తునుండి మేల్కొలిపి లేపి **చైతన్యవంతం** చెయ్యడానికి ఇంకా **మరికొన్ని కోర్సులు**! ఇలాగ అనేక రకాల ప్రయోజనంగల ఈ ఇంగ్లీషు మంత్రాల 'కోర్సుల శాస్త్రం' (మంత్రశాస్త్రం వలే) 'పరబ్రహ్మ' యొక్క ఆజ్ఞవల్ల 1910వ సంవత్సరంలో భూమీ్మదకు అవతరించగలిగింది ఈ 'మంత్ర'-జాలమంతా!

దీనికి ప్రచారం చెయ్యరాదని, రహస్యంగా వుంచమని 'సృష్టికర్త'

అయిన పరబ్రహ్మ ఆదేశించారనీ ఆయన చెప్పారు! కొద్దిమంది మాత్రమే శిష్యులను చేర్చుకున్నారు. ఇలాగ అనేక రోగాలను ఉచితంగా, ఏమీ తీసుకోకుండా తమ సద్గురువును స్మరించి నయంచేసిన వారిలో బ్రహ్మశ్రీ **వేటూరి ప్రభాకరశాస్త్రి గారు** ముఖ్యులు! వారిని 'మీడియమ్స్' (Mediums) అంటారు.

అలాటి శిష్యులలో కొందరికి పూర్వజన్మ జ్ఞానాన్ని, చదివే శక్తినీ యిచ్చారు. మరికొందరికి **రోగాలను నివారణచేసే** పనిచెప్పారు. ఇంకొందరు ధ్యానంలో కూర్చుని శరీరంలోని చక్రాలను గమనిస్తూ బయట ప్రపంచంలోని **రాసులలోని గ్రహాల సంచారం గమనిస్తూ** బయట ప్రపంచంలోని గ్రహాలు రాసులలో ఎలా చరిస్తున్నాయో గమనించమంటూ ఆదేశించారు!

అలా వారి వివిధ పరిశోధనల సారాన్నంతా సమకూర్చి ఆయన ఒక **నూతన మంత్రశాస్త్రం** వంటిది ఇంగ్లీషులో తయారుచేశారు. ఒక్కక్షణకాలం మాస్టరుగారిని తలచి నమస్కరించి ఆ ఇంగ్లీషుమంత్రం (Course) జపిస్తే, తక్షణమే ఎలాంటి రోగాలైనా పటాపంచలైపోవాల్సిందే! అలాగే తన దగ్గరకు వచ్చినవారిని చూసి మాస్టరు CVV ఈ యోగానికి పనికివస్తాడో రాడో అని **"వీడికి టెస్టుతియ్యి"** అనేవారు!

వెంటనే నారాయణ అయ్యర్ అనే శిష్యుడు ("మీడియం" (Medium) అంటారు వీరిని) ఆ వచ్చినవ్యక్తిని చాపవేసి కూర్చోబెట్టి ధ్యానస్థితిలోకి పంపించి ఏదో లోకాల్లోకి వెళ్ళిపోయేవాడు — అతనికి తెలియకుండానే! డిక్టేట్ చేస్తుంటే అతని నోటివెంట **ఏంవస్తుందో** అదంతా, ఒక శిష్యుడు చకచకా **రాస్తూపోయేవాడు!** దాంట్లో ఈ వచ్చినవ్యక్తి పూర్వజన్మ ఏమిటో, తల్లితండ్రు లెవరో, ఎక్కడ పుట్టాడో, అతను చేసిన మంచిపనులేమిటో, అతను చేసిన పనుల పూర్వపు సంస్కారాలు ఈ జన్మలో ఎప్పుడు

మొలకెత్తుతాయో —ఇలా, అన్నీ చెప్పుకుంటూ పోతాడు. ఆతరువాత యితడు ఈ **నూతన యోగానికి పనికి వస్తాడో రాడో** చెప్పి, మళ్లీ ఈ శరీరం మామూలు స్థితిలోకి చేరుకుంటుంది. దీన్ని **"టెస్టుతీయడం"** అంటారు! ఇదంతా ఇక 'మీడియం' పని.

రోగాలతో పీడించబడేవారిని ముట్టుకుని, తమ గురువుని ధ్యానించి వారివద్ద ఆ మంత్రాన్ని జపించి కూర్చుంటే గుండెజబ్బులూ, డయాబిటీస్, పిచ్చి, జ్వరము, విరోచనాలు, తలనొప్పివంటి రోగాలు నయమవటమే ఎముకలు విరుగుట, పాము కరచుట, పిచ్చికుక్క కరచుట, తేలు కుట్టుట వంటి ఘోరవిషాలు క్షణాలమీద దిగిపోయేవి.

కుండలినీశక్తి గురించి చాలామందికి తెలుసు. అందరం "జార్జి-అరండేల్" (George Arundale) పుస్తకం చదువుకొని ఉంటాం. చాలామంది హఠయోగం గురించి 'హఠయోగప్రదీపిక' చదువుకొనే ఉంటారు. కాని ఈ కుండలినీశక్తిని మేలుకొలపడం ఎలాగో ఆ అనుభవానికి కావలసిన తాళం చెవులన్నీ ఏనాడో పోయాయి.

ఈ యోగంలో చెప్పబడిన బ్రహ్మానుభూతిని నిముషాల్లోను, అతిత్వరగా యిచ్చే ప్రక్రియలన్నీ — కారణాంతరంవల్ల **ప్రయోగంలో** లేక పోవడంవల్ల మరుగునపడితే ఇవి మరల **'నూతనయోగం'**లో తిరిగి, పునః ప్రతిష్టించడం జరిగిందని చెప్పారు. దాని సూత్రాలూ, దానికి సంబంధించిన బుక్కులూ కూడా ఆధారాలుగా ఇచ్చారు. ఇంగ్లీషులో ఈ **నూతన యోగం** గురించి దానికి వేదంలో ఉపనిషత్తులలో ఉన్న ప్రమాణాలతో సైన్సు'దృష్ట్యా' ఏవిధంగా మనకి అర్థం అవుతుందో తెలిపే ఒక గ్రంథాన్ని నన్ను రచించి యిమ్మని శ్రీగాలి బాలసుందరరావుగారు అప్పట్లో కోరారు.

ఈ యోగంలో మొట్టమొదట 755-మంది మాత్రమే శిష్యులుగా

స్వీకరించబడ్డారు. ఈ శిష్యులను నూతన యోగంలో **'మీడియం'** (Medium)లని అంటారు. 'మీడియం' అంటే ఈ **శిష్యునియొక్క ప్రయోజకత్వం ఏమీ లేకుండానే** బ్రహ్మశక్తి ఒక తీగలోంచి కరెంటు ప్రవహించినట్టు, **ఈ శిష్యుడి శరీరంలోనుంచి** ప్రవహించి అనేక మహిమలు చూపిస్తుంది! ఫలితంగా, అనేక గొప్పమార్పులు, ప్రపంచంలోనూ, ఇతరుల శరీరాల్లోనూ తీసుకొస్తుంది! కాని ఇది **ఆ శిష్యుడికి మాత్రం ఏమీతెలీదు!** ఆ శక్తి **శిష్యుడి చేతిలో వుండదు!** ఈశక్తి అంతా తిన్నగా మాస్టరుగారి చేతిలోనే వుంటుంది. ఇది నూతన యోగంలోని గొప్ప ఆశ్చర్యకరమైన అంశము.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని గురించి చాలామందికి తెలిసేవుంటుంది, వారు సాహిత్యానికి, చరిత్రకి చేసిన కృషి చాలామందికి తెలుసుకాని, వారు **మాస్టరు C.V.V.** కి వ్యక్తిగతంగా శిష్యులని ఆయన **'మీడియమ్స్'** (Mediums) లో ప్రముఖులనీ, బహుకొద్దిమందికే తెలుసు.

ఈ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దాదాపు 21 సంవత్సరాలు తిరుపతిలో ఈ **నూతన యోగం** అభ్యాసం చేసేవారు. ఈ అభ్యాసంద్వారా ఆయనకి మాస్టరుగారు ఈ రోగనివారణచేసి ఆరోగ్యం ఇవ్వడం (Health curing) అనే ఒకశాఖ (Branch) అప్పచెప్పారు. అనేకమంది రోగాలతో బాధపడుతున్న జీవులందరికీ రోగనివారణచేసే శక్తిని నీకు ప్రసాదిస్తున్నాను అనిచెప్పి మాస్టరు గారు ఆ ప్రభాకరశాస్త్రిగారికి ఆశీర్వచనం ఇచ్చారుకూడా!

ఇది జరిగిన దగ్గర్నుంచీ, ఆశ్చర్యంగా 50 మంది దగ్గర్నుంచి 100 మందిదాకా రోగులు ఆయన ఇంట్లోనే ముందు హాలులో కూర్చుండేవారు. జలోదరంవాళ్ళు, ఎముకలు విరిగినవాళ్ళు, పిచ్చికుక్క కరచినవాళ్ళు, హృద్రోగులు (Heart disease) వాళ్ళు, పిచ్చివాళ్ళు, చెవిటివాళ్ళు అనేకరకాల రోగాలవాళ్ళందరూ అక్కడ చేరేవాళ్ళు! వీళ్ళందర్నీ ఒకప్రక్కనే కూర్చుని కళ్ళుమూసుకోమనేవారు శ్రీప్రభాకరశాస్త్రిగారు.

ఆయన మాస్టరుగారిని తలచుకొని, ఒకసారి నమస్కారంపెట్టి ఐదు నిమిషాలు ధ్యానంలో కూర్చునేవారు. ఈ ధ్యానంలో కూర్చున్న ఐదు నిమిషాలూ అక్కడ కూర్చున్న అందరికీ శరీరస్పృహ పోయేది! వాళ్ళేమీ జపం చేయనక్కరలేదు! కేవలం అక్కడ కూర్చుని విశ్రాంతి (relaxation) శరీరంమీద పట్టు వదలిపెట్టిన మరుక్షణంలోనే వారికి శరీరప్రజ్ఞ పోయేది! పోయిన వెంటనే ఏదో విద్యుచ్ఛక్తి (Electric Current) ప్రవహిస్తున్నట్టుగా అనుభవం కల్గేది. అది శరీరంలో నిలిచినట్టుగా, నరాల్లోంచి ప్రవహిస్తునట్టుగా శరీరంలో **రోగంవున్నచోటుకే వెళ్ళి** అక్కడున్న చెడునంతటినీ, తీసివేసినట్లుగా అనుభవం కలిగేది! ఇలా అనుభవం కలగటమేగాకుండా ఇలానే ఒకరోజు లోనే కొందరికీ, రెండు-మూడు రోజుల్లోనే, ఎన్నిసార్లు అవసరమైతే అంత వరకూ ఈ వైద్యం (treatment) జరిగేది! ఇలా, నాలుగైదు రోజుల్లోనే పది రోజుల్లోనో అందరికీ సంపూర్ణ ఆరోగ్యంవచ్చి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయే వారు! చాలామంది ఆశ్చర్యపోయేవారు.

ప్రభాకరశాస్త్రిగారితో "**ఇటువంటి దివ్యశక్తులు మీరెప్పుడు సంపా దించారు?** మాకెప్పుడూ మీగురించి ఇలా తెలియదే!" — అని అడిగేవారు. అది విని శ్రీ శాస్త్రిగారు వారికి నమస్కారంపెట్టి, — "ఈ శక్తులన్నీ నావికావు! మాస్టరుగారు నాకు అనుగ్రహించి నాద్వారా ఆయన ప్రపంచానికి చేయదల్చుకున్న పని చేస్తున్నారు" అని చెప్పేవారు.

అంతేకాని, ఈ శక్తులన్నీ తనవనిగాని, తనకు యోగశక్తులు వచ్చిన వనిగానీ ప్రభాకరశాస్త్రిగారు ఎప్పుడూ వెల్లడిచేయలేదు. ఆయన '**ప్రజ్ఞా ప్రభాకరం**' అనే తన పుస్తకంలో ఈ అనుభవాలన్నీ ఎంతో స్పష్టంగా హృద్యంగా వివరించారు.



## 6

# యోగమార్గాలలో - మాస్టర్-C.V.V. యోగం లక్ష్యం?

అనాదిగా మన భారతదేశంలో యోగశాస్త్రము మోక్షవిద్యగా యుగ యుగాలుగా కొనసాగుతూనే వున్నది! భగవద్గీతలో శ్రీకృష్ణప్రభువు చెప్పినట్టు — ఈ యోగవిద్య అనాదిగా అంటే ఆదీ అంతమూలేని, సృష్ట్యారంభ కాలములో నేనే స్వయంగా సూర్యభగవానునికి ఉపదేశించాను! ఇది సూర్యునినుండి సూర్యవంశపురాజులైన ఇక్ష్వాకు రఘుమహారాజులు వంశంలో తరతరాలుగా కొనసాగిన **రాజవిద్య** (రాజయోగం) గా చాలాకాలం గడిచి పోవడం — తిరిగి ఈ ద్వాపరయుగం చివరలో మీకు నేను సంగ్రహంగా ఉపదేశిస్తున్నాను'' అని తెల్పివున్నది!

అంటే సృష్ట్యారంభంనుంచీ యోగశాస్త్రం అనేది సనాతన వేదవిద్యలతో పాటు స్థిరపడిపోయివున్నది! అయినప్పటికీ ఈనాటికి 20వ శతాబ్దపు యంత్రాల ప్రభావంలోనూ, వ్యాపారదృష్టితోనూ రాజకీయాలవల్ల అవినీతి

తోనూ అసత్యమూ, హింస, సెక్సువంటి నానారకాల దోషాలతోనూ కుళ్ళి పోయిన సమాజం యోగం అంటే ఏమిటో అర్ధంచేసుకోలేని స్థితిలో వున్నది!

మోక్షం ఎందుకో తెలియని నికృష్ట నీచస్థితిలోవున్న ఈనాటి మానవజాతి యోగం ఎందుకో ఎలా తెలుస్తుంది? అందుకే యోగశాస్త్రం గురించి ఈనాటి యువతీయువకులకు సరైన సైన్సుపరమైన అవగాహన అవసరం! అందుకే యోగం అంటే ఏమిటో అది ఎందుకో అసలు మానవుడికి మోక్షం అంటే అవసరమేమిటో తెలుసుకోవలసిన అవకాశం వున్నది! డార్విన్ నాటి సైన్సు పరిణామసిద్ధాంతం ప్రకారం చూసినా మానవుడు జంతుదశనుండి క్రమ క్రమంగా ఎదుగుతూ మెట్లుమెట్లుగా పురోగమిస్తూ ఈనాటి మేధావి మానవుల (Homo Sapiens) మానవుడిగా అవతరించాకకూడా మనిషి నిప్పు, వంట, గృహనిర్మాణం, బట్టలు ధరించడం నగరాల నిర్మాణము జీవించడానికి వృత్తులు మనిషికి మనిషికీ మధ్య సమాన హక్కులకోసం ఏర్పడే న్యాయ మైన సామాజికవ్యవస్థ నిర్మాణానికే నిత్యమూ పరిశోధనలు చేస్తూనేవున్నాడు! ఇలా ఎదుగుతున్న మానవుడికి భవిష్యత్తులో గమ్యం ఏమిటి? అందరికీ బట్ట, తిండి, చదువు వృత్తి అవకాశాలు సమాన అవకాశాలు లభించిన తర్వాతకూడా మానవుడి పరిణామం అంతటితో ఆగిపోదు! ఎందుకంటే మనిషికి కావలసినది కేవలం తిండి బట్ట మాత్రమేకాదు! ఏదో శక్తి ఈ ప్రపంచాన్ని నడిపిస్తున్నది! తనయొక్క జననమరణాలు తన మనస్సుకు అందకపోయినా దివ్యజ్ఞానానికి సంబంధించిన ఒక మహోన్నతమైన స్థితి అందుకోవాలని ప్రయాణించే మార్గమే మోక్షమార్గం అనబడే ఈ వెలుగుబాట!

మనిషిగా పుట్టిన తన గమ్యమేమిటి? తాను ఎవరో తెలుసుకోవాలి! ఈ మార్గంలో మనిషికి ఆత్మదర్శనాన్ని ప్రసాదించే భగవంతుని సైన్సును తెలుసుకునే సైన్సు ప్రక్రియవంటి శాస్త్రం Science of God వంటిది

వేదకాలపు ఋషులచేత కనుగొనబడింది!

ఈ యోగమార్గం ప్రకారం మనిషికి జ్ఞానం బయట ప్రపంచం గురించినది. ఇది ఇంద్రియాలైన కళ్ళు, ముక్కు, చెవి, మనస్సుద్వారా సంపాదించగలడు! కాని తానెవరో ఎందుకు సృష్టించబడ్డాడో — ఈ ప్రపంచాన్ని సృష్టించిన ఆ మూలశక్తి ద్వారానే తెలుసుకోవడం ఎలా సాధ్య పడుతుందో తెలుసుకోవాలో నేర్పేది యోగశాస్త్రం. ఇది ఎనిమిది మెట్లతో ముందుకు సాగిపోయే మార్గం! మొదటగా శరీరాన్ని, సోమరితనాన్ని, నిద్రనీ, బద్ధకాన్ని జయించి తెల్లవారుఝామున బ్రహ్మముహూర్తంలోనే వేళతప్పకుండా లేవడం, యమనియమములు అన్న మొదటిమెట్టుతో సాధించవచ్చు! వీటి ద్వారా మన నిత్యజీవితంలో మన కాలాన్ని మొత్తం వ్యర్థంగా ఖర్చుపెట్టే మాటలు కాలక్షేపం కబుర్లు, రుచులు, సుఖదుఃఖాలు, ఇష్టాయిష్టాలు, శతృత్వ మిత్రత్వాదులు, ఏర్పరిచే లింకులనుపెంచే కర్మలను జయించి మనస్సును నిగ్రహించవచ్చు! దీనిని ప్రత్యాహారమంటారు!

శరీరంలోని యోగకేంద్రాలు అనబడే షట్చక్రాలు శిరస్సులోని సహస్రార చక్రం వీణతీగలమీద మెట్లద్వారా సంగీతస్వరాలు ఆలాపించినట్టే మనలోని ప్రాణశక్తిని మనస్సును మెట్టుమెట్లుగా పైకి తీసుకొనిపోవడానికే ఈ షట్చక్రాలు, నాడులు ఉపయోగించే యంత్రపరికరాల వంటివి! తద్వారా మనిషికి దూరదృష్టి, దూరశ్రవణం — ఇంకా, కాలంలో జరగబోయేవి తెలుసుకోవడం, గతించిన యుగయుగాల చరిత్రను టేప్‌రికార్డు విన్నట్టు విని ప్రత్యక్షంగా దివ్యదృష్టితో దర్శించడం కుండలినీద్వారానే సాధ్యపడతాయి!

మనిషి మనస్సుకు పైనవుండే బుద్ధి, దానికంటే పైనవుండే జీవుడుగా 'నేను' అనే అహంకారం కలిగిన జీవాత్మ వెలుగుతోంది! శరీరంలోకి జన్మించేది మళ్ళీ మరణంతో బయటికిపోయేది ఈ జీవాత్మయే! ఒక జన్మలో చేసిన

తప్పులను కర్మప్రకారం అనుభవిస్తూ నూతన అనుభవాలవల్ల వ్యక్తి వికాసాన్ని సాధింపచేసుకుంటూ పురోగమించడమే **సాధన!** చివరకు మనిషియొక్క శ్వాస హృదయం కొట్టుకోవడం, మనస్సు పరిపరివిధాల పరిగెత్తే చంచలత్వం అణిగి ఏకత్వంకావడం జరుగుతాయి!

## అనేకజన్మలకు – సిద్ధి :

ఇలాగ అనేక జన్మలద్వారా మనిషికి మెట్లుమెట్లుగా పురోగమించి యోగసిద్ధిని చేరుకుంటాడు అన్నదే పురాతనమైన యోగమార్గం! **పతంజలి మహర్షి** తన యోగసూత్రాలలో **కపిలమహర్షి** సాంఖ్యయోగంద్వారాను, శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతద్వారాను, **వ్యాసమహర్షి** బ్రహ్మసూత్రాలద్వారాను, ఈ యోగవిద్యలో ఉత్పన్నమైన సైన్సును మనకు అందించాడు! కాని ఇవన్నీ ఇప్పుడు సామాన్యమానవుడు సాధించాలంటే కొన్ని సంవత్సరాలు, కొన్ని జన్మలే పట్టవచ్చు! అందువల్ల **మాస్టర్ C.V.V.** యోగంద్వారా ఒకే జన్మలో మోక్షాన్ని పొందడం కోసం పరిశోధనలు చేశారు శ్రీ వెంకాస్వామిరావు అనబడే మాస్టర్ C.V.V. అనేవారి శరీరంలోకి అవతరించిన దైవశక్తి!

అది 1910లో హేలీ తోకచుక్క వచ్చినపుడు ఆశ్చర్యంగా ఊహించరాని విధంగా వెంకాస్వామిరావు శరీరంలోకి ప్రవేశించి ఒకగొప్ప యోగకేంద్రం వెలిగి మాస్టర్ C.V.V. అన్న యోగశక్తికి మహాకేంద్రంగా మారిపోయింది!

## మానవ-పరిణామం :

మానవ పరిణామాన్ని — అనేక జన్మలు పట్టకుండా ఒకేజన్మతో పరిపూర్ణ సిద్ధిని అందించాలన్న లక్ష్యమే **మాస్టర్ C.V.V. యోగం** యొక్క గమ్యం! అయితే గతంలోని యోగసిద్ధాంతాలన్నీ కుండలినీశక్తిని మూలాధారం నుంచి మేలుకొలిపి సహస్రారంపైకి తీసుకువెళ్ళే నిచ్చెనవంటి క్రిందనుంచి

పైకెక్కే మెట్లుద్వారా ఏర్పడివున్న యోగశాస్త్రమే! దీనివల్ల కుండలిని మేలుకో గానే సమాధిస్థితి కలుగుతుంది! ఈ సమాధివల్ల ఇంద్రియాలు, మనస్సు, శ్వాస ఒక నిద్రవంటి జడస్థితికి చేరుకొని సమాధిలోకి పోయిన మనిషికి



తానేమౌతున్నాడో తెలియని మాయవంటి, నిద్రవంటి, మత్తువంటి తామసిక మైన జడత్వం పొగచూరినట్టు ఏర్పడుతున్నది!

అలా యోగ సమాధివల్ల కలిగే **జడత్వం లేకుండా** పూర్తి మెలుకువతో మెలుకువకంటే ఇంకా **తీక్షణమైన జాగృతి కలిగిన వెలుగువంటి జ్ఞానస్థితికి మన మెదడును పైకెక్కించే ప్రయత్నమే — మాస్టర్ C.V.V. యోగం!**

దీనివల్ల మనిషికి మరణించే సమయంలో తనకు తాను తెలియని స్థితి రాకుండా పూర్తి ప్రజ్ఞతో జ్ఞానావస్థలో వుండి ఒక శరీరంనుండి ఇంకొక శరీరంలోకి మారగలుగుతాడు! మరణించాక తిరిగి తల్లిగర్భంలోకి ప్రవేశించే ముందు ఇలాంటి, ఏమీ తెలియని నిద్రవంటి స్థితిలేకుండా పూర్తి జ్ఞానస్థితిలో వుండటంవల్ల మనిషి తన జననమరణాల రహస్యాన్ని స్వయంగా తానే గ్రహించి పూర్తి ప్రజ్ఞతో తిరిగి జన్మించగలుగుతాడు!

దీనికి మనిషి మెదడులోని **'హితు'** (Hitu) అన్న యోగకేంద్రం మూలాధారంనుంచి కుండలినీశక్తిని పైకి లాగి సమాధిస్థితి ఏర్పడకుండా పూర్తి జాగృతిస్థితిలో నిలబెట్టడం సాధనపడుతోంది! అలానే వెన్నెముక లోపలి వెన్నుపూస ఒక పెద్ద నరంలాగా మెదడుతో కలిసే వీణాదండంవంటి వంతెన స్థానం "మెడుల్లా అబ్లాంగేటా" (Medulla Oblongata) అన్నచోటనే మనిషికి మృత్యువు జననం యోగసమాధీ, కలిగించే కేంద్రాలున్నాయని మాస్టర్ C.V.V. దర్శించారు!

వాటిని మేలుకొలిపేందుకు ఇంగ్లీష్‌లో మంత్రాలవంటి కోర్సులను ప్రసాదించారు! మనిషి జీవితాన్ని విడిచి పారిపోకుండానే అడవులలోకి, **గుహలలోకి** వెళ్ళి ఏళ్ళతరబడి జీవితాన్ని వదిలి **సన్యసించక్కరలేకుండానే నిత్యజీవితంలోనే యోగసాధన** అందించేది మాస్టర్ C.V.V. యోగం!

దీనివల్ల కలియుగంలోని ఆధునిక మానవుడు తన వృత్తి ఉద్యోగం,

సామాజిక విధులు, జీవనోపాధివంటి అవసరాలను విడిచిపెట్టకుండానే తన గమ్యాన్నికూడా మరిచిపోకుండా యోగసాధన చేయవచ్చు!

దీనికి కేవలం ఉదయం 6 గంటలకు ఒక 15 నిమిషాలు, సాయంత్రం సూర్యాస్తమయ సమయంలో మరో 15 నిమిషాలు ఖర్చుపెట్టి మాస్టర్ C.V.V. గారు ఉపదేశించిన విధానంలో ప్రేయరు చేయాలి! ఇలా ప్రేయరు ప్రారంభించగానే ఒక తుమ్మెదవంటి నాదము విద్యుత్తు లేక కరెంటువంటి శక్తి అయస్కాంతంవంటి తేజస్సు శరీరంలో వాటంతటవే పుట్టుకునివచ్చి కుండలినీశక్తి కొద్ది రోజులలోనే మేల్కొంటుంది! దీనివల్ల మామూలు మనస్సుతో చూడలేని అతీంద్రియమైన దివ్యశక్తులు యోగానుభూతులూ మనిషికి తేలికగా లభిస్తాయి! అయితే వీటిని దుర్వినియోగం చేయరాదు! స్వార్థానికి వినియోగించరాదు! ఇతరుల రోగనివారణకు, ఆరోగ్యం ప్రసాదించడానికి, పూర్తి బ్రహ్మజ్ఞానం సిద్ధింపచేయడానికే వాడాలి! దీనివల్ల ప్రతిమనిషికీ జన్మహక్కైన సంపూర్ణ బ్రహ్మానందం నిత్యజీవితంలో అనుభవంలో సాధ్యపడుతుంది!

ఈ యోగానికి బ్రహ్మచర్యం అవసరం లేదు! అనగా బలవంతంగా సెక్సును అణిచిపెట్టివుంచే అంధ మూఢవిశ్వాసమార్గాలు అవసరంలేదు! మామూలుగా గృహస్థ జీవితం భార్యాభర్తలుగా జీవిస్తూనే సాధన చేయవచ్చు! అంతేకాదు స్త్రీపురుషులిద్దరికీ ఈ యోగంలో సమానంగా హక్కును పొందే అవకాశం వుంది!

## మంచి-సంతానం :

అంతేకాదు ఇలాంటి **యోగవిద్యను** అభ్యసించే తల్లీ — ఆ **తల్లి గర్భంలో** జన్మించే పిల్లలూ అద్భుత తెలివితేటలు, తేజస్సు, ఆరోగ్యం, బలంతో అందరినీ ప్రేమించే స్వభావంతో జన్మించగలరు!

ఇలాంటి పిల్లలవల్ల ఏర్పడే నూతన సమాజం ఈ **భూగోళాన్నే** ఒక **యోగకేంద్రంగా** మార్చివేయగలరు! తద్వారా ఈనాటి సమాజాన్ని పట్టిపీడిస్తున్న కుళ్ళు, హింస, సెక్సు వంటివి మనిషి యోగసాధనద్వారా నిర్మూలించుకో గలుగుతారు!

చివరకు మృత్యువునుకూడా జయించవచ్చు అని **మాస్టర్ C.V.V.** తన జీవితంలో ప్రత్యక్షంగా నిరూపించారు!

అది **ఎలా** జరిగిందో **వేరే** అధ్యాయంలో తెలుసుకుందాం!



# 7

# 'దివ్యదృష్టి'తో - పైలోకాలూ! - వాటిలో "కాలాలూ!"

ఇది అంతరిక్ష యుగం! మానవుడు రోదసిలోకి ప్రయాణించే అంతరిక్ష నౌకలను రాకెట్లను చంద్రమండలంమీదికి ఇంకా గురుగ్రహం శనిగ్రహం దాటి గాఢమైన ఆకాశపు లోతులలోకి చొచ్చుకుపోతూవుండే — ఊహించ రాని అద్భుతమైన 'అణుయుగం'!

మానవుడు అణువును పేల్చి అణు బాంబును మారణాయుధంగా చేసి జంతువులు, వృక్ష, జీవరాసులతో సహా అన్నిటినీ నాశనంచేయగల శక్తిని సాధించాడు! ఇది దురహంకారంతో అమెరికా జపాన్‌మీద ఆగష్టు 1945లో ప్రయోగించిన ఆటంబాంబులతో ధ్వంసమైన హీరోషిమా, నాగసాకి విధ్వంసకాండయే నిరూపించింది!

దీనితో మానవ చరిత్రలోనే ఒక కొత్త శకానికి నాందిపలకటం జరిగింది! మనిషి ఇటు అణువును భేదించాలని అంగలు వేస్తున్న కాలంలో

1910 ప్రాంతంలో **మాస్టర్ CVV యోగం** ఆవిర్భవించడం, ఇంకా రష్యన్ సిద్ధపురుషుడు **గుర్జీఫ్**, శ్రీ అరవింద యోగి, రమణమహర్షి ఇంకా అద్భుత సిద్ధగురువు **సెయింట్ జర్మేన్** (St. Germaine) లాంటి చిరంజీవులు తెరవెనుకనుంచి ముందుకు వచ్చి అద్భుతమైన సైన్సు వింతలను మహిమలను సైంటిస్టులముందే చేసి చూపారు!

## విశ్వంలో 'పొరలు' :-

దీనితోపాటే సృష్టి రహస్యాలైన **కాలము** (Time), **పదార్థము** (Matter, అణువులు (Molecules), పరమాణువులూ, ఎలక్ట్రానులు ఇంకా మానవుడి అంతరాత్మలో సూక్ష్మశరీరంలో వెలిగే యోగ-చక్రాలరూపంలో తిరిగే **సుషుమ్నా కాలము** లేక యోగిక్ టైము (Yogic Time) వంటి రహస్యాలెన్నో కనుగొన్నాడు — మానవుడు! ఈ దృష్టితో **మాస్టర్ CVV యోగం** అటు మానవుడి అవగాహననూ విశ్వంయొక్క పరిధులను ఈ బ్రహ్మాండం దాటి విస్తరింప చేసింది!

## మృత్యువంటే - ఏమిటి?

అన్నిటినీ సాధించిన మనిషి జన్మమృత్యువుల రహస్యాన్నికూడా ఛేదించాలన్న గొప్ప ప్రయత్నఫలితమే **మాస్టర్ CVV యోగం!** కేవలం ఈ స్థూలశరీరాన్ని బ్రతికించి వుంచటమేకాదు, మృత్యువును జయించటమంటే! అసలు 'మృత్యు'వంటే ఏమిటి?

అణువులతో తయారైన **పదార్థమయ** శరీరం (Material body) లోనుంచి మనిషియొక్క **జీవాత్మ** సూక్ష్మశరీరం, **అంతరాత్మ** వేరుపడి ఒక శరీరాన్ని విడిచి ఇంకొక **శరీరంకోసం** అంతరిక్షంలో, కాలంలోనూ పైకి, ఇంకా పైకి ప్రయాణిస్తూ పైలోకాలను దాటి పరబ్రహ్మలోకాన్ని చేరుకోవడమే **పూర్ణ** యోగసిద్ధి అనవచ్చు! అంటే పదార్థంలో వున్నంతవరకే **మరణం** అనేది

వర్తిస్తుంది! మనస్సు గనుక శరీరంలోంచి విడివడి **కాలంలోకి** ప్రయాణిస్తే అనేక ఆశ్చర్యకరమైన సత్యాలు **యోగదృష్టికి** స్పష్టంగా కనిపిస్తాయి!

## అనేక – "కాలాలు" :-

అందులో మొదటి ఆశ్చర్యం కాలం అనేది సృష్టి అంతటా ఒక్కటే కాలం ఉండదు! అనేక లోకాలలో అనేక రకాల కాలాలు పనిచేస్తూంటాయి అన్న సైన్సుపరమైన సత్యమే ఒక గొప్పవింత! భూమ్మీదవున్న మానవుడికి **కాలం** ఏర్పడటం భూమి తిరగటంతోటే ఏర్పడే సూర్యోదయ సూర్యాస్తమయాలతో మొదలవుతుంది! ఇది కేవలం **భూగోళంమీది కాలం** మాత్రమే!

భూమిని దాటి చంద్రమండలంలో ప్రవేశిస్తే చంద్రుడు ఒక పూర్ణిమ నుంచి ఇంకొక పూర్ణిమదాకా తిరిగే కాలమే **చాంద్రమాసం!** అలాగే గురువు లేక బృహస్పతిగ్రహం 11 $^1/_2$ సంవత్సరాలలో ఒక **పుష్కరకాలంలో** రాశిచక్రం లోని 12 రాసులలో తిరగటమే **బృహస్పతి కాలం!** అలానే శనిగ్రహం రాశి చక్రంలో మేషరాశి ప్రారంభంనుంచీ మొదలై రాశిచక్రమంతా చుట్టివచ్చే 29 $^1/_2$ సంవత్సరాల కాలమే **శనిగ్రహ** కక్ష్యలోని **కాలము!** అలాగే యురేనస్, నెప్ట్యూన్ గ్రహాలకాలం ఇంకా దీర్ఘమైనదీ చాలాకాలం పట్టేదీ! దీనినిబట్టి ఏం తెలుస్తోంది? ఒక సౌరమండలంలోని గ్రహాలలోనే ఎక్కడికక్కడ **ఏడు** (7) రకాల **కాలాలు** నడుస్తున్నాయి! ఇదంతా బయటి ప్రపంచంలోని మాట!

## ఎలక్ట్రానిక్ – 'కాలం' :-

ఇకపోతే అణువులు ఎలక్ట్రానులు సూర్యునివలే వెలిగే **'అణు-కేంద్రం'** (న్యూక్లియస్) చుట్టూ గ్రహాల లాగ తిరిగే ఎలక్ట్రానుల కాలం అతి సూక్ష్మమైన 'మానం'తో కొలవబడుతున్నది! ఇదే **పరమాణు కాలం** లేక 'ఎలక్ట్రానిక్ టైమ్' (Electronic Time) అనవచ్చు!

అదేవిధంగా కొన్ని అణువులు కలిసిన రసాయన సంయోగంవల్ల మన ఆహారం జీర్ణంకావడం ఊపిరి పీల్చినపుడు ప్రాణవాయువు సంయోగంతో ఏర్పడే మార్పులలోనిది **'రసాయనిక కాలం'** (Chemical Time) అనబడు తుంది! అంటే మనిషి మరణించే క్షణంలో భూమిమీద కాలంలోంచి బయటకివచ్చి పైకి ప్రయాణించే ద్వారంలో నిలిస్తే సరిగ్గా **నాలుగురోడ్ల కూడలిలాగే** వేరువేరు రకాల **'కాలాలతో'** పనిచేస్తూ వేరువేరు **'లోకాలు'** సైన్సు పరమైనవి దర్శనమిస్తాయి! అవి స్పష్టంగా అర్ధంకావడంకోసం ఈక్రింది చిత్రంలో చూపిస్తున్నాను!




ఇది కాలం-మాట! అలానే **ఖాళీస్థలం** (Space) లేక 'ఆకాశం' అనబడే అవకాశంలో కూడా అనేక లోతుల **పొరలు** 'డైమెన్షన్స్' (Dimensions) ఏర్పడి వున్నాయి! అంటే ఏమిటో చూద్దాం.

## అనేక – "కాలాలు" :

ఖాళీస్థలం (Empty Space) లో ఒక ఇటుకవంటి ప్రతీ ఘనపు వస్తువూ పొడుగు, వెడల్పు, మందము అనే మూడురకాల 'పరిమాణాలు' (Three Dimensions) కలిగివుంటుంది! మనిషి పరబ్రహ్మలోకానికి తేలిపోయి నపుడు ఇలాంటివి, ఇంకా **అనేక రకాల కాలములు** అనేకరకాల **ఆకాశపు**

ఘనపు కొలతలను (Dimensions in Space) దాటివెళ్ళాలి!

అక్కడ గ్రహాలు తిరిగే కాలం (Planetary Time) పనిచేయదు! ఎందుకంటే గ్రహాలు కింద ఎక్కడో దాటిపోయివుంటాయి కనుక! అలాగే **అణువుల కాలం** (Cellular Time) **పరమాణువుల కాలం** (Electronic Time) కూడా అక్కడ పనిచేయదు!

అక్కడ **రాత్రి పగలూ** — **రెండూ లేనికాలం!** ఎందుకంటే అక్కడ సూర్యుడు, చంద్రుడూకూడా వెలగని లోకం! దీన్నే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు :

**"న తద్భాసయతే సూర్యో, న శశాంకో న పావకః**
**యద్గత్వా న నివర్తంతే - తద్ధామ పరమం మమ"**

అన్నాడు. అక్కడ కనిపించే కాంతి — లైట్ల వెలుగు లేక సూర్యరశ్మి లాగ వెన్నెల వంటి భౌతిక కాంతితో ఏర్పడింది కాదు!

సూర్యుడికన్న కొన్నివేల రెట్లు తేజస్సుతో వెలిగిపోయే ఆ వెలుగే — విశ్వాత్మనుండి ప్రకాశిస్తూవుండే శాశ్వత లోకమే — ఆ **పరబ్రహ్మ పదం!** ఇక్కడికి చేరుకున్న అంతరాత్మ ఇక క్రిందకువచ్చి జన్మించటం వుండదు, మరణించ డమూ వుండదు! దీనిని సాధించాలనే **మాస్టర్ CVV** ప్రయత్నాలు చేశారు!

## గ్రహాల నుంచి విముక్తి :

కాలంపై విజయం సాధించాలంటే — గ్రహాలకు బానిసగావున్న మానవుడు గ్రహాలను కంట్రోలుచేసే స్థితికి వస్తేనే అది సాధ్యం! ఈ దృష్టితోనే మాస్టర్‌గారు పరబ్రహ్మతత్త్వంనుండి గ్రహాలను కంట్రోలుచేయడానికి అవసరమైన ఇంగ్లీషు మంత్రాలను లేక కోర్సులను కనిపెట్టారు! దీనివల్ల

మనిషి జన్మించడం, జీవించడం, మరణించడం అనే మూడు దశలలోనూ జాతకంలోని గ్రహాలకు **లోబడకుండా** జీవించగలడు! ఇదే గ్రహాల ప్రభావం నుంచి విజయం సాధించటం, అంటే! ఇలాటి వాటిలో ముఖ్యమైనది — "నూతన-యోగం"!

అందులో భాగంగానే తల్లితండ్రులు సంసారం చేయకుండానే చందూను అయోనిజుడుగా సృష్టిచేయడం మొదటి విజయం! మరణించిన మేనత్తను 3 రోజుల తర్వాత జీవింపచేయడం మృత్యువుపై విజయం!



# 8

# ప్రపంచ చరిత్రలో - మాస్టరు C.V.V.- గారి ఎలక్ట్రానిక్ యోగం

గత 19-వ శతాబ్దం మొదటి దశకంలో ప్రపంచంలో మార్పులు శరవేగంతో చోటుచేసుకున్నాయి! అంతేకాదు — గత ఐదువేల ఏళ్ళలో ఎన్నిమార్పులు జరిగాయో — అంతకన్నాకూడా గత 75 ఏళ్ళలో ప్రపంచాన్ని చెప్పలేనంతగా మార్చివేసిన "మార్పులు" శరవేగంతో ఎలక్ట్రాన్ వేగంతో ఊపుఅందుకున్నాయి.

అలాంటి చరిత్రనే మార్చివేసిన పెనుమార్పులలో — రైళ్ళురావటం, పోస్టుకార్డు, టెలిఫోన్, టెలిగ్రాం, సినిమా, టెలివిజన్, వైర్-లెస్, విమానాలు, రాకెట్లూ, అణుబాంబుతో **"అణుయుగం"** 1945 కల్లా పూర్తిగా అవతరించటం జరిగింది! అలాంటి — **"మిలీనియం"** మార్పులలో (1) అణువును బ్రద్దలు కొట్టి పదార్థాన్ని — శక్తిగా మార్చే **'ఐన్‌స్టైన్'** (Einstein) సూత్రం $E = Mc^2$ డార్విన్ పరిణామవాదం — ప్రభుత్వంలో ప్రజాస్వామికవ్యవస్థ వచ్చి

రాజరికాలు పోవటమూ — అలానే మనిషి అంతరిక్ష గ్రహాంతరయానాలు రావటం ప్రపంచ రూపునే — మన పూర్వీకులు కలలోకూడా ఊహించ లేనంతగా మార్చివేశాయి!

ఈఅన్నింటితోపాటు — దైవచింతన నశించి పదార్థవాదం, నాస్తిక వాదం, కమ్యూనిజం అవతరించి రష్యాలో రక్తపునదులు పారించాయి 1917-నుంచీ 1997 దాకా! దీన్నించి మనిషిని మృగం కాకుండా — సైన్సు **బాంబులుగల** వినాశకర **పశువుగా** కాకుండా **ఆధ్యాత్మికంగా బాగుచేయాలన్న** మార్పులుకూడా 19-వ శతాబ్ద ఆఖరిదశకంలో రష్యన్‌యోగిని **'మేడం బ్లావెట్స్కీ'**, "గుర్జీఫ్", శ్రీఅరవిందుడు, దివ్యజ్ఞాన సమాజం (Theosophical Society) శక్తి పశ్చిమదేశాలను ముఖ్యంగా బాగుచేశాయి!

## ఆధ్యాత్మిక 'తరంగం' :

ఈ మార్పులు — మూడు 'తరంగాలు' (Waves) గా అంచె లంచెలుగా ఒక **ఆధ్యాత్మిక** - మానసిక **ఉప్పెనలాగా** పొర్లివచ్చిపడ్డాయి. అలాంటి వాటిల్లో మాస్టరు CVV యోగం కడపటిమెట్టు. ఈ మార్పులను విశ్లేషించి చూద్దాం!

ఇది ప్రపంచంలోకి రావటం మూడుమెట్లుగా జరిగిందిగదా! అందులో మొదటగా :

(i) దివ్యజ్ఞాన సమాజం (Theosophical Movement) ద్వారా దాన్ని వెనుకనే వుండి అదృశ్యంగా నడిపించిన **మహాత్ములద్వారా** అప్పటికే ప్రపంచంలో బాగా ప్రచారమై వేరుదన్నివున్న **భౌతిక సిద్ధాంతాన్ని** నిర్మూలన చేయడం మొదటిమెట్టు!

కాబట్టి 1910వ సంవత్సరంలో **'నూతన యోగం'** (New Yoga) అనేది

భూమికి అవతరించడం, బ్రహ్మానుభూతిని మనకి అందించడానికి జరిగిన మహత్తరమైన 'మానవ-పరిణామక్రమం'లో మూడవమెట్టు!

## పదార్ధ-వాదం – మాయం :

(ii) రెండవ ప్రపంచ యుద్ధంతో వచ్చిన **అణుసిద్ధాంతం** వల్ల భౌతిక **'పదార్ధం'** అంతా కూడా **'శక్తి' వల్లనే** నిర్మాణం అవుతుందని యదార్ధంగా ఋజువులైన సిద్ధాంతం రెండవ మెట్టు!

(iii) ఈ **"నూతన యోగం"** (New Yoga) అనబడే **మాస్టరు C.V.V.** మూడవ మెట్టు!

అణుబాంబుపేలి — 'అణువులోవున్నది' "శక్తి" (Energy) యొక్క రూపాంతరమే అన్న ఐన్‌స్టీన్‌యొక్క సూత్రం $E = mc^2$ ద్వారా, సైన్సుద్వారా స్థిరపడిన విషయమేమంటే, **'శక్తి'** (Energy) **వల్లనే పదార్ధం** (Matter) నిర్మాణ మైందని! కాని ఈ **పదార్ధం** అంతా **మనస్సుచేత**, సంకల్పంచేత **కట్టబడివున్న దనే విషయం** అప్పటికింకా సైన్సులో ధృవపడలేదు. ఈవిషయం ధృవపడ డానికి ఇంకో రెండుమెట్లు ప్రపంచంలో **కావలసివచ్చినాయి!** ఇందులో ఒకటి **"మాస్టరు C.V.V."** అనే ఒక మాస్టరుగారి భౌతిక ఉపాధి (శరీరం) ద్వారా **"నూతన యోగం"** (New Yoga) అనేది ఈ భూమిపై వ్యక్తీకరింపబడింది!

దీనిలో ఇంకోమెట్టు 'P.D.ఓస్పెన్స్కీ' (P.D. Ouspensky) మరియూ G.I. గుర్జీఫ్ (G.I.Gurdjieff) లద్వారా బోధించబడిన — "సిద్ధయోగం" అనే రష్యను యోగులద్వారా ఇదే 'పర-బ్రహ్మశక్తి' భూమిపైకి 1910 లోనే దిగి వ్యక్తమైంది.

అలా **ఇండియాలోనూ, రష్యాలోనూ** ఏకకాలమందే వారిద్దరికీ బ్రహ్మ జ్ఞానం కలిగింది! ఆతరువాత, ఈ బ్రహ్మజ్ఞానంయొక్క ఆవిష్కారం అత్యంత

ఆశ్చర్యకరమైన పద్ధతిలో నడిచింది. నడచి, ఇప్పుడు ప్రపంచానికి క్రొత్త క్రొత్త సిద్ధాంతాలను అందిస్తున్నది. "New Discoveries Behind The Iron Curtain" - "Gurdjieff's Teachings" అనే వింత-పుస్తకాలు ఇటీవలనే ప్రకటించబడినవి! రష్యాలోని కమ్యూనిస్టు పరిపాలన వెనుక, ప్రభుత్వం అనుమతితో సహకారంతో జరుగుతున్న **ఆధ్యాత్మిక సాధనలూ**, ప్రక్రియలూ, తెలిపే మహాశ్చర్యకరమైన గ్రంథాలివి!

అందుచేత, మాస్టరు C.V.V. భౌతికంగా శరీరాన్ని త్యాగంచేసి ఇప్పటికి దాదాపు 80 సంవత్సరాలైనా, ఈ యోగం గురించి బహుళంగా సాహిత్యం దొరకకపోవడానికి, ఒకవేళ దొరికినా ఆగ్రంథం తమ దగ్గరున్న ఇద్దరు ముగ్గురూ దానిని ఇవ్వడానికి ఏవిధంగానూ ఇష్టపడకుండా దానిని చాల 'రహస్యం'గా గుప్తవిద్యగా (Esoteric Secret) ఉంచడమే దీనికి కారణం!

తర్వాత ఆయనకీ ఆశ్చర్యకరమైన "యోగానుభూతి" కలిగిన తర్వాత ప్రపంచంలో ఎన్నోగొప్ప మార్పులు వచ్చాయి!

ఈ సిద్ధాంతం మానవజాతి పరిపూర్ణ వికాసానికే ఈ దైవశక్తిని ఉపయోగించడం అన్న గొప్పసూత్రాన్ని అందించింది! దీనిని విస్మరించిన అద్వైత మాయావాదులు భౌతికశరీరం ఈ కనిపించే బయటి ప్రపంచము మిధ్య అనీ, మాయ అని అలక్ష్యం చేయడంవల్ల మన భారతదేశంలో మానవజాతి యొక్క బాహ్య అభివృద్ధి పుష్టి ఆరోగ్యం, దేశసుభిక్షం అలక్ష్యం చేయబడ్డాయి. దీని ఫలితంగానే దేశంలో దారిద్ర్యం తాండవించడం కరువులు కాటకాలు రావడం, ప్రజల బాధలను నివారించి రక్షించే ప్రభుత్వం లేకపోవడం, అనుకోని దుష్పరిణామాలు దాపరించాయి! మన భౌతిక జీవితాన్ని విస్మరిస్తే జరిగే ప్రమాదమేమిటో అనుభవంద్వారా చరిత్రనేర్పిన గుణపాఠం ఇది!

ఈదృష్టితో చూస్తే **మాస్టర్ CVV** యోగంలోని యోగచికిత్స 'ప్లెంటీ ప్రాణా' (Plenty Prana) మానవజాతికి ఒకగొప్ప వరంవంటిది! ఈ అంశము ఇంత ప్రత్యక్షంగా శ్రీఅరవిందుని యోగమార్గంలో కూడా సిద్ధించలేదేమో!

మాస్టర్‌గారు ఇలా ప్రత్యేకంగా భూమికి ఇంగ్లీషు మంత్రాలద్వారా తీసుకువచ్చిన ఈ **"నూతన యోగం"** విశేషమేమిటి? అన్న విషయం చాలా మందికి గందరగోళంగా ఉంటుంది. అందుకని మాస్టర్ యోగంయొక్క ప్రత్యేక విశేషత ఏమిటో ఇక్కడ కొంచెం గమనిద్దాం.

**మాస్టర్‌గారే** ఒకప్పుడు ఈ **'నూతన యోగం'** రెండు శాఖలుగా పని చేస్తుందని, అందులో ఒకటి **"మాస్టర్ టీచ్"**. రెండవది **"యోగా-ట్రీట్"**! అంటే మానవ శరీరానికి కలిగే కర్మ సంబంధమైన అనేకానేక రోగాలు **మందులు అవసరం లేకుండానే** నివారణ చేయబడతాయి! ఇది తెలియని — లేక చేతగాని చాలామంది **"మాస్టరు"** వేషధారులు — తాము **"మాస్టర్ యోగా"** చెబుతామంటూ, రోగాలకుమాత్రం "హోమియోపతీ" — తరగతులు పెడతామని లోకులను మోసంచేసి పేరు, కీర్తియేగాక — డబ్బుకూడా దండుకుంటున్నారు — "మాస్టర్ యోగా" పేరుతో!

ఈ దొంగలు తెలుపనిది, **తెలియని** ఆధ్యాత్మిక సత్యం ఒకటుంది! అది ఏమిటంటే నిజానికి "మాస్టరు యోగం ఈ ప్రపంచంలోకి అవతరించిన మొదటి కారణం — **రోగ నివారణ!** తరువాత శరీరం 'వజ్ర'-తుల్యం చేయటం! మూడవది 'మోక్షం' ఈ **జన్మలోనే ప్రాప్తించటం!!!** అందుకని మందులు వేసితే అది **"మాస్టరు-యోగం"** కాదు! **"మాస్టరు-రోగం"** అన్నమాట!

ఈ యోగంవల్ల జరిగిన అనుభవాలే దీనిని నిరూపిస్తాయి!

ఇదే, మాస్టర్ యోగం యొక్క ప్రథమ కర్తవ్యం. ఎందువల్లనంటే విశ్వమంతా వ్యాపించిన **'ప్రాణశక్తి'** మాస్టర్‌గారి ఆజ్ఞలవల్ల క్రిందకు తీసుకు

రాబడి "ప్లెంటీ ప్రాణా" (Plenty Prana) — అన్న పేరుతో ఈ యోగసాధన చేసే 'మీడియమ్స్'కు అందించటం జరిగింది!

ఈ ప్లెంటీ ప్రాణా (Plenty Prana) యొక్క ముఖ్యధర్మం యోగ సాధకుల శరీరాన్ని, మనస్సునూ, ప్రాణచైతన్యాన్ని గట్టిచేసి, **శరీరాన్ని రోగరహితంచేసి** (భృక్త-రహితం) శరీర మనోబుద్ధులను బ్రహ్మ సాక్షాత్కారానికి అనువగునట్లుగా తయారుచేయడమే!

అంతేకాదు ఈ "ప్లెంటీ ప్రాణా" — సాధకుడు జీవించివుండగా ఆరోగ్యాన్ని ప్రసాదించడమేకాక, అతడు **మరణించిన తరువాత కూడా** అతని **ఆత్మ**కు సూక్ష్మశరీరానికి ఒక "వజ్రసత్త్వాన్ని" (Diamond body) కల్పిస్తుంది.

పూర్వ సాంప్రదాయంలో కూడా "వజ్ర-యానము" వజ్ర శరీరము, 'వజ్రధరుడు' అన్న మాటలవెనుక **'పిడుగు'**తో అంతర్లీనమైన ఒక **'కరెంట్'** వంటి శక్తే సూచించబడింది! ఇది **'యోగా-ట్రీట్'** అనే రోగనివారణ విభాగము.

ఇక **'మాస్టర్ టీచ్'** (Master Teach) అనే రెండోవిభాగం గురించి కొంచెం తెలుసుకుందాం! ప్రాచీన యోగ-పరంపరల్లో సాధకునిలో ఆధ్యాత్మిక శక్తి వెన్నెముకలో ఉద్భవించి నడుము క్రిందిభాగము వెన్నుపూస అడుగు నుంచి (మూలాధారం నుంచి) బయలుదేరి సహస్రారం వైపు ప్రయాణం చేస్తుంది! కాని **మాస్టర్ యోగా**లో జరిగేది దీనికి వ్యతిరేకం! ఇందులో మాస్టరుగారి దివ్యశక్తి **సహస్రారం** నుంచి ప్రారంభించి క్రిందకు దిగుతూ సాధకుని శిరస్సునుంచి శివుని శిరస్సునుండి గంగావతరణంలో వలే క్రింద **లోకాలకు** వ్యాపిస్తుంది!

ఇది మామూలు యోగపరంపరలో వలే సాధకులు ఊహించుకుని, భావించుకుని ధ్యానించే కల్పనాశక్తి ('భావనామాత్ర - సంతుష్టా') **కాదు!** ఇది ఒక కరెంటువంటి బలీయమైన శక్తి! సాధకుని ప్రయత్నంలో

ఏసంబంధం లేకనే — ఇంకా చెప్పాలంటే అతడికి **తెలియకనే**, ఈ శక్తి ఉపదిష్ట మంత్రమును (Course) మూడుసార్లు ఉచ్ఛరించి నమస్కారంపెట్టిన వెంటనే శరీరాన్ని **ఊపివేస్తుంది!**

## 'విద్యుత్'–అయస్కాంత జ్ఞానం :

ఒక **అయస్కాంతశక్తి** (Magnetic Force) ఒక **కరెంటుశక్తి** (Electric Force), ఈ రెండింటి లక్షణాలూ శరీరంలో కదలాడే ఈ యోగచైతన్యంలో — మనకు అనుభవమౌతాయి! బహుశః ఒకటి **ఇడా** నాడి, ఇంకొకటి **పింగళా** నాడి, అనే రెండునాడుల్లో ప్రవహించే విద్యుచ్ఛక్తియొక్క రెండు — స్త్రీ పురుష విభాగాలంటే ఇదేనేమో!

ఈ **యోగశక్తి** శరీరంలో విజృంభించినప్పుడు ప్రేయర్‌లో కూర్చున్న **మీడియం**యొక్క శరీర మనస్సులు విద్యుత్తులా వెలిగిపోతాయి! కళ్లు తెరుద్దామన్నా తెరుపుడుపడవు! **చేతులు** అప్రయత్నంగా వాటంతట అవే లేచి, నమస్కార స్థితిలోకి వస్తాయి! ఈ **అప్రయత్నమైన** నమస్కారమే, **మాస్టర్ C.V.V. యోగంలోని అద్భుత వింత!**

## గ్రహ గతులు మార్చుట :

ఇక రెండవ వింత మాస్టర్‌యోగంలో మనకు కనిపించేది బయట **గ్రహ మండలంలో** ఏర్పడిన కొన్ని దోషాలను సరిచేయుట! దీనినే **"ప్లానెటరీ రెక్టిఫికేషన్"** (Planetary Rectification) అంటారు! అంటే ప్రతీవారి **జాతకం లోనూ** లగ్నమూ 9 గ్రహాలూ ఉంటాయి! పూర్వజన్మ చెడుకర్మ ఫలితంగా కొన్ని కొన్ని గ్రహస్థితులు చెడుఫలితాల నిచ్చేలాగ **చెడు స్థానాలలో వుండి** అతడి యోగపురోగతికి ఆటంకము కావచ్చు. ఆకారణంగా **మాస్టరుగారు** ముఖ్యంగా పది-కోర్సులు ప్రసాదించివున్నారు. అవి ఏవంటే :-

1. **లగ్నా** రెక్టిఫికేషన్ కోర్సు (లగ్నమును సరిచేయు కోర్సు)
2. '**సోలార్** రెక్టిఫికేషన్' కోర్సు (జాతకములోని సూర్యస్థితిని సరిచేయు కోర్సు)
3. **చంద్రా** రెక్టిఫికేషన్ కోర్సు (చంద్రస్థితిలోని దోషాలను తొలగించే కోర్సు)
4. **బుధా** రెక్టిఫికేషన్ కోర్సు (బుధగ్రహాన్ని సరిచేసే కోర్సు)
5. **జూపిటర్** రెక్టిఫికేషన్ కోర్సు (గురుస్థాన దోషాలను సరిచేసే కోర్సు)
6. **శాటర్న్** రెక్టిఫికేషన్ కోర్సు (శనిదోష నివారణ కోర్సు)
7. ఎక్లిప్స్ రెక్టిఫికేషన్ కోర్సు (రాహు - గ్రహణ దోషాల నివారణ కోర్సు)
8. **శుక్రా** రెక్టిఫికేషన్ కోర్సు (శుక్రదోష నివారణ కోర్సు)
9. **మార్స్** రెక్టిఫికేషన్ కోర్సు (అంగారకుని దోషం సరిచేయు కోర్సు)

ఇలా ప్రతి **మీడియమూ** ఈ యోగంలో నియమితకాలంలో చేసే విధానంవుంది! దీనివల్ల సూర్యాది నవగ్రహాలు, లగ్నములలో గల అస్తవ్యస్థ పరిస్థితిని తొలగించి సాధకుని **జాతకాన్నీ — జ్యోతిశ్శరీరాన్ని** (Planetary Body) సరిచేసి **ఉన్నతలోకాలలోవుండే** అతీత స్థితులకు అనుకూలంగా అతని మనః — ప్రాణ — బుద్ధులను తయారుచేయడమే ఈ **కోర్సుల** ఉద్దేశ్యం!

## శుక్ర-గ్రహం – "ధూమకేతువా"?

ఇందులో అన్నిటికంటే శుక్రుడు చాలా ఉగ్రమైన గ్రహంగా మాస్టర్ గారికి లొంగలేదు! వీరి ఆదేశాలను శుక్రుడు సరకు చేయలేదు. తత్ఫలితంగా శుక్రుని అనుసంధించి ఒక ప్రత్యేకమైన కోర్సును స్మరించారు. మరుక్షణమే ఆకాశంలో ఒక విద్యుచ్ఛక్రంలాంటి 'కాంతివలయం' ఏర్పడి అది ఎదురుగా కనిపిస్తున్న కావేరి బ్రిడ్జిపైన పెద్ద పిడుగుశబ్దంతో పడటం

జరిగింది! దాంతో బ్రిడ్జి బ్రద్దలవటంకూడా జరిగింది! మాస్టరుగారి ఈ శక్తి ప్రదర్శనానికి శుక్రుడు లొంగక తప్పలేదు కాని పోరాటం చేయాల్సివచ్చింది.

కాని ఫలితంగా మర్నాడే మద్రాసులోవున్న మాస్టర్‌గారి అల్లుడు అకస్మాత్తుగా మరణించడం జరిగింది! అతణ్ణి అంతకు నెలరోజుల ముందు గానే మాస్టర్‌గారు తనదగ్గరకువచ్చి వుండమనీ, అతనికి చెడుకాలం సమీపంలో ఉన్నదనీ సూచించారు. ఆయన 'మన మామగారి మాటేకదా' అన్న భావంతో లెక్కపెట్టలేదు.

ఇప్పటికీ ఈ గ్రహాల **రెక్టిఫికేషన్** కోర్సులను జపించేవారికి పిడుగులు, కరెంట్‌వంటి గొప్ప సంచలనంలాంటి అనుభూతులు, మనల్ని ఉలిక్కిపడేలా చేస్తాయి.

## భైటి – గ్రహాలపై – అధికారం :

చాలాకాలంగా ఈ గ్రహాలు మానవులను వారి బానిసత్వంక్రింద ఉంచుకొని అధికారం చెయ్యటానికి అలవాటుపడ్డాయి! నిజానికి మానవ పరిణామానికి దోహదం చేయవల్సిన ఈ నవగ్రహాలు వాటి విద్యుక్త ధర్మాన్ని మరచి సంచరిస్తున్నాయి — అడిగేవాడు లేడనే భావంతో! ఫలితంగా ఈ యోగంలో గ్రహాలు వాటి యిష్టమొచ్చినట్లు పనిచేయడమేకాకుండా ఆవ్యక్తి ఆధ్యాత్మిక పరిణామానికి దోహదపడే విధంగా గ్రహస్థితులను సరిదిద్దుటయే ఈ **రెక్టిఫికేషన్ కోర్సుల** ఉద్దేశ్యం!

## భూగోళం భ్రమణం – సరిచేయుట – కలియుగాంతం! :

అలానే **భూగోళంలోకూడా** ఒక **వంకర–వున్నది!** నిటారుగా ఉండాల్సిన ఉత్తర దక్షిణ ధృవాలను కలిపే సరళరేఖ (North Polar axis) నిటారుగా ఉండక ఒక వైపుకు వాలి 23°-20' డిగ్రీల వంపుతిరిగి వుంటుంది!

దీనివల్ల భూపరిభ్రమణంలో బొంగరం తలకాయ ఆడించినట్లు తిరుగుతూ ఉత్తర-దక్షిణ ధృవకక్ష్య నియమితమైన మార్గంలో తిరగటంలేదు. దీన్ని **సరిచేయటమే మాస్టర్‌గారి యోగంలోని విశ్వపరిణామ కార్యక్రమం!!** దీనికోసమే వారు శరీరాన్ని త్యజించి ఒక **మంత్రదేవతా** స్వరూపం **లాంటి** ఒక **జ్యోతి స్వరూపాన్ని** పొంది ఈ భూగోళాన్ని సరిచేస్తున్నారు.

ఫలితంగా రానున్న దశాబ్ది కాలంలో (1990-2000) అనేక భూకం పాలు, అగ్నిపర్వతాల ప్రేలుళ్ళ రూపంలో **భూమియొక్క పరిభ్రమణం** క్రమక్రమంగా **మార్పబడుతోంది!!!** అప్పుడు **భూమియొక్క** ఉత్తర-ధృవం ఆకాశంలోని **ధృవనక్షత్రానికి** నిటారుగా (Straight Line) సరిచేయబడు తుంది!! దీనివల్ల **మానవజాతికి** ఏర్పడుతున్న **యుద్ధాలూ, కరువులూ, కాటకాలు** వంటి అనవసర **బాధాకర గ్రహఫలితాలు** సరిచేయబడతాయి!

తద్వారా మానవజాతినీ, ప్రపంచాన్నీ **'సత్యయుగం'** వైపుకు తీసుకు వెళ్ళడానికే ఈ **మాస్టర్ C.V.V.** యోగం ఆవిర్భవించింది!

# II

పై సారాంశంవల్ల మనకు తేలే ముఖ్యవిషయం ఒకటి వున్నది — **గ్రహాల పరిణామంనకూ మానవజాతి పరిణామానికీ** (Evolution) పోలికవున్నది! ఒకదానిని అనుసరించే రెండవ పరిణామం నడుస్తుంది!

అనగా విశ్వపరిణామంలో అత్యున్నతయోగం ప్రారంభించబోయే మానవజాతి ఇటు భూమిమీద స్వార్థము, ద్వేషము, హింస, సెక్సువంటి దోషాలను అధిగమించి గ్రహమండలంకన్నా పైనుంచి పరమగురువులు శక్తిగా ధారపోసే అనుగ్రహాన్ని సక్రమంగా ఉపయోగించుకుని దుర్వినియోగం చేయకుండా దైవత్వం తమలో వికసించే మానవుడిగా ఏర్పడాలి! అప్పుడే

ఈ 'మానవ పరిణామం' సక్రమంగా ఉన్నతస్థాయికి చేరుకోగలదు!

## 'మనిషిజాతి' – పరిణామం :

ఇది మానవజాతి ప్రయత్నంమీదనే ఆధారపడివుంటుంది! అంటే ప్రతి మనిషీ చేసే సాధనకూ మానవజాతి భవిష్యత్తుకూ సంబంధం వున్నదన్నమాట! అలావుండటమేకాదు, రెండింటికీ కార్యకారణ సంబంధం వున్నది! అనగా మనుషులు చేసే దోషాలు మాని భగవంతుడిచ్చిన మనసునూ, మెదడునూ స్వార్ధంతో రాజకీయాలతో యుద్ధాలతో దుర్వినియోగం చేసుకునే పాశవిక దశనుండి మానవుడు బైటపడి — పండిన మామిడి పండువలే పరిపక్వమై దైవత్వంలోనికి విచ్చుకున్నప్పుడే — ఈ అనుగ్రహశక్తి మానవునికి పూర్తిగా లభిస్తుంది! లేనినాడు — మనిషి చేసిన సైన్సూ మనిషి కనిపెట్టిన అణు బాంబులూ మనిషిని మనిషి ద్వేషిస్తూ దేశాన్ని దేశం పీడిస్తూ చేసే రాజకీయాలు అన్నీకలిసి ఈ భూగోళాన్నే భస్మీపటలం చేయగలవు!

అంటే భస్మాసురునివలే మనిషి తన శక్తుల దుర్వినియోగంవల్లనే తాను భస్మమైపోయే ప్రమాదం వున్నదని గమనించాలి! ఈ ఒక్క అంశంపైనే 1999-2010 లో పూర్తిఅయ్యే కలియుగాంతంలో మానవజాతి నశించకుండా నిలబడుతుందా? లేదా? అన్న అంశం ఆధారపడివుంది! దానిని మనిషే నిర్ణయించుకుంటాడు తన ప్రవర్తనద్వారా!

ఇది కాలపురుషుడు మానవజాతికిచ్చిన మరో హెచ్చరిక!

1) ఎక్లిప్సు (Eclipse) లేక గ్రహణం కోర్సులు
2) ఆరీ (Auri)–కోర్సు
3) సింపుల్ కోర్సు
4) ఆర్డర్–కోర్సు

5) హల్లర్–కోర్సు

6) వెండార్–కోర్సు

7) XII–థౌజండ్ మాస్టర్స్ (Thousand, Masters Adjustment) ఎడ్జస్టుమెంట్‌సిరీస్

8) శుక్ర (Venus) ఫస్ట్ లీడింగ్

9) శాటర్న్ (Saturn) రెగ్యులేషన్

10) సన్ (Sun) రెగ్యులేషన్

11) మూన్ (Moon) రెగ్యులేషన్

12) బుధ రెగ్యులేషన్

13) గురు రెగ్యులేషన్

14) శుక్రా రెగ్యులేషన్!

ఈ పైనచెప్పిన 'గ్రహాల కోర్సులు' మాస్టర్‌గారు తమ శిష్యులైన నారాయణయ్యర్, ప్రభాకరశాస్త్రిగారి వంటి 752 మంది మీడియంల చేత సాధన చేయించారు! ఆపైన దీనిలో మాస్టర్‌గారి సంతకం, మీడియంల సంతకాలూ చిత్రంలో చూడవచ్చు.

## శుక్రగ్రహం – తిరుగుబాటు :

ఇందులో గ్రహాలను కంట్రోలుచేయడంలో — లగ్నము చంద్రుడు, సూర్యుడు, కుజుడు, బుధుడు, గురుగ్రహాలను రెక్టిఫికేషన్ కోర్సులద్వారా సాధించగలిగారు! కాని, శుక్రగ్రహం మాత్రం మాస్టర్‌గారి ప్రయత్నాలకు లొంగకుండా తీవ్రంగా మొరాయించింది!

దాంతో మాస్టర్‌గారు ఈ శుక్రగ్రహాన్ని లొంగదీసుకోవడానికై మరింత బలవత్తరమైన యోగశక్తులను ప్రయోగించవలసి వచ్చింది! దానికి ముందుగా ఒకనాటి సాయంకాలం కావేరీనది ఒడ్డున ఒక వంతెనమీద ప్రయోగించి

చూశారు! మాస్టర్‌గారి యోగమిత్రులు గుండ్రంగా కూర్చుని శుక్రగ్రహం కోర్సును తీవ్రంగా చేయసాగారు! మాస్టరుగారు తీవ్రమైన ధ్యానంలో వుండి యోగశక్తిని విడిచిపెట్టారు! మరుక్షణంలో ఒక మెరుపువంటి విద్యుత్తు లాంటిది తళుక్కుమని ప్రకాశించి బాంబుపేలినంత శబ్దమై ఎదురుగా వున్న వంతెన పేలి కిందకిపడింది!

అప్పుడు దానిశక్తి సరిపోతుందని భావించి మాస్టర్‌గారు మరునాడే యోగదీక్షలో కూర్చుని అదే శక్తిని శుక్రగ్రహ కోర్సుద్వారా శుక్రునిపై ప్రయోగించారు. అది పెద్దశక్తితో వెళ్ళి తాకినవెంటనే శుక్రగ్రహంపై ఒక సొట్టవంటి మచ్చకూడా పడింది! దానిని మరునాడు టెలిస్కోపులలోనూ ఇప్పటి వాయేజర్‌లోని ఫొటోలు తీసిన చిత్రాలలోనూ స్పష్టంగా కనిపించింది!

కాని ఫలితంగా ఒక కరెంటువంటి షాక్ — తిరిగి వెనక్కు దూసుకుని వచ్చి మాస్టర్‌గారి శరీరంలోకెళ్లి, షాక్‌కొట్టింది! మరుక్షణమే మాస్టర్‌గారి గుండె, మెదడు ముఖ్య అవయవాలూ స్థంభించిపోయాయి! ఫలితంగా మాస్టర్‌గారు శరీరం విడిచిపెట్టి, మృతిచెందడం జరిగింది!

## సువర్ణ 'యుగం' :

అయినప్పటికీ మాస్టర్‌గారు శరీరం విడిచినా పైలోకాలకు వెళ్ళి శుక్ర గ్రహాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకొని పరిపూర్ణ విజయం సాధించి ఈ శతాబ్దం చివరలో తిరిగి తన **సెంటిగ్రేడ్ యోగాతో** (Centigrade Yoga) తిరిగివస్తానని ప్రకటించారు! సెంటిగ్రేడ్ అంటే నూరేళ్ళు!

అనగా 1910 నుంచీ లెఖ్ఖిస్తే 2010 లో ఈ విజయం పూర్తికావచ్చునని **మాస్టర్‌యోగం**లో అనుభవం కలిగిన మీడియంలు చాలామంది ఎదురు చూస్తున్న — అద్భుతమైన — 'కాలం' ఇదే!



## 9

# "విశ్వం పెరుగుదల" - గ్రహాల పరిణామం!

### మాస్టర్ యోగంతో జాతక గ్రహదోషాల మార్పు!

ఇంతవరకూ మాస్టర్ CVV ఆవిష్కరించిన **నూతన యోగం**లోని ముఖ్యాంశాలు ఆకళించుకుంటే — ముఖ్యంగా పూర్వంనుంచీ వస్తున్న సాంప్రదాయక యోగమార్గానికి హఠయోగ, రాజయోగాలకు మాస్టర్‌గారి యోగానికీ వున్న తేడాలను గమనిస్తూ మానవపరిణామంలో ఈ నూతన యోగంయొక్క పాత్రను దృష్టిలోవుంచుకుని — ఇంతవరకూ తేలిన ముఖ్యాంశాలను ఒకసారి గుర్తుచేసుకుందాం!

1. మానవుడు వేలసంవత్సరాలుగా, "కర్మ"కు బానిసగా (Inner Slavery) బ్రతుకుతున్నవాడు తన కర్మనుంచి విముక్తిపొందే **యోగమార్గాన్ని** అనుగ్రహంగా పొందగలుగుతాడు.

2. **యోగసిద్ధి** ఈ నూరు సంవత్సరాలలోగా, మానవజాతిని పరిపూర్ణ మొనరించి మానవుని శారీరక మానసిక **ఆధ్యాత్మిక** పరిణామమును పూర్తిచేయును.

3. ఈ సృష్టికి కారణభూతుడగు, సగుణబ్రహ్మ అంశలో ఒక జగద్గురువు మానవలోకానికి అవతరించి ఆ **నూతన యోగప్రక్రియను** జీవుల ఉపయోగార్థమై వెల్లడించును.

   ఈ "**నూతన CVV యోగము**"లో, ఇదివరకు అనేక జన్మలు తపస్సు చేస్తేగాని సిద్ధించని సాధనావిధానము రద్దుకాబడి పది — (10) సంవత్సరములు ఎవ్వరైనా నియమాలు తప్పక సాధనచేస్తే వారికి **సంపూర్ణ జన్మరాహిత్యమును** — మోక్షస్థితిని కేవలం ఆ పది సంవత్స రాలలోనే పొందగలరు! ఇది నిస్సందేహము.

4. సాధారణ యోగములో వలె ఈ యోగంలోని ఆధ్యాత్మిక-శక్తి, సాధకుని మూలాధారమునుంచి పైకి లేచే '**కుండలినీ శక్తి**' వలే సాధకుని ప్రయత్నంపై ఆధారపడి పనిచేసేదికాదు.

5. మామూలు యోగంలో క్రిందినుండి (మూలాధారమునుండి) '**జీవ-శక్తి**' మేల్కొని సహస్రారంవైపు ప్రయాణిస్తూపోతుంది. ఇందులో శరీరా నికి అడుగుభాగానవుండే '**సెక్సు-కేంద్రము**', స్థూలశరీర స్వభావ కేంద్రము, జడప్రాణకేంద్రము ముందుగా మేల్కొలుపబడతాయి గనుక వీటి ఉద్వేగమును సాధకుడు కంట్రోలుచేయుట కష్టము.

6. ఈ '**నూతన యోగం**'లో జరిగే యోగప్రక్రియ సహస్రారము పైనుంచి **ప్రారంభించి** క్రిందికి దిగుతుంది. సాధకుడు ఎంత ప్రయత్నించినా ఈ యోగశక్తి అతనికి ఎంత పనిచేస్తే మేలో, అంతే పనిచేస్తుంది.

ఈశక్తిని ఎక్కువగాని పెంచుటగాని, తక్కువచేసిగాని తగ్గించుటగాని చేయటము సాధకునిచేతిలో వుండదు.

7. ఈ సాధన నడిచేటట్లుచేసే శక్తి ఒక కరెంటువంటి విద్యుత్తువంటి, శరీరము గగుర్పొడుచు తీవ్రశక్తి — అది, మనస్సును, ఇంద్రియములను **యోగచక్రములనూ** మేల్కొలుపును. అందుచేత ఇది మనిషి పూర్తి మెలకువతో నుండగానే శరీరములో పనిచేయును, 'సమాధి' లో కాదు!

8. ఇది మామూలు 'కరెంటు'వలే జడశక్తిగాదు! ఇది స్వయం 'తెలివి' (Self-Will) కలిగిన సజీవమైన శక్తి! ఇది సాధకుని శరీరములో ఏంచేయ సంకల్పించిందో ఆ మార్పులనే బుద్ధిపూర్వకముగా చేయును! దీనికి సాధకుని సంకల్పముతో ఎట్టి — నిమిత్తమూ లేదు. ఇది పరమగురు వగు లోకగురువు (మాస్టర్) ఆజ్ఞ ననుసరించియే పనిచేయునుగాని మన వశములో నుండదు.

9. ఈ విశ్వప్రాణశక్తి శరీరంలోని రోగములను అసంపూర్ణతలను కర్మ దోషములనూ బాగుచేయును. ఇది సాధనలో మొదటి భాగము!

10. తరువాత, ఇది మనస్సుకు శాంతి కలిగించును. శరీరంలోని **యోగకేంద్రములకు** విద్యుత్‌వంటి **'యోగశక్తిని'** సరఫరాచేసి, శరీరము, మెదడు, నాడీమండలమూ తీవ్రచైతన్యంతో కరెంటు ప్రవహించే తీగలవలే పని చేయించును. తత్ఫలితముగా 'సంకల్పములు' క్షణములో కార్యరూపం ధరించే సిద్ధికలుగును.

11. ఈ "నూతన యోగం" యొక్క ప్రయోజనం సాధకుని వ్యక్తిగత **మోక్షము** కాదు! సర్వ మానవజాతియొక్క "సామూహిక ఆధ్యాత్మిక పరిణామమే" — మోక్షమే"!

ఈ విధానంలో మనిషి తన ఒక్కడి వ్యక్తిగత మోక్షమూకోరి చేసే తపస్సు నిష్ఫలమగును. కారణం, ఇది ఆధ్యాత్మిక స్వార్థమే కాబట్టి! **విశ్వగురు** వైన భగవానుడు అట్టివానిచేత విధిగా మానవజాతి యొక్క సేవ చేయించును.

12. నిస్వార్థముగా ఏకోరికా లేక, ఇతరుల బాధలను నివారణచేసే ఆదుర్దా తో, వారియందు నిజమైన ప్రేమతో, వారి హితముకోరే దృష్టితో సేవచేసేవారికే, శరీరములో ఈ బ్రహ్మ-చైతన్యము మేల్కొనును.

13. ఈ యోగంలో — శరీరమే **విశ్వం!** సాధన కూర్చుండునప్పుడు **శరీరములో** జరుగుచుండు **'యాక్షన్'** Action లేక 'యోగచర్య'ను తన మనస్సుతో గమనించుటే శరీరములోని శక్తి సంచాలనము! ఈ విశాల విశ్వములో పైకీ క్రిందికి అన్నివైపులకీ వ్యాపించినట్లే కరెంటు తీగెలవలే శరీరమంతటా వ్యాపించి పనిచేయు ఈ విశ్వచైతన్యమును మనలోనే గమనించవచ్చును.

14. మానవుని శరీరంతోపాటు ఈ భూగోళంలోకూడా అనేక మార్పులు సాధించుటకై **సిద్ధ-గురుమండలిచే** ప్రయత్నములు జరుగుతున్నవి. తత్ఫలితంగా ఈ **నూతన యోగము** 29-5-1910న భూమికి అవత రించినది.

15. ఇప్పుడు భూమి అక్షము నిటారుగాలేక, ఒక వైపుకు వంగి (tilt) యుండుటచేత ఉత్తర - దక్షిణ ధృవములు ఒక ప్రక్కకు వంగి వున్నవి. ఆ కారణంవల్ల **కాలగతి** అస్తవ్యస్తమై ఎగుడుదిగుళ్ళు కలిగి 'సంవత్సర చక్రం'లో మానవజాతికి అనేక కష్టనష్టములు కలుగు చున్నవి. దీన్ని సర్దుబాటుచేసి భూమియొక్క ఉత్తర దక్షిణ 'ధృవ-అయస్కాంత కక్ష్య' (Axis) ను **నిటారుగా** (Vertical) మానవుడి










భూమి ఉత్తర-దక్షిణ ధృవములలో మార్పులు (1999-2010)

శరీరంలోని అయస్కాంత దండము (Mangnetic Polar Axis) భూమియొక్క అయస్కాంతశక్తితో సమాంతరము (Parallel) గా పనిచేయునట్లుగా సగుణబ్రహ్మచే ప్రయత్నములు జరుగుచున్నవి.

16. దీనివల్ల, భూమి ఉత్తర దక్షిణ ధృవములలో మార్పులు (Changes in Earth's Axis) త్వరలో (1999-2010) లోగా ఏర్పడగలవు! దీని వలన తాత్కాలికముగా భూమిపైన కొన్ని 'ప్రళయము'లు, సంక్షోభ ములూ ఏర్పడినా చివరికి ఈ "**కలియుగాంతం-మార్పు**" మానవ పరిణామమునకు గొప్ప **మేలు చేయును.**

17. రానున్న ఈ '**యుగం-మార్పు**' వల్ల మానవజాతి ఇప్పటిదాకా నడుస్తున్న స్వార్థపూరిత అజ్ఞానసంబంధమైన స్వార్థజీవితమును విడిచిపెట్టి — మనిషి — విశ్వకళ్యాణమునకే — ఉపయోగించే పనిముట్టుగానే తమకు ఈ **శరీరము, మనస్సూ,** ఇంద్రియములూ ఇవ్వబడినాయని గ్రహించును. తన కిచ్చిన శరీర - ప్రాణ - మనస్సులనబడే ఈ '**యోగ-పరికరము**'లను సద్వినియోగముచేసి తన జీవితము లక్ష్య వంతము చేసుకొను విధానము మానవజాతికి త్వరలోనే **పరమ గురువులచేత** బోధించబడును.

18. దీనివలన ఇప్పటి '**కలియుగము**' రూపు మాసిపోయి ఒక '**నూతన సమాజ వ్యవస్థ**' — ప్రపంచమంతా నూతన రాజకీయ మార్పులతో బాటు అంతర్జాతీయ స్థాయిలో కూడా రాజకీయమార్పులు కలిగించి ప్రపంచంఅంతా ఒకే కుటుంబముగా ఒకే పరిపాలనక్రిందకు వచ్చు నట్లుగా "**పరమ-గురుమండలి**" కృషిచేయుచున్నది.

19. త్వరలోనే **రాజకీయములు** నిష్ఫలమని, వ్యర్థమని ప్రపంచమంతా గ్రహించగలుగుదురు.

అలానే యుద్ధములు అవసరమని, మానవ సమస్యలు ఆలోచనతోనూ, నేర్పుతోనూ, లోకకళ్యాణ బుద్ధితోనూ సరిచేసు కొనుటయే రానున్న సరికొత్త 'కర్మయోగపు' ప్రధాన లక్షణము.

20. మానవుడు గ్రహాలకు **లోబడి** తన పూర్వకర్మకు బద్ధుడై తన జాతకము లోని గ్రహఫలితాలకు బానిసగా గ్రుడ్డిగా బ్రతికే యుగయుగాల జ్యోతిషపద్ధతి రద్దుకాబడును. మానవుడు గ్రహములకు — **యజమానిగా** తన కర్మలకు తానే బాధ్యుడుగా **బానిసత్వము విడిచి** దేవతలలాగే, తానూ — **దివ్యజీవనమును** సిద్ధింపచేసుకొనును.

21. బైట సూర్యుడూ, గ్రహమండలములోని 'విద్యుత్' (Electric) అయ స్కాంత (Magnetic) శక్తులను పుట్టించినట్లే మానవుడు తన శరీరంలో ఏడు యోగ-కేంద్రములతో ఒక రేడియోవలే, లోపల శక్తులను **బయట శక్తులతో** సమన్వయం చేసుకునే ఒక **యంత్రం**లాగ — తన శరీరాన్ని రేడియో యంత్రంలా ఉపయోగించటంద్వారా బైట విశ్వాన్నే "రిమోట్-కంట్రోలు" చేయటం ఎలాగో నేర్చుకుంటాడు.

22. నేటి యుద్ధములూ విప్లవాలూ రక్తపాతాల **రాజకీయాల — యుగమే** స్వార్థపూరిత — **"కలియుగం"**. ఇది అంతంచేయుటకు మానవ పరిణామం (Human Evolution) లో ఒక నూతన అధ్యాయాన్ని ఆవిష్కరించడానికే విశ్వంలోని **"పరమగురు మండలి"** — మనకై సాధన చేయుచున్నారు.

23. రష్యాలో "గుర్జీఫ్" (Gurdjieff) మహాశయుడు బోధించినట్టు' నూతన జ్ఞానం ('New Way of Thinking') అనే ఆధ్యాత్మిక ప్రక్రియవల్ల భూమిపైన ఆధ్యాత్మిక కేంద్రము స్థాపించబడును. అదే — "శంబల"!

24. మనస్సుతోనే రోగ నివారణచేయు పద్ధతి Yoga treatment ప్రచారం లోనికివచ్చి ఇప్పటి మొరటు వైద్యపద్ధతులూ కసాయివానివలె సర్జరీ చేయు పద్ధతులూ శరీరమునకు హానికలిగించునట్టి రసాయనిక విషాలూ, మందులూ, నిలిపివేయును.

"మనిషి మనస్సే — రోగ నివారణము నకుగాని — రోగము నకుగాని కారణము", అని కనుగొనబడును!

25. మానవశరీరం ఒక యంత్రం : విశ్వంలోని శక్తులను తన మెదడు లోని శక్తితో నడిపించుకునే పద్ధతులను కనుగొని — మనిషి ఒక పైలెట్ విమానాన్ని నడిపించినట్లు తన జీవిత నౌకను తానే నడుప గలడు! ఇదే కృతయుగం లేక "సత్యయుగం."

26. అణువులోనూ సూర్యుని హృదయములోనూ ఈ బ్రహ్మాండగోళ మంతటా తానే నిండివున్న అనుభూతిని మానవుడు పొందగలుగును! ఇదియే రానున్న "సత్యయుగము"లో భూమిపై ఏర్పడే "భగవంతుని రాజ్యం" (Kingdom of God on Earth) ఇదే దేవుని పాలన!



# 10

# జీవుడి ఆధ్యాత్మిక పురోగతి - 'ఆకస్మిక మార్పు'కు సైన్సు సాక్ష్యం

మాస్టర్ CVV యోగానికి, కారణమైన మహోన్నత ఆశయం ఒక్కటే — అది ఏమిటంటే మానవజాతి ఆధ్యాత్మిక పరిణామం జంతుదశలను దాటలేదు కనుక వెనుకబడివున్న మానవపరిణామాన్ని ముందుకు నడిపించే ఈ నూతన యోగప్రక్రియద్వారా చివరకు మృత్యువును కూడా మానవుడు జయించగలగాలి! అని, ఇలా మృత్యువును జయించే మహోన్నతప్రయత్నం మీదే మాస్టర్‌గారి తమ నూతన యోగవిధానమైన భృక్తరహిత తారక రాజ యోగాన్ని పైనున్న పరబ్రహ్మలోకంనుంచి ఆవిష్కరించారు! ఇది సైన్సు విజయాలలో మానవుడు చంద్రమండలంమీద అడుగుపెట్టడం ఎంతటి ఘనవిజయమో అంతకన్నా కూడా గొప్ప విజయం మృత్యువుపై విజయం కనుక దాన్నే సాధించడానికి పూనుకున్నారు!

అయితే చాలామందికి సహజంగానే గొప్ప సందేహం కలుగుతుంది! అదేమిటంటే మనిషికి జన్మ అనేది వున్నదికదా! పుట్టిన ప్రతీజీవి మరణించడం ప్రకృతిలో చూస్తున్నాంకదా! అలాంటప్పుడు ఒక్క మానవుడికి మాత్రమే మృత్యువును జయించి చిరంజీవిఅయ్యే ప్రత్యేక అధికారం ప్రకృతిసూత్రాలకు విరుద్ధంకదా! శరీరం మరణిస్తే దాంతోపాటు ఆ శరీరంలో పనిచేస్తున్న ఆత్మ, ప్రాణం, మనస్సు అన్నీ మరణించాలికదా! అన్నది సైన్సుపరమైన హేతువాద సిద్ధాంతంరీత్యా ఎదురుబడే చిక్కుప్రశ్న!

## 'ఆకస్మికమార్పు' – "మెటామార్ఫోసిస్" (Meta Morphosis) :

దీనికి నిశితంగా ప్రకృతిని పరిశీలిస్తే బయట జీవరాసులలో ఎక్కడైనా ఒక శరీరం మారిపోయి **మరొక్క శరీరం** ఏర్పడటమూ, అలా ఒక **శరీరం పోయి** ఇంకో శరీరం వచ్చినపుడు **లోపలవున్న జీవియే మరణించకుండా** అదేవ్యక్తిగా **రెండవ శరీరంలోనూ** బ్రతికి **బట్టకట్టడం** సాధ్యమని నిరూపించే దృష్టాంతాలు సైన్సుకుకూడా కళ్ళఎదుటే కనిపిస్తున్నాయి!

వాటిని గురించి పట్టించుకోరు! అంటే ఇలాంటివి రెండు ఉదాహరణలు మనకి కనిపిస్తాయి! (1) కప్ప జీవితంలో ఏర్పడేదశలు! అలానే (2) గొంగళిపురుగు సీతాకోక చిలుకగా మారే **"ఆకస్మికమార్పు"** "సంపూర్ణ జీవిత పునర్నిర్మాణము" **"మెటామార్ఫసిస్"** (Meta Morphosis) జరగటం ద్వారా ప్రకృతి మనకు సూచనగా **మనిషికి కూడా** ఇలానే **శరీరాన్ని** మార్చడం లేక పునర్నిర్మాణం చేసుకోవడంద్వారా మృత్యువును జయించటం సాధ్యమని సూచిస్తున్నదా? ఇది తెలియాలంటే ఈ రెండు జంతువుల జీవితచరిత్రలు (Life History) తెలియాలి!

ముందుగా కప్పపిల్ల జీవితం పరిశీలిద్దాం!

## "కప్ప–మెటామార్ఫసిస్ :

కప్పలు గుడ్లుపెడతాయి! అవి తల్లి శరీరం బయటకు రాగానే మగకప్ప వీర్యంతో బయటే కలిసి ఒక పిండంగా ఏర్పడుతుంది! ఈ పిండోత్పత్తి దశలు పూర్తికాగానే ఆ పిండంలోంచి బయటకువచ్చే కప్పపిల్ల పెద్దకప్పలా వుండక ఒక **చేపపిల్లవలే** వుంటుంది! దీనికి **"టాడ్‌పోల్"** (Fish like Tadpol) అని సైన్సులో అంటారు! ఈ చేపపిల్ల-వంటి దశలో కాళ్ళు లేకుండా తోకతో ఈదుతూ గాలిముక్కుతో పీల్చకుండా నీటిలోంచే చేప-మొప్పల (gills) ద్వారా చేపలమాదిరిగానే నీటిలోనే శ్వాసక్రియ నడుస్తూ అచ్చం చేపలాగే జీవిస్తుంది! ఇలా స్వతంత్రంగా జీవించే — కప్పపిల్లను చేపను పోలిన **"టాడ్‌పోల్"**-దశ అంటారు!

ఇది వున్నట్టుండి అకస్మాత్తుగా **సంపూర్ణ జీవిత** పునర్నిర్మాణం ద్వారా మారి దాని తోక క్రమంగా చిన్నదైపోతుంది! తర్వాత వెనకకాళ్ళు ముందుకాళ్ళు మొలకలవలే మొలిచి పెద్దవవుతాయి! పెద్దగావున్న తల — క్రమంగా చిన్నదై నోటిలో దవడల్లో పళ్ళు ఏర్పడతాయి!

ఇదే సమయంలో చేపల "మొప్పలు" (Gills) పోయి కప్పకుండే ఊపిరితిత్తులు ఏర్పడి ఈ కప్పపిల్ల నీటిపైచేరి గాలిపీల్చడం నేర్చుకుంటుంది! క్రమంగా దీని చేప-తోక చిన్నదై కప్పపిల్ల పెద్దదై కాళ్ళూచేతులు ఎదిగి బలంగా నేలమీద గెంతుతూ చిన్న తోకతో తిరిగే కప్పపిల్లగా జీవిస్తుంది! ఆతర్వాత అకస్మాత్తుగా పెద్దకప్పగామారి — ఆతర్వాత తోక రాలిపోతుంది! ఇది పరిణామంలో చేపలనుండి కప్పలు గత యుగాలలో ఉద్భవించిన పరిణామదశలను ఈ కప్ప తన పిండోత్పత్తి దశలతో అనుకరించి (Recapitulation) నిరూపించింది! ఇలా తన శరీరం మారిపోవడం చేప లాంటి శరీరంపోయి కప్పలాంటి శరీరం ఏర్పడటం జరిగినా **లోపలుండేది**




మాత్రం — ఒకే కప్ప జీవం, అదే వ్యక్తిత్వంతో ఈ దశలన్నింటిలోనూ జీవించివుంటుంది! ఇది మొదటి (1) ఉదాహరణ!

మనిషికూడా యోగపరిణామంలో తన శరీరనిర్మాణాన్ని యోగప్రక్రియ ద్వారా మార్చుకుంటే కప్ప ఎలాగైతే 'శ్వాసపీల్చే విధానంద్వారా దాని జీవితం మార్పుచెందినట్లే — **మనిషికూడా శ్వాసద్వారా ప్రాణాయామంద్వారా** తన లోపలి **అంతరాత్మను పూర్తిగా** మార్చుకుని తన పరిణామదశలో **ఒకమెట్టు పైకి వెళ్ళగలడు** — అని ప్రకృతే నిరూపిస్తున్నది!

## గొంగళి – సీతాకోక :

ఇక రెండవ ఉదాహరణ **గొంగళిపురుగు!**

సీతాకోకచిలుక ఆకుక్రింద గుడ్లుపెట్టి ఎగిరిపోతుంది! ఆ గుడ్లు పొదిగి పగిలి అందులోంచి సీతాకోకచిలుక వంటిది **తల్లిని పోలిన పిల్లలా కాకుండా** — ఒక క్రిమి రూపంలోవున్న **గొంగళిపురుగుగా** జన్మిస్తుంది! దీని శరీర మంతా నూగు, వెంట్రుకలు, ముళ్ళుపెరిగి క్రిమిలా (Worm) వుంటుంది! అలా రోజంతా ఆకులుమేస్తూ తిండితోనే బ్రతుకుతుంది! స్వార్ధజీవితంతో బ్రతికే మానవుడి లాగా — అధమస్థితిలో!

## ఆకస్మికమార్పు – నిద్రావస్థ :

కాని ఇంతలోకే — అకస్మాత్తుగా ఈ గొంగళిపురుగుగా ఆహారం తినడం మానివేస్తుంది! ఉపవాసంద్వారా నిద్రావస్థలోకెళ్లిపోయి శరీరంచుట్టూ ఒక గూడు కట్టుకుని — ఒకయోగి సమాధిద్వారా అంతర్ముఖమై భూమిలో జీవసమాధిచెందినట్టే ఈ గొంగళి పురుగుకూడా అంతర్ముఖమైన నిద్రావస్థలో వుండిపోతుంది!

ఆ దశలో దాని శరీరంలోని అవయవాలన్నీ మాసంకింద కరిగి నీరుగా మారి పునర్నిర్మాణంకాగా, అది తిరిగి సీతాకోకచిలుకలోని అవయవా లతో శరీరంలో నిర్మాణం చెందుతాయి! వెంట్రుకలుపోయి రెక్కలు ఏర్పడ తాయి! **క్రిమివంటి** రూపంపోయి అందాల **సీతాకోక** చిలుకవలే ఎగిరే రూపం ఏర్పడుతుంది! పచ్చిఆకులు మేసి బ్రతికే గొంగళిపురుగు ఇలా తన జీవిత విధానాన్ని మార్చుకుని అది దేపపటినుంచీ తేనెతాగిజీవించే ఒక ఎగిరే జీవిగా మారిపోతుంది!

ఇలా రెండు అవతారాలుగా 1) గొంగళి పురుగు 2) సీతాకోకచిలుకగా




గొంగళిపురుగు (Cater Piller)

సీతాకోకచిలుక (Butterfly)



మారిపోవడంద్వారా ప్రకృతి మానవుడికి — తానుకూడా జంతుదశనుండి దేవతల వలే ఆకాశంలో ఎగిరేదశను ఎలా పొందవచ్చో ఈ రెండు ఉదా హరణలద్వారా ప్రకృతియే సూచిస్తున్నది! మనిషికి నిద్రాహారాలు మాని తపస్సుచేసి పూర్తిగా తన శరీరాన్నే జయించ వచ్చని ఇలా ప్రకృతిసూత్రం ద్వారా రూఢిఅవుతున్నది!

ఈ సూత్రాన్ని ఆధారంచేసుకునే — పూర్వం ఋషీశ్వరులు **"యోగ శాస్త్రాన్ని"** సృష్టించారు! జీవసమాధి పొందిన యోగి వేమన, రాఘవేంద్రస్వామి జ్ఞానేశ్వరమహరాజ్ వంటి మహాయోగులు ఇలా కంబళిపురుగు నిద్రావస్థవలే తామూ **సమాధిస్థితిలోకి** వెళ్ళిపోయి భూస్థాపితంచేయబడి అందులోనే వారి సూక్ష్మశరీరమంతా మారిపోతుంది! ఈ ప్రక్రియద్వారా **మానవుడు-భగవానుడుగా** మారవచ్చని ప్రకృతియే నిరూపిస్తున్నది!

ఈ సూత్రాన్ని ఆధారంచేసుకొనే **మాస్టర్ CVV** తన **"తారక రాజ యోగాన్నీ"**, రష్యన్‌యోగీ, సిద్ధపురుషుడూ, అయిన గుర్జీఫ్ మరణించాక జీవించిన తన **ఎలక్ట్రానిక్ శరీరం** (Electronic Body) ద్వారానూ నిరూ పించారు!

మాస్టర్‌గారు చనిపోయిన తన ముసలి మేనత్తను — ఆమె మర ణించిన మూడవనాడు బ్రతికించారు! ఇది మృత్యువుపై విజయం!

పై ముగ్గురూ యోగులకన్నా ఒకమెట్టు పైకివెళ్లి మద్రాసు రాష్ట్రంలోని వడలూరువద్ద జన్మించిన జ్యోతి రామలింగస్వామి ఒక గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుని నిద్రాహారాలు లేకుండా తన యోగసమాధిద్వారా కొన్ని నెలలునిండి ఆ తర్వాత తలుపుతీసి చూస్తే శరీరమే పూర్తిగా మాయమై ఆకాశంలో జ్యోతిగా కలిసిపోయాడు! ఇది మృత్యువుపై **సంపూర్ణవిజయం!**

మాస్టర్ CVV, అరవిందయోగి, గుర్జీఫ్, రమణమహర్షులుకూడా యోగంద్వారా మృత్యువును జయించినా వారి భౌతికశరీరాలు మాత్రం చివరికి మరణించక తప్పలేదు! ఒక్క జ్యోతిరామలింగస్వామి మాత్రమే మృత్యువుపై పూర్తి విజయాన్ని సాధించి **జ్యోతిరూపంలోకి మారి** తన శరీరం మరణించకుండా చిరంజీవుడైనాడు! తద్వారా మానవుడు లేక మానవజాతి భవిష్యత్తులోనైనా మృత్యువుపై విజయాన్ని సాధించవచ్చునే సత్యాన్ని సైన్సు పరంగా ఋజువుచేశాడు!

ఇలా సీతాకోకచిలుక, గొంగళిపురుగు, కప్పపిల్ల ఉదాహరణలేకాక, సముద్ర పీతలలోనూ, రొయ్యలలోనూ దోమ జీవితచరిత్రలోనూకూడా ఇలాంటి దశలు మారి అకస్మాత్తుగా జీవితం మారిపోవడం (Metamorphosis) ను చూడవచ్చు! (పైన చూపిన చిత్రాలలో ఈ "మార్పు" చూడగలరు.)



# 11

# మాస్టర్‌గారి జీవిత విశేషాలు

మాస్టర్ C.V.V. గారి జీవిత విశేషాలు — వారిద్వారా నూతన యోగా విష్కరణ జరగటానికి ముందుకాలంనాటివి మనకంతగా అందుబాటులో లేవు. దీనికి కారణాలనేకం! తన వ్యక్తిత్వ ప్రశంసలను మాస్టర్‌గారు ఎన్నడూ ప్రోత్సహించలేదు! నిజం చెప్పాలంటే వారి వినూత్న యోగానికికూడా ఎట్టి ప్రచారమూ ఉండకూడదంటూ నిషేధం విధించారాయన!

> "మనమేమీ ఇదివరకు లేనిదాన్ని — యింకో మతంగా మానవాళికి పరిచయం చేయడంలేదు! ఇప్పటికే ఎంతో సందేహాల తోనూ సందిగ్ధతల తోనూ ఉక్కిరిబిక్కిరి అవుతున్న మానవమస్తిష్కా నికి ఇదోక్రొత్త సమస్య కారాదు.
>
> ఈ నూతనయోగం ఒక ఎలక్ట్రానిక్ ఫోర్సుతో పనిచేస్తుంది. పదార్థానికీ, శక్తికీ, అంతెందుకు సైన్సుమేధకుకూడా అందనంతటి ఎత్తునుండి పనిచేస్తుంది. ఇదొక చేతనామయప్రజ్ఞ! చైతన్యవంత మైన శక్తిస్వరూపం" అనేవారు.

ఈ కారణంచేతనే శ్రీవారు తమ వ్యక్తిగతజీవితానికి సంబంధించిన వివరాలను కావాలనే ప్రచారంకానివ్వలేదు! మీడియంలకుకూడా అట్టి ప్రచారాన్ని ఆర్భాటాలను నిషేధించారు! ఐనప్పటికీ శ్రీవారి వ్యక్తిత్వానికి అద్దంపట్టేవిలా వారి అలవాట్లను, మృదుగంభీరస్వభావాన్ని కన్నులకు కట్టే టటువంటి కొన్ని విశేషాలు మనకీనాడు లభిస్తున్నాయి. అవేమిటో తెలుసు కుందాం.

## శ్రీవారి–జననం :

శ్రీ కంచుపాటి వెంకటరావు వెంకాస్వామిరావుగారు తెలుగు నియోగి బ్రాహ్మణుల కుటుంబంలో 4 ఆగష్టు 1868న కుంభకోణంలో ఉదయం 10 గంటలప్రాంతంలో జన్మించారు. మాస్టర్‌గారి పూర్వీకులు కృష్ణాజిల్లాకు చెందినవారు. వారి ముత్తాతగారి కాలంలో తంజావూరు ప్రభువులు తెలుగు భాషను సంస్కృతినీ ఆదరించి పోషిస్తున్న సమయంలో శ్రీరంగానికి తరలి వెళ్ళారు.

అక్కడినుంచి ఆ కుటుంబం 'అమ్మాళ్ సత్రం' అనే చిన్నగ్రామానికి నివాసం మార్చుకున్నది. మాస్టర్‌గారి తలిదండ్రులు ఈ 'అమ్మాళ్‌సత్రాని'కి చెందినవారే. ఐనా వాళ్ళకి శ్రీవైష్ణవ సాంప్రదాయానికే ఆటపట్టైన శ్రీరంగం (యతిసార్వభౌమ బిరుదాంకితులైన భగవద్రామానుజుల పీఠంఉన్న క్షేత్రం) లో ఒక స్వంతయిల్లుకూడా ఉండేది.

మాస్టర్ C.V.V. గారి తండ్రిపేరు శ్రీ కుప్పుస్వామిగారు. వారి మాతృమూర్తి పేరు శ్రీమతి కామమ్మగారు! మధ్యతరగతి తెలుగు నియోగి బ్రాహ్మణ కుటుంబం వారిది. ఆనాటికీ, ఈనాటికీ సాంప్రదాయికులైన బ్రాహ్మణ కుటుంబాలలోలాగే బాలుడైన శ్రీవెంకాస్వామిరావుగారికికూడా

ఎనిమిదవఏటనే గర్భాష్టమం దాటకుండా ఉపనయన సంస్కారమూ, గాయత్రీమంత్రోపదేశమూ జరిగింది.

సామాన్య మధ్యతరగతికి చెందినవారవటంచేత తమ మేనత్తగారైన కంచుపాటి సుబ్బమ్మ గారికి మాస్టర్‌గారిని దత్తతగా యివ్వటం జరిగింది.

దానితో వారి మేనత్తగారిది సుక్షేత్రమైన వందెకరాల మాగాణిపొలం శ్రీవారికి సంక్రమించింది. అది వారికి యావజ్జీవితమూ లోటుతెలియకుండా గడిచి పోయేలా జీవితాన్ని సుగమం చేసింది.

శ్రీవెంకాస్వామిరావుగారు తెలుగులోనూ తమిళంలోనూ తమ విద్యా భ్యాసాన్ని కుంభకోణంలో సాగించి హైస్కూలు చదువునిమిత్తం శ్రీరంగానికి మకాం మార్చారు.

మాస్టారికి తమ పన్నెండోఏటనే రుక్మిణమ్మగారితో వివాహం జరిగింది. తెలుగు, సంస్కృతం, ఆంగ్లభాషలలో మంచి పాండిత్యాన్నీ అభినివేశాన్నీ సమకూర్చుకుని ఉత్తమగృహస్థుగా గృహస్థజీవితాన్ని కొనసాగించారు. శ్రీవారికి 35 ఏళ్ళు వచ్చేసరికల్లా ముగ్గురు కుమారులూ, ముగ్గురు కుమార్తెలూ కలిగారు.

## భార్యావియోగం :

ఇంతలో మాస్టర్‌గారి జీవితం అనుకోనిరీతిలో మలుపుతిరిగింది. వారి సతీమణి శ్రీమతి రుక్మిణమ్మగారు, శ్రీవారి 36వ ఏట అడుగుపెట్టగానే అకస్మాత్తుగా మరణించారు. దాంతో మాస్టర్‌గారి ఆలోచనా విధానం జీవన సరళి ఒక అఘాతానికి లోనైంది. జీవితానికి అర్థంగురించీ, 'మరణానికి ఆవల ఏం జరుగుతుంది?' వంటి మౌలిక సందేహాలు సిదార్థ గౌతమ బుద్ధునికి కలిగినట్లుగా వారిని ఆధ్యాత్మిక జీవనంపట్ల మొగ్గచూపేలా

చేశాయి.

ఈరోజులలోనే పుదుక్కోటకు ప్రభువులైన శ్రీవిజయరాఘవ తొండమాన్ గారితో మాస్టర్‌గారికి స్నేహం కలిసింది. ఈ తొండమాన్ వంశస్థులకు కొన్నివేల సంవత్సరాల చరిత్ర, సుదీర్ఘ వంశవృక్షమూ వున్నాయి.

ఈ తొండమాన్ వంశపురాజులు శ్రీవేంకటేశ్వరప్రభువు శ్రీనివాసుడై మానవరూపంలో భూమిపై ఉన్నరోజులలో దక్షిణాపథాన్ని పరిపాలించేవారు. ప్రపంచఖ్యాతిగాంచిన దివ్యక్షేత్రమైన తిరుమలపైన శ్రీవారికి ఆనందనిలయం నిర్మించినదీ తొండమానుడన్న పేరుగల మహాభక్తుడే! (వివరాలకు నా గ్రంథం "**శ్రీవేంకటేశ్వర వైభవం**" [II భాగం అధ్యా. 39 చూడవచ్చు] అటువంటి తొండమాన్ రాజుల వంశస్థుడైన విజయరాఘవ తొండమానుని స్నేహంలో మాస్టర్‌గారికి స్వాంతన కలిగేది!

ఇలావుండగా ఒకసారి మాస్టర్ C.V.V. గారు మద్రాసులోని అడయార్ లో దివ్యజ్ఞానసమాజంలో మేడమ్ బ్లావెట్స్కీగారి ఉపన్యాసాలు వినడం తటస్థించింది. ఆతరువాత చాలాకాలానికి శ్రీవారి మొదటిభార్య రుక్మిణమ్మ గారు కాలంచేయడంతో మదర్ వెంకమ్మగారిని తమ 38వ ఏట వివాహ మాడారు. అప్పటినుంచే వారి ఆధ్యాత్మిక జీవనం మరింతగా రాణించ సాగింది.

## ట్రాన్స్‌మీడియంగా వెంకమ్మగారు :

మదర్ వెంకమ్మగారు అత్యున్నత ఆధ్యాత్మిక పరిణితి చెందిన ఒక మీడియం. ఆమెకు మాస్టర్‌గారి స్పర్శ తగలటంతోటే ఒకగాఢ సమాధిలోకి వెళ్ళి ఉన్నతమైన ప్రజ్ఞతో ఊర్ధ్వలోకాలైన సూక్ష్మ, కారణ, నిర్వాణ మండలా లలో ఆమె విహరించటం వాటికి చెందిన మహాత్ములలో ఎంతో పరిణితి

చెందిన జీవులతో ఆమె సంభాషించటం అనేక విశేషాలను మాస్టర్‌గారికి తిరిగి నివేదించటం జరిగేది. ఈ విశేషాలు పునర్జన్మకి కారణాలు, అనేక జన్మలలో కర్మ ఎలాపనిచేస్తుంది, మరణానికి తర్వాత జననానికి ముందు మానవుడి ఆత్మ ఏ లోకాలలో ఉంటుంది, అలాగే మరణించినవాని జీవుడు తిరిగి పుట్టేలోపల ఎక్కడవుంటాడు, మాతృగర్భంలో ఎలాప్రవేశిస్తాడు, ఒక నూతన శిశు జననానికి మామూలుగా స్త్రీపురుషులమధ్య జరిగే సృష్టిక్రియ అవసరమా? సూక్ష్మ శరీరంలో చక్రాలు, నాడులు ఎలా తయారౌతాయి? స్త్రీపురుష సంయోగం లేకుండా శిశుజననాన్ని సాధించవచ్చా? ఇలాంటి ప్రశ్నలన్నింటికీ మదర్ వెంకమ్మగారిద్వారా శ్రీవారికి సమాధానాలు లభించాయి.

ఈరీతిలో శ్రీ మాస్టర్ C.V.V. గారి అన్వేషణ మదర్ వెంకమ్మగారి సహకారంతో శ్రీవారి జీవితం నూతనదిశలో ప్రవేశించింది.

తమ 42వఏట మే 29 1910 సంవత్సరంలో మాస్టర్‌గారిలోకి ఒక అలౌకిక దివ్యప్రజ్ఞ హేలీ తోకచుక్కద్వారా ఆవిష్కరించబడిందని గమనించాము. సరిగ్గా ఈ సమయంలోనే శ్రీ అరవిందయోగికూడా అతిమానసిక దివ్యశక్తి అవతరణ (Descent of Supramental) ద్వారా మానవపరిణామం యొక్క గతిని (Speedingup of Human Evolution) పెంచడానికి ఒకక్రొత్త పంథానుతొక్కి పాండిచ్చేరిలోని — 'ఆరోవిల్లి' (Auroville) కి తమ యోగ-ప్రయోగశాలను మార్చడం జరిగింది.

భూమ్యాకర్షణ పరిధిలోకి సుదూర సౌర కక్ష్యలోంచి దూసుకువచ్చిన హేలీ తోకచుక్క మళ్ళీ 72 సవత్సరాలకుగాని తిరిగిరానట్టి విశేషంగలది. తనతోపాటు పైఅధ్యాయంలో గమనించిన విధంగా ఒక నూతనప్రజ్ఞనూ దివ్యశక్తినీ కొనివచ్చి మాస్టర్‌గారిలో లీనమైంది.

ఈ అనుకోని హఠాత్సంఘటన మాస్టర్‌గారిని పూర్తిగా మార్చివేసింది. తాను వెనుకటి వెంకాస్వామిరావును కానని, తాను పూర్తి యోగశక్తితో ప్రజ్ఞతో పరిఢవిల్లుతూ మాస్టర్ C.V.V. నని ప్రకటించారాయన! మానవ పరిణామం వెనుకబడివుండటానికి గల కారణాలను, అవరోధాలను అధిగమించటానికై కృషిచేయ కంకణం ధరించారాయన!

సమాధిస్థితిలో మదర్ వెంకమ్మగారి ప్రజ్ఞను ఊర్ధ్వప్రజ్ఞామయ లోకాల లోనికి పంపి ఈ సౌరకుటుంబంలోని సప్తగ్రహాలనూ దాటించి అవి నియ మిస్తున్న సప్తలోకాలలోకి పైకిపంపే అన్వేషణ కొనసాగించారు.

## గ్రహాల – 'రెక్టిఫికేషన్' :

చిరకాలంగా సరైన పర్యవేక్షణ లోపించిన కారణంగా ఈ బైటివిశ్వం లోని గ్రహాలు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూ తమకులేని అధికారాన్ని ఆపాదించుకుని మానవాళిపైన అనవసర ఆధిక్యతను, పెత్తనాన్ని చెలాయిస్తూ **తమ హద్దులనే మరిచాయి!**

అందుకని సాధకులైన యోగమిత్రుల సూక్ష్మశరీరాలలోని యోగచక్రా లలో గ్రహాలతాలూకు దోషాలను నివృత్తి (Rectify) చేయడంద్వారా **గ్రహాల యొక్క పట్టును సడలింపచేయాలన్న** బృహత్తర సంకల్పం పూనారు మాస్టర్ C.V.V.

ఇట్టి బృహత్తర ప్రణాళికలో భాగంగా తమ అనుయాయులైన 'మీడియమ్స్' పై గ్రహాలపట్టును నియంత్రించి, వాటి ప్రభావాలనుంచి విమోచన కల్పించాలన్న పట్టుదలతో తమ యోగాకోర్సులలో

1) లగ్నా రెక్టిఫికేషన్ కోర్స్
2) చంద్రా రెక్టిఫికేషన్ కోర్స్

3) శాటర్న్ రెక్టిఫికేషన్ కోర్స్

4) మెర్క్యురీ రెక్టిఫికేషన్ కోర్స్

5) మార్స్ రెక్టిఫికేషన్ కోర్స్

6) ఎక్లిప్స్ (గ్రహణాల) కోర్స్

7) కామెట్‌కోర్స్

పై కోర్సులు తమ లక్ష్యాల సాధనకు దోహదకారులుగా కన్పించటంతో తమ వినూత్న యోగసిద్ధీ — లక్ష్యసాధనాయైన "అమృతత్త్వసిద్ధి"ని అనతి కాలంలోనే సాధించగలమన్న నమ్మకం కలిగింది మాస్టర్‌గారికి. మనిషి క్రమం తప్పకుండా ఈ యోగాన్ని పదేళ్ళకాలం శ్రద్ధగా అనుష్టిస్తే మోక్షాన్ని నిస్సందేహంగా పొందగలడని — అంతేగాకుండా మానవాళి యావత్తూ తన తదుపరి పరిణామదశకి అలవోకగా చేరుకోగలదనీ ప్రకటించారాయన!

# II

మాస్టరుగారి ఆకారం గంభీరం సుందరమైన సాముద్రికం! చూడగానే శివలింగాకారంలో నున్నగా ఎత్తుగాఉన్న తల, రాజసం ఉట్టిపడేలా పొడవైన మెలికతిప్పిన మీసాలూ ఆంతర్యాన్ని ప్రశ్నిస్తున్నట్లుగా పలకరింపుతో చిరునవ్వు నవ్వుతూన్నట్లుండే మెరిసే కన్నులతో మాస్టర్ C.V.V. గారిది గంభీరమైన హుందా కలిగిన విగ్రహం!

పట్టులా మృదువుగా బంగారువన్నెలో కాంతివంతంగా ప్రకాశించే శరీరఛాయతో ఎప్పుడూ తంజావూరు సిల్కుపంచె ధోవతి ధరించి, అప్పు డప్పుడు ఉత్తేజంకోసం నశ్యం పట్టుపట్టేవారు మాస్టర్‌గారు.

వారి సునిశిత హాస్యం, మనస్సులను స్పృశించేలా వుండి శిష్యులకు వారినెంతో ఆత్మీయుల్ని చేసేది! అందరితోనూ అరమరికలు లేకుండా కలిసి

పోయి వారిపట్ల అమితమైన ప్రేమానురాగాలనూ, శ్రద్ధ తీసుకునే విషయంలో మాస్టారికెవరూ సాటిరారనిపించేలా ఉండేవారు.

వారి ఆపేక్షను ఒకసారి రుచిచూసిన వారెవరైనా జీవితాంతం మర్చిపోలేనంతగా హృదయాలలో ముద్ర వేసేది.

శిష్యుల వ్యక్తిగతసాధన విషయంలో ఎంతశ్రద్ధ వహించేవారో అలాంటి శ్రద్ధే వారి కుటుంబవిషయంలో, భార్యాపిల్లల యోగక్షేమాల విషయంలోనూ ఉండేది. వాళ్ళకి కలిగే అస్వస్థలను నయంచేయడమేగాక నిరుద్యోగంతో వ్యధచెందేవారికి ఉపాధిచూపటం చాలా సందర్భాలలో యితరుల శారీరక అస్వస్థలను తమమీదికి తీసుకొని వాటిని తాను ఆనందంగా అనుభవిస్తూ వారికి బాధానివారణను ప్రసాదించేవారు. అలానే శిష్యుల ఉద్యోగసమస్య లనూ అత్యవసర పరిస్థితులేర్పడినప్పుడు అభయదాతయై శ్రీవారు తక్షణ సహాయాన్ని అందించిన సంఘటనలు అనేకం!

## అమృతమయ-ఆతిధ్యం :

ఇవన్నీ ఒకఎత్తు! ఎంతో ప్రేమతో శిష్యులను ఆదరించి, ఆతిధ్యాన్నిస్తూ వారికి అతిరుచికరంగా ప్రసాదాన్ని స్వయంగా వడ్డించటంలోనూ కడుపునిండా తినిపించి కడుపుచెక్కలయ్యేలా నవ్వించటంలోనూ ఎంతో ఆనందాన్ని పొందే వారు. తమ యోగాన్ని ఉత్తికడుపుతో చేయరాదని నిర్దేశించి, మాస్టారు యోగామీడియమ్‌కు బలవర్ధకమైన త్రాణను కలిగించే అల్పాహారాన్ని తామే స్వయంగా యోగసాధనకు ముందుగా ఏర్పాటుచేసేవారు. వేడి ఇడ్లీలపై కమ్మటి నేయినివేసి, వాటితోపాటూ ఘుమఘుమలాడే స్వచ్ఛమైన కాఫీగింజ లను ఆడించి తయారుచేసిన పొడితో కాఫీని తమదైన బాణీలో తయారు చేసి ఇచ్చేవారు! ఎడతెరిపిలేని నీళ్ళవిరేచనాలతోనూ, జిగటవిరోచనాలతో

బలహీనపడి లేవలేనంతగా నీరసపడి ఉన్నవారికి డయేరియా, డిసెంట్రీలతో లేవలేని పరిస్థితితో బాధపడుతున్నవారికికూడా శ్రీవారు **విగర్ ట్రీట్‌మెంటు** నివ్వగానే — క్షణాలలో వారికి ప్రాణశక్తి ఉద్దీపనకలిగి, నూతన జవసత్వాలతో ఉల్లాసవంతులయ్యేవారు.

దైవాన్ని ప్రార్థించినా ఒక్కోసారి నివారణ ఆలస్యమౌతుందేమోకానీ మాస్టారు కోర్సులు స్మరించినవెంటనే పనిచేసి ఎలక్ట్రానిక్ వేగంతో రోగ నివారణ సమకూరేది. ఈ కోవలోకి చెందిన మరిన్ని అనుభవాలను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి డైరీలలో ఈనాటికీ మనం చూడవచ్చు!



12

# మాస్టర్‌గారి జాతకం

ఈ అద్భుతయోగం భూమిపై వెలువరింపబడ్డ శుభతరుణం 29-మే-1910న **కుంభకోణంలో!** దీని సాంప్రదాయం మనకు అందించిన మాస్టరు శ్రీమాన్ **కంచుపాటి** వెంకాస్వామిరావుగారు. వీరు జన్మించిన పవిత్ర పుణ్యదినం ఆగష్టునెలలోనే వస్తుంది. ఆయన **4-ఆగష్టు 1868** న సద్బ్రాహ్మణ కుటుంబంలో శుద్ధ తెలుగువారైన కంచుపాటివారి వంశంలో జన్మించారు.

## నాడీగ్రంధాలలో – మాస్టరుగారు!

నాడీగ్రంధాలలో ఆయన జాతకం చూసి పరిశీలనచేస్తే పరబ్రహ్మానుభూతికి సంబంధించిన ఒక అత్యద్భుతమైన **'ఆధ్యాత్మిక తరంగం'** (Spiritual Wave) ప్రపంచంలో బయలుదేరిందనీ, ఆ తరంగంయొక్క భౌతిక ఆవిష్కారం భారతదేశంలో కుంభకోణంలో జరిగిందనీ తెలిపే ప్రమాణ శ్లోకాలన్నీకూడా దొరికినవి.

"బ్రహ్మాంశో అయం మహాత్మా
మునిజన సహితో బ్రహ్మతుల్యావతారః"

అని మొదలుపెట్టి 21-శ్లోకాలతో ఈ **నూతన యోగంయొక్క** ముఖ్య స్వరూపం ఆవిష్కారంగురించిన వివరమంతా ఎప్పుడో వేలసంవత్సరాలనాడే, ఋషులు తాటాకులమీద వ్రాసిన **నాడీగ్రంథంలో** వర్ణన చేయబడింది.

ఈ **నాడీగ్రంథాల్లో** ఉన్న అంశాలన్నీ మద్రాసులో డా॥ గాలి బాల సుందరరావు గారివద్ద ఉన్నవి. ఈయన ఒక డాక్టరు. తన ఆస్థిఅంతా ధారపోసి మొత్తం దీనికి సంబంధించిన **నాడీగ్రంథాలు** ఉన్నవన్నీ తెప్పించి ఆ **నాడీ**గ్రంథాలన్నిట్లోని ఋషులవాక్యాలు స్వీకరించి దీనియొక్క రూపాంత రంగా ఒక సైన్సులా గ్రంథరూపంగా ఆవిష్కారం చేయాలని అప్పటికి చాలా సంవత్సరాలనుంచీ తాపత్రయపడుతున్నాడు.

దైవవశాత్తూ నేను ఆయన్ని కలవడం తటస్థించినప్పుడే, ఈ నాడీ గ్రంథాల్లోవున్న శ్లోకాలూ, తద్వారా ఈ మాష్టరుగారి జీవితవిశేషాలు, మాష్టరు గారి 'అవతరణ' వెనుకవున్న **ఆధ్యాత్మిక కారణాలు,** తద్వారా ప్రపంచంలో ఇప్పుడు **నూతనయోగం** వెనుకనున్న జరిగే మూలసూత్రాలు, అన్నీకూడా కనిపించినవి.

ఈ నాడీగ్రంథాల్లో **'మాష్టరు-యోగం'** గూర్చి వున్న శ్లోకాలు చదవక ముందు ఇదేదో క్రొత్తరకం యోగంలే? ఇటువంటి యోగాలు ప్రపంచంలో చాలావచ్చాయి, అని అనుకొనేవాడిని. తర్వాత వేదాల్లోవున్న ఉపదేశాలు మనకి సరిపోవా మళ్ళీ ఈ క్రొత్తయోగం కావాలా? అనుకొనేవాడిని.

మొట్టమొదట ఆంధ్రదేశంలో 'దివ్యజ్ఞానం' (Theosophy) ప్రచారానికి వచ్చినప్పుడుకూడా చాలామంది సనాతన ధర్మాన్ని అనుష్టించేవాళ్ళు ఇలానే అనుకొన్నారట : "ఈ దివ్యజ్ఞాన సమాజం ఏమిటి? ఇంతవరకూ మనకి ఉన్నది చాలదా?" అని, ఇంకా వేరే క్రొత్తది ఏమిటని! అలాగే, ఎప్పుడూ కలియుగంలో నూతనంగా ఆధ్యాత్మికరంగం వచ్చినప్పుడు, తప్పకుండా

మానవజాతి ఇలానే అనుకోలేదా! శ్రీకృష్ణుడు వచ్చినప్పుడూ — **రాము డున్నాడుగా** మళ్ళీ కృష్ణుడేమిటని జాంబవంతుడికే అనుమానం కలిగింది! అలాగ ప్రతి అవతారం వచ్చినప్పుడు, పూర్వం ఉన్నది సరిపోతుందను కుంటాడు.

గతాన్ని పట్టుకొని ప్రేలాడే స్వభావం మానవునిలో ఉంది. అలాగే వారుకూడా **క్రొత్తయోగం** ఏమిటి? ఇదివరకు ఉన్నటువంటివి చాలవా? అనిపించినది. ఈనాడీ గ్రంథాలలోను శ్లోకాలను ప్రమాణంగా చూడటం తటస్థించినప్పుడు, ఈ యోగంయొక్క స్వరూపం ఏమిటి? ఇది పూర్వం వేదంలో వున్నదాన్ని అనుసరించి ఉన్నదా లేక దానికి విరుద్ధమైనదా? అన్న అనుమానంకూడా కలిగింది.

అప్పుడు 'హోర' (Hora) అనే గ్రంథాన్ని ప్రశ్నగా అడిగాను. మన మనస్సులో ప్రశ్న సంశయంగా పెట్టుకొని వెడితే, ఆ వెళ్ళిన టైమునిబట్టి ఈ తాళపత్రగ్రంథం తీస్తే, దానిలో కొన్ని సంశయాలు, ఈ వచ్చినవారియొక్క వర్ణన, వాడి పేరు, నక్షత్రం అన్నీఇస్తారు! తద్వారా వచ్చినవాని మనస్సులో సంశయంకూడా చెప్తారు. ఈ హోరా (Hora) అనేదాంట్లో ఈ మాస్టరు యోగం గురించి పాతికశ్లోకాలు నాకు దొరికినవి. దాన్లో నా నక్షత్రం, నా జాతక వివరాలూ అన్నీ ఇచ్చిన తరువాత మనసులోని సంశయంతీరడం వర్ణించారు. దాంట్లో సాంఖ్యం, వైశేషికంలో 36-వ సూత్రం ఋగ్వేదంలో ఫలానా, ఫలానా ఋక్కుల్లో అని వివరాలుచెప్పి, ఈ సూత్రాలన్నింటిలోనూ, ఇవ్వ బడిన **మూలసత్యాలే** ఈ C.V.V. **నూతన యోగానికి** ఆధారాలై వున్నాయి" అనిచెప్పారు. అంటే వేదాల్లోని ఋక్కులు, ఈనాడు కేవలం భాషా - సాహిత్యం క్రిందనే ఉన్నాయి. వాటిని **అనుభవంలోనికి** తీసుకు రావడానికి కావలసిన తాళంచేతులు ఇక్కడ "నాడీ" (హోరా) గ్రంథంలో ఉన్నాయి.

మాస్టర్‌గారి జీవితకాలంలో నాడీగ్రంథాలు కొన్ని పూర్వకాలపు ఋషులు వ్రాసిన తాటియాకు (తాళపత్ర) గ్రంథాలు తెచ్చి చదవడం జరిగింది. అందులో శ్రీవారి జననం బ్రహ్మదేవునియొక్క అంశతో కలియుగంలో మానవజాతి వెనుకబడివున్న కారణంగా ఒక నూతనయోగాన్ని ఆత్మసాక్షాత్కారమార్గాన్ని భూమిమీద ప్రవేశపెట్టడానికి అవతరించటం జరిగిందని వివరించబడింది.

**"బ్రహ్మాంశో అయం మహాత్మా**
**మునిజనసహితో బ్రహ్మతుల్యావతార"**

అని ప్రారంభించి వరుసగా మాస్టర్‌గారి జననకాలానికి వున్న గ్రహస్థితీ, శ్రీవారి జాతకమూ వివరాలతో వర్ణించబడివున్నాయి. అందులో యింకా — మాస్టర్‌గారు జన్మించిన 4-8-1868 తేదీకి సరియైన జాతకకుండలి ఈక్రింద చూపబడింది.

<table>
<tr><td>గురు 22°-13'</td><td></td><td></td><td>కుజ 1°-13'<br>శుక్ర 24°-15'</td></tr>
<tr><td>కేతు 4°-36'</td><td colspan="2" rowspan="2">మాస్టర్ C.V.V. గారి<br>జాతకకుండలి<br>తేది 4-8-1868<br>ఉ. 10-20 గం॥లకు<br>కుంభకోణం<br>ధనిష్టానక్షత్రం 2వ పాదం</td><td>బుధ 0°-50'<br>రవి 20°-0'</td></tr>
<tr><td>చంద్ర 27°-40'</td><td>రాహు 4°-36'</td></tr>
<tr><td></td><td>శని 7°-2'</td><td></td><td>లగ్నం 22°-54'</td></tr>
</table>

జననకాల కుజదశాశేషం 4 సంవత్సరాల 8 నెలల 19 రోజులు

| | | |
|---|---|---|
| జన్మతేదీ | 4-8-1868 | |
| జననకాల కుజదశాశేషం | 19-8- 4 | |
| | 23-4-1873 | |
| రాహుమహాదశ | 18 | సంవత్సరాలు |
| | 23-4-1891 | |
| గురుదశ | 16 | సంవత్సరాలు |
| శనిమహాదశ ప్రారంభం | 23-4-1907 | |
| శని × శని | 3-0- 03 | |
| శనిభుక్తి పూర్తి | 26-4-1910 | |

జాతకకుండలిలోని కొన్ని ముఖ్యాంశాలు ఈక్రిందివిధంగా ఏర్పడి వున్నాయి.

1) జననం స్థిరలగ్నమైన 'కన్యాలగ్నం'లో జరిగింది. లగ్నానికి నాల్గు కేంద్రాలలోనూ మూడింట శుభగ్రహాలైన గురువు సప్తమంలోనూ (స్వక్షేత్రవర్తియై), మోక్షకారకమైన మీనరాశిలోనూ, శుక్రుడు తపఃస్థానాధిపతి, ధర్మస్థానాధిపతి (2, 9 స్థానాలకు) గా రాజ్యస్థానమైన దశమంలో నడిమింట మిధునరాశిలో పునర్వసు నక్షత్రంలో వున్నాడు. దీనివలన జ్ఞానకారకుడైన శుక్రుడు, మోక్షకారకుడైన బృహస్పతీకేంద్ర కోణాలను ఆక్రమించివున్నారు.

2) తపఃస్థానాధిపతియైన శుక్రుడు దశమకేంద్రమున సహస్రారచక్రము సూచించే స్థానంలో మధ్యాహ్నసూర్యుడుండే స్థితిలో వున్నాడు. దీనివల్ల తపస్సిద్ధి సూచితమౌతున్నది. అలాగే మోక్షస్థితియైన జన్మరాహిత్యమూ సూచితమైనాయి.

3) విక్రమస్థానంలో పాపగ్రహమైన శనీ, శత్రుస్థానమైన ఆరింట కుంభ రాశిలో కేతువూ వుండటంవల్ల మాస్టర్‌గారు ఒక రాజసమానమైన హుందా అధికారదర్పమూ కలిగిన వ్యక్తియనీ, 'శత్రువు'లను నిర్జించగల 'పరాక్రమ' స్వభావాన్ని కలిగివుండటాన్నీ ఈరెండు గ్రహాలూ సూచిస్తాయి.

4) సోదరస్థానంలో శని వుండటంచేత మాస్టరుగారు యితర సోదరులులేని కుటుంబానికి దత్తత తీసుకోబడ్డారు — 'కంచుపాటి' వారి వంశంలోకి!

5) లగ్నాధిపతియైన బుధుడు లాభస్థానంలో వుండటంచేత ఈ దత్తతవల్ల మాస్టర్‌గారికి అధికమైన లాభమూ, భూవసతీ, గృహవసతీ కల్గిందని ఈ గ్రహస్థితి సూచిస్తున్నది.

6) వ్యయస్థానాధిపతియైన సూర్యుడు లాభస్థానమైన కర్కాటకంలో ఉండటంవల్ల తనకు లభించిన యావదాస్తీ మాస్టర్‌గారి జీవితకాలం లోనే పూర్తిగా ఖర్చుచేయబడటాన్ని సూచిస్తున్నది.

7) దీనికితోడు జ్ఞానస్థానమూ బ్రహ్మవిద్యాస్థానమైన ఐదవభావంలో కన్యా లగ్నానికి పంచమమైన మకరంలో చంద్రుడుండటంవల్ల గొప్ప జ్ఞాన లాభమూ చంద్రునివలన కలిగినా, చంద్రుడు మృత్యుస్థానాధిపతియైన కుజుని ఆధిపత్యంగల ధనిష్టానక్షత్రంలో వుండటంవల్ల — బ్రహ్మజ్ఞాన సముపార్జించే ప్రయత్నంలోనే మాస్టర్‌గారికి మృత్యువు సూచించబడింది.

మాస్టర్‌గారి జాతకంలో యింకా ఎన్నో విశేషాలు, జ్యోతిషవిద్యాపారం గతులకు పరిశోధనాంశాలు. ఇక్కడ మనకు ప్రస్తుతం అవసరమైనంతవరకూ మాస్టర్‌గారి జన్మకుండలిలోని విశేషాలుమాత్రం పాఠకులముందు ఉంచటం జరిగింది. కాకభుజందర్‌నాడి, ధృవనాడి వంటి యితర నాడీగ్రంధాలలోకూడా మాస్టర్‌గారి జాతకవిశేషాలు కొన్ని వారి శిష్యులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర

శాస్త్రిగారి జాతకంలోనూ శ్రీనారాయణ అయ్యర్, యింకా తదితరుల జాతకాలలోకూడా యివ్వబడివున్నాయి.

అందులోని కొన్ని విశేషాలు, నాడీగ్రంథ రహస్యాలు కీర్తిశేషులైన గాలి బాలసుందరరావుగారు షుమారు ఇరవైఏళ్ళపాటు సేకరించిన నాడీ విశేషాలు 25 బైండు బుక్కులను మించినవి వారి ఇంటిలో నేను చూశాను. అవి ఎప్పటికైనా లభిస్తే అందులోని విశేషాలు కొన్ని మనకు బైటకురావచ్చు.

ఇందులో ముఖ్యంగా మాస్టరుగారి పునరవతరణ, శుక్రగ్రహాన్ని మాస్టర్ యోగాకోర్సులతో కంట్రోలు చేసుకునే యోగరహస్యాలు ఈ నాడీశ్లోకాల్లో మనకి లభించవచ్చు! అంతవరకూ వేచిచూద్దాం!



# 13

# సంసారం లేకుండా సృష్టించబడిన కారణజన్ముడు - "చందు"

ఈ భూమిమీద మానవజాతియొక్క ఆధ్యాత్మిక పరిణామం దాదాపు నిలిచి పోయి — 'ఎక్కడవేసిన గొంగళి అక్కడే' అన్నట్టుగా ఆగిపోయిందనీ, దాన్ని మాస్టర్ CVV యోగంద్వారా తిరిగి పునరుజ్జీవింపచేయాలన్న సంకల్పంతో మాస్టరుగారు తీవ్రసాధన చెయ్యటం జరిగింది!

ఇంతటి మహత్తర లక్ష్యాన్ని సాధించాలంటే అది, సామాన్యమైన పనేమీకాదు! **"ఆధ్యాత్మిక పరిణామం"** — అంటే యేమిటో స్పష్టంగా తెలియాలి! ఇది ఒక దేశాన్నో లేక ఒక రాష్ట్రాన్నో ఆర్థికంగానో, రాజకీయంగానో, ముందుకు తీసుకుపోవడంవంటి పనికాదు! అసలు **'ఆధ్యాత్మిక పురోగతి' అంటే ఏమిటో** స్పష్టమైన అవగాహన వుండాలి! దానికి 'సృష్టికర్త' అయిన "పరబ్రహ్మ" మనిషిని ఏ సంకల్పంతో సృష్టించాడో తెలిసుండాలి!

## మానవుడి–సృష్టి :–

అసలు మనిషిని సృష్టించడమంటే ఏమిటి? కేవలం ఒక మట్టి బొమ్మనో లేక చెక్కబొమ్మనో తయారుచెయ్యటంవంటిదా? కాదు! మనిషిని సృష్టించాలంటే అతడికొక శరీరం వుండాలి! దానికి అవయవాలన్నీ ఏర్పాటు చెయ్యాలి! అంటే కన్నూ ముక్కు, చెవి, నోరూ, జీర్ణాశయము, హృదయము, మెదడు, ఊపిరితిత్తులవంటి ప్రధాన అవయవాలన్నిటితోనూ తయారుచేసి నప్పటికీ — అది కేవలం మనిషి **"బాహ్యశరీరం" మాత్రమే** అవుతుంది! అంటే ఇవన్నీ అప్పుడే మరణించిన శవానికికూడా బాహ్యంగా ఏర్పడి వుంటాయి! కాబట్టి మనిషికి ఈ శరీరం లోపల వుండే **'ఆత్మ'–ఎలావుంటుందో** తెలియాలి! ఈ 'బయటసృష్టి' — స్త్రీ గర్భంలోపల ఎలా ఏర్పడుతుందో తెలియాలి? తెలిసినా — ఇదంతా బైటిసృష్టే! దానిని తీవ్రంగా పరిశోధించ డానికే మాస్టర్‌గారు తమ యోగసాధనలో సూర్యాది గ్రహగోళాలపై తమ ధ్యానాన్ని ప్రసరించారు.

ఈ స్థూలప్రపంచం దానిపైన వుండే కాలము, ఆకాశమూ, ఇంకా ఆపైనవుండే "మానసిక-ప్రపంచము" (Univeral Mind), ఇవన్నీదాటి మనిషికి ఒక 'అంతరాత్మ' దేనితో సృష్టించివుందే ఈ **'ఆత్మ-పదార్థమంతా' దేనితో తయారైవుంటుందో** — అది, అగ్నిలా మండుతున్న సూర్యగోళంలోపల వుండే **'తేజస్సు'** వంటి **'ఆత్మజ్యోతి'! దాన్ని** గురించి — పూర్తిగా తెలియాలి!

అంతేకాదు ఈ మనిషికి ఈ పైకి కనిపించే స్థూలశరీరం అంతా ఒక్కుమ్మడిగా ఏర్పడదు! దీనిలోపల **"సూక్ష్మశరీరం"** ఇంకా లోపల ఓ **'ప్రాణమయ-శరీరము'**ఇంకా **మనోమయ** శరీరము, **'బుద్ధి-కోశములూ'**, వుంటాయి! వీటన్నిటినీ కదిలించడానికి అవసరమైనది **'ప్రాణశక్తి'**. విద్యుత్తు, లేక కరెంటును నిత్యమూ సృష్టించే **మూల-'శక్తి'** సరఫరా కావాలి!

## తండ్రిలో – పుట్టబోయే "జీవుడు" :-

మామూలుగా 'జీవుడు' తల్లిగర్భంలో నవమాసాలు పెరిగి జన్మిస్తాడు! కాని, గర్భం ఏర్పడేముందు ఈజీవుని అతి సూక్ష్మమైన నిప్పురవ్వ వంటి 'జీవాత్మ' తండ్రి శరీరంలోకి వీర్యం రూపంలో ప్రవేశిస్తుంది!

అంతేకాదు, తల్లి శరీరంలోకి గర్భాదానం సమయంలో **ప్రవేశించే ముందే** అంతకు **మూడుమాసాలు ముందుగానే** — ఆ పుట్టబోయే 'జీవుడు' **తండ్రియొక్క** సహస్రార **చక్రంలోకి** ప్రవేశించి అతడి రెండు కనుబొమ్మల మధ్యనున్న 'ఆజ్ఞా-చక్రం'లోకి దిగి — **మూడుమాసాలుంటాడు!** ఇది చాలామందికి తెలియని యోగ రహస్యం!

ఈ మూడు మాసాలలోనూ తండ్రియొక్క సంస్కారములు, పాప పుణ్యములు, గత కర్మబంధాలు తన గతజన్మయొక్క అనుభవాలూ భావన చేసుకొని, తండ్రి జన్మ నక్షత్రంతో జాతకంలోని గ్రహాల గ్రహస్థితికి సరిపడే 'సమయానికి' జీవుడు తండ్రి హృదయంలోకి ప్రవేశించి ప్రేమవంటి ఉద్రే కాన్ని కలిగించితే, దీనివల్ల స్త్రీపురుషులకు సంసారం చెయ్యాలనే 'కోరిక' జనిస్తుంది!

## గర్భప్రవేశం :-

అంతేకాదు! తల్లియొక్క జాతకంలో ఆమె నక్షత్రానికి సరిపడే అనుకూల సమయంలో, జీవుడు తండ్రియొక్క శ్వాసలోకి — ఒక విద్యుత్తు వంటి కరెంటురూపంలో దిగి, ఉద్రేకాన్ని కలిగించి స్త్రీపురుషుల శ్వాసలు రెండూ లయబద్ధమైన **దాంపత్యసంయోగ** కాలంలో తల్లి శ్వాసద్వారా ఆమె హృదయంలోకి ప్రవేశిస్తాడు! అక్కడినుంచి ఆమె ఋతుచక్రాన్ని బట్టి అనుకూ లించే కాలంలో తండ్రి వీర్యంతోపాటు కలిసి గర్భాశయంలో ఒక పిండంగా

ఏర్పడతాడు! ఇలాగ తండ్రి శరీరంలో మూడు (3) నెలలూ, తల్లి గర్భంలో తొమ్మిది (9) మాసాలూ, కలిసి మొత్తం పన్నెండు (12) నెలలు జీవునియొక్క గర్భస్థ పరిణామంలో జరిగి జన్మిస్తాడు!

అలా "జన్మించే" **సమయం** దాకా తాను జన్మించబోయే శరీరానికీ, దాని కర్మకీ, తన పూర్వకర్మకూ అనుకూలపడే ముహూర్త సమయంలో గ్రహాలన్నీ నిలిచివున్న లగ్నం వున్నటైములో అతను తల్లిగర్భం విడిచి అదే గ్రహస్థితిలో అదే జాతకంగా జన్మిస్తాడు.

## జన్మించే 'జాతకం' :-

ఇలా జన్మించే మామూలు శిశువులకు — 'శరీరం' తల్లినుండీ, "ప్రాణశక్తి" తల్లిదండ్రుల శ్వాసనుండీ — 'మనస్సు' తండ్రియొక్క ఆత్మ ద్వారానూ కిందికి దిగివచ్చి **'మనిషి-రూపం'** (Man-Form) లోనూ ఒక గర్భస్థ పిండంగా **ఆకారం** ధరించడం జరుగుతుంది!

ఈ పిండోత్పత్తి క్రమాన్ని ఇలా సంపూర్ణంగా దర్శించిన మాస్టర్ CVV స్త్రీపురుషుల "సెక్సు" (Sex) లేక కామం అనే దోషం అంటకుండా ఒక కొత్త ప్రయోగంద్వారా తల్లి గర్భంలోకి ఒక జీవాత్మను ప్రవేశపెట్టగలిగారు!

అవి మాస్టర్‌గారు హేలీ తోకచుక్క భూమికి దిగివచ్చిన నూతన భగవత్‌శక్తి తనలో ఆవిష్కారం అయిన రోజులు — 'మానవుడి అంతరాత్మ దేనితో తయారైవుంటుంది? అతడి సూక్ష్మశరీరం, కారణశరీరం, ప్రాణమయ దేహం, ఆత్మ, మనసు, బుద్ధి పొరలుపొరలుగా ఎలాగ ఏర్పడివుంటాయి?' అని ప్రత్యక్షంగా తెలుసుకోవాలని మాస్టర్‌గారు యోగపరిశోధనను తీవ్రంగా జరుపుతున్న రోజులు!

మాతృశ్రీ వెంకమ్మగారిని గాఢమైన ధ్యాన సమాధిలోకి పంపి మాస్టర్

గారు ఆమెద్వారా అనేకమైన **జన్మ-మరణ** రహస్యాలను, ఇంగ్లీషు మంత్రాలనూ, సేకరిస్తూవుండేవారు; నిత్య దినచర్యగా!

ఇలావుండగా మాస్టర్‌గారికి మెరుపులాంటి ఒక సంకల్పం కలిగింది! మనిషి మరణించాక ఏదో చేస్తామని గొప్పలుచెప్పే యోగంవల్ల ప్రయోజనమేమిటి? ప్రత్యక్షంగా ఒక మానవుడి పిండాన్ని తల్లిగర్భంలో స్వయంగా తమ యోగశక్తితో సృష్టించాలని — స్త్రీ పురుషుల **కలయిక అవసరం లేకుండానే** కేవలం యోగప్రక్రియద్వారా ఒక కొత్త మానవజాతి అయోనిజులైన వారిని సృష్టించడంకోసం ప్రయత్నించారు!

ముందుగా వెంకమ్మగారి శరీరంలోని ధాతువులను, నాడులను ప్రాణమయ కోశములను పరిశుద్ధిచేసే ఇంగ్లీషు కోర్సుల (Yoga Purification Rectification Courses) ద్వారా ఆమె శరీరమును జ్ఞానభూమికలను పవిత్రంచేశారు! ఆతర్వాత ఈ భూగోళంపైనుంచి సూర్య, చంద్ర, శని, గురుగ్రహాల పరిధిని పరిశుద్ధిచేయడంద్వారా గ్రహాల్ని దాటి **పరబ్రహ్మలోకం** నుంచి నేరుగా **తేజస్సువలే** పొగలావున్న **ఆత్మపదార్థాన్ని** సేకరించి వెంకమ్మగారి గర్భాశయంలో స్థాపించగలిగారు!

దీనివల్ల **గ్రహాల ప్రభావం** ఏమీ **లేకుండానే** గ్రహాల బానిసత్వంనుంచి పైస్థితికి చెందిన ఒక పిల్లవాడి గర్భస్థపిండాన్ని రూపకల్పన చేయగలిగారు! ఇది యోగచరిత్రలోనే అద్భుతమైన విజయం! ఎందుకంటే మనిషి మృత్యువును జయించాలంటే అసలు మనిషిగా జన్మించడం ఎలా జరుగుతుందో తెలియాలి కదా? ఎందుకంటే ఒకదానిమీద రెండవది ఆధారపడి వుంటుంది! కనుక జననమరణాలు — విడదీయలేని జంట! ఒకటి జయిస్తేనే రెండవది దాటగలరు!

మాతృశ్రీ వెంకమ్మగారి గర్భంలో పెరుగుతున్న పిండాన్ని తమ యోగ

ప్రక్రియతో "ప్లెంటీ-ప్రాణ" (Plenty-Prana) అన్న ప్రాణశక్తితో పోషించడం, ఆహారంలోని ఉప్పు కారాల నిమిత్తం లేకుండానే పెంచి పోషించగలిగారు!

ఫలితం? — ఆశ్చర్యం! ఆ గర్భంలోని పిల్లవానికి, అయిదారు నెలలు నిండకముందే **తానెవరో** ఎందుకు జన్మించబోతున్నాడో **తెలియడమే** కాక, మాస్టరుగారితో నేరుగా మాట్లాడగలిగేవాడు; మనసుతో మనస్సుతో టెలిఫోన్‌ద్వారా!

ఈ పిల్లవాడికి నెలలు గడిచినకొద్దీ వెంకమ్మగారికి ఎవరెవరో మహా ఋషులు, సిద్ధపురుషులు, యోగులు ప్రతినిత్యం ప్రత్యక్షంగా దర్శనమిచ్చి మాయమైపోతుండేవారు! వారినిచూసి ఆశ్చర్యపోవడం వరకే ఆమెవంతు! ఆ మహాత్ములు నేరుగా ఆమె కడుపులో పెరుగుతున్న పిల్లవాని ఆత్మతో మాట్లాడి రకరకాల యోగ శక్తులను ప్రసాదించి ఆ పిల్లవానిని భక్తిభావంతో ధ్యానించి మాయమయ్యేవారు!

ఆ పిల్లవానికి 'చందు' అన్న నామకరణం చేశారు మాస్టర్‌గారు! చందు 8 నెలల పిల్లవాడుగానే లేచి కూర్చునేవాడు! ఉయ్యాల పట్టుకుని కూర్చుని మాస్టర్‌గారితో సంభాషించేవాడు! అలా చందుద్వారా మాస్టర్‌గారికి చిత్ర విచిత్రమైన ఇంగ్లీషుమంత్రాలను యోగకోర్సులవలే సంగ్రహించగలిగారు! ఇందులో చాలామటుకు మనిషి ఆత్మకు సంబంధించినవి! మనిషి మర ణించిన తర్వాత తిరిగి జన్మించకముందు పైలోకాలలో జరిగే ఆధ్యాత్మిక పరిణామాలూ, వాటికి సంబంధించిన ఇంగ్లీషు మంత్రాలు!

మాస్టరుగారి యోగాడైరీ పుస్తకాలలో నాకు లభించిన మూడు పెద్ద రిజిస్టర్ బుక్కులలో 250-కి పైగా ఇంగ్లీషుకోర్సులు లభించాయి! ఇందులో సూర్యమండలంలో భూగోళం తిరుగుతూ కరెంటువంటి తీగలను పోలిన కనెక్షన్లు మనిషి మెదడులోనూ, యోగచక్రాలలోవుండే నాడులతో ఈ గ్రహాల

కుండే లింకులు ఒక సైన్సుచిత్రాలవలే మాస్టర్‌గారు చక్కగా రికార్డుచేసుకోవడమేకాక, వాటి వివరాలుకూడా రాసిపెట్టుకోవడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది!




చందు నెలలబిడ్డగా వుండగానే తాను భూమిపై జన్మించిన పని పూర్తయిందని తానిక పైలోకాలకు వెళ్ళవలసివున్నదని చెప్పి అకస్మాత్తుగా మరణించాడు! మాస్టర్‌గారు తమ యోగశక్తితో పైలోకాలనుంచి 'ప్లెంటి-ప్రాణా' ను కిందకి దింపి బతికించారు! తిరిగి కొన్నిగంటలలో చందూ మళ్ళీ మరణించాడు! ఇలా 24 సార్లు మాస్టర్‌గారు చందూని బ్రతికించడం, అతడు తిరిగి మరణించడం జరిగింది!

చివరకు చందు విసుగూ, కోపమూ వెలిబుచ్చి

"నన్నెందుకు ఇక్కడ భూలోకంలో బంధించివుంచాలని చూస్తారు!

మీకు కావలసిన యోగరహస్యాలన్నీ పూర్తి సమాచారం ఇచ్చాను! నేను తిరిగి పైలోకాలకి వెళ్ళకపోతే గ్రహ గోళాలలో పెద్ద గందరగోళం సంభవించ గలదు" — అనిచెప్పి తాను పైలోకంనుంచి వచ్చిన **కారణబ్రహ్మ** అవతార మనీ, తాను భూమిమీద నిలిచిపోతే పైన తాను చేసే నిత్యకార్యక్రమం సూర్యాది గ్రహగోళాల క్రమబద్ధం తిరిగేలా చూడటం స్థంభించిపోగలదనీ, దానివలన ప్రపంచ ప్రళయం ఏర్పడుతుందని చెప్పి మాస్టర్‌గారి పర్మిషన్‌తో స్వచ్ఛందంగా శరీరాన్ని విడిచి తిరిగి తన లోకాన్ని చేరుకున్నాడు. ఇది మాస్టర్‌గారి జీవితంలోనే ఒకగొప్ప వెలుగురవ్వ!

ఇలా చందుద్వారా సేకరించిన కొన్ని యోగ రహస్యాలు — మెదడుకు కేంద్రమైన సహస్రార చక్రంలోని వివరాలు, పూర్వయోగ గ్రంథాలలో ఎక్కడా లభించని నాడీ కేంద్రాలు చిత్రాలను ఈ గ్రంథంలో చూడవచ్చు! ఇందులో ముఖ్యంగా కుండలినీశక్తి మేలుకొనడంవల్ల సామాన్య యోగులకు ఏర్పడే నిద్రవంటి జడసమాధి మాస్టర్‌యోగంలో కలగకుండా పూర్తి ప్రజ్ఞలోనే కుండలినీ జాగరణ జరిగేలా చేసే **'హితు'** (Hitu), క్రేప్స్ (Crapes) వంటి నాడీకేంద్రాలు విచిత్రమైనవి!

ఇంకొక విశేషం యోగసిద్ధులను దుర్వినియోగం చేసుకునే సావకాశం లేకుండా సాధకునికి ఎంతకావాలో అంతే యోగశక్తి సప్లై జరిగేలాగా చేసే నాడీకేంద్రాలు కొన్ని! ఇంకా కుడివైపు పింగళానాడిలోని శక్తి, ఎడమవైపు ఇడానాడిలోని శక్తితో సమ్మిళితమై సుషుమ్నా నాడిద్వారా ఈశక్తిని పైకిలాగి సహస్రార చక్రంవద్ద నిలబెట్టే హిప్ రాడ్ (Hip-Rod) వంటి సహస్రారం లోని భాగాలు మాస్టర్‌గారి చిత్రంలో చూడవచ్చు! సహస్రారంలోపలి పద్మము వెన్నెముక, మెడకిందనుంచి చేతికర్రవలే వంగి మెదడు అడుగు భాగమైన పిట్యుటరీని చేరే నిర్యాణ యోగకేంద్రంవంటి వివరాలు ఈ చిత్రంలో చూడవచ్చు!




*FIGURE A*

**DETAIL OF MASTER C.V.V.-YOGA CENTRES IN MAN**

***(SEE FIGURE-B FOR DETAILS)***

అన్నిటికన్నా ఆశ్చర్యం సాధకుని కుడికంటిలోని కనుకొలకల క్రింద కన్నీళ్ళను మోసుకునివచ్చే సన్నటి గొట్టం, రెండవచిత్రంలో చూడవచ్చు!




*FIGURE B*
**NADIS IN HEAD**

కుడికంటి కొలకులనుంచి ముక్కువంతెన కిందుగా ఐమూలగా ప్రయాణించి ఎడమవైపున నుదురుచేరి నిటారుగా పైకి ప్రయాణించి సహస్రారంచేరడం గమనించవచ్చు!

ఇలాగ కుడికంటిలోంచి వచ్చేనాడి ఎడమవైపుకు, ఎడమ కంటినుండి ప్రయాణించే నాడి కుడివైపున ముక్కు అడుగున (కండ్లజోడు వంతెన పెట్టుకునే చోటునుండి) ప్రయాణించడమూ — అలానే సుషుమ్నానాడి కేంద్రంనుంచి అరుణసూర్యకాంతితో వెలిగే బ్రహ్మనాడి భ్రూమధ్యంనుండి పైకి ప్రయాణించి ముక్తిస్థానమైన సహస్రారపద్మంపైన వుండే 'నిర్వాణ' స్థానమైన మాడు పైభాగంలో చిన్న రంధ్రంద్వారా బయటకిచేరుకోవడం ఈ చిత్రంలో గమనించవచ్చు!

పసిపిల్లల 'మాడు' మెత్తగావుండటం తల ఎముకలు ఇలా కలవ కుండా తెరుచుకుని వుండటానికి కారణం పిల్లలు పవిత్రమైన బ్రహ్మస్థితిలో వారి మనస్సువుండి ఈ రెండువైపులనుండీ వెళ్ళీ నాడులద్వారా పైలోకాల తోనూ, తమ గతజన్మ జ్ఞాపకాలతోనూ జన్మించడం ఎలానో తెలుస్తుంది ఈచిత్రంవల్ల! అంతేకాదు ఈ కుడి ఎడమ నాడులు నుదురుపైన ప్రయా ణించే రేఖలు ఆలయంలోని విష్ణుమూర్తి విగ్రహానికి నుదుటదిద్దే తెల్లని తిరుమణినామం మధ్యనుండే ఎర్రని కస్తూరితిలకం అలా ఏర్పడివుండటానికి గల యోగరహస్యం బోధపడుతుంది!

పరిశీలనాదృష్టితో గనుక మనం మాస్టర్‌గారి ఈ యోగచిత్రాలను పరిశీలించితే ఇలాంటి ఎన్నో యోగరహస్యాలను చందూ మాస్టర్‌గారికి అందించి తన కారణ బ్రహ్మలోకాన్ని చేరుకున్నాడు!

## అయోనిజుడు :-

ఈ పుట్టిన ఆ పిల్లవానికి **"చందు"** అని నామకరణం చేశారు! చిన్నప్పుడే అయిదునెలల పిల్లవాడి సైజులోవున్న 'చందు' మూడునెలలకే లేచి కూర్చునేవాడు! ఐదున్నర 5 ½ మాసాలు వచ్చేసరికి మాస్టర్‌గారితో సంభాషించేవాడు! తరచు గాఢమైన యోగసమాధిలో మునిగిపోయేవాడు! చందుద్వారా మాస్టర్‌గారు మానవజన్మ గురించి అనేక రహస్యాలు పైలోకాలకి సంబం ధించినవి సేకరించగలిగారు! అందులో ముఖ్యమైనవి ఇవి :-

(1) మానవునికి **'అంతరాత్మ'** పైలోకాల్లో ఎలా ఏర్పడుతుంది?

(2) మరణించకుండా ప్రతినిముషం శ్వాసపీలుస్తూ ఈ ఆత్మ జీవించ డానికి కావలసిన **'ప్రాణశక్తి'** ఎక్కడినుండి వస్తోంది?

(3) బయటి స్థూలశరీరానికి ఏర్పడే కన్ను, ముక్కు, చెవివంటి ఇంద్రియాలు లోపల జీవులకుండే సూక్ష్మశరీరంలో ఎలాగ ఏర్పాటుచేయ బడతాయి?

(4) జన్మించే క్షణంలో పీల్చుకునే **మొదటిశ్వాస** ద్వారా

(5) మరణించే క్షణంలో జీవుని **ఆఖరి శ్వాస** ద్వారానూ ఏం జరుగు తుంది?

(6) మరణించిన తర్వాత జీవుడు తిరిగి జన్మించే లోపల పైన ఏ **స్థితిలో వుంటాడు?**

(7) ప్రతి మనిషికీ తాను మరణించిన తర్వాత తన పరిస్థితి గురించి గాని, తాను **జన్మించబోయే ముందు** తనయొక్క ఆత్మ పరిస్థితిగాని **ఎందుకు** జ్ఞాపకముండదు?

(8) మరణించేముందు, లేక తీవ్రమైన యోగసాధన చేసినపుడుగాని ఒక నిద్రవంటి స్థితి (Coma) మత్తు, ఎందుకు కలుగుతుంది?

(9) జన్మించే జీవుని **"ఆయుష్షు"** ఫలానా అని **నిర్ణయించేదెవరు?**

(10) కొత్తగా ఏర్పడే శిశువు శరీరంలో ఆ జీవుని **గతకర్మకు** సంబంధించిన **భవిష్యత్తు** జీవితం ఏవిధంగా సృష్టిచేయబడి **రాబోయే** "కర్మ"గా — అతని జీవితాన్ని ఎలా నిర్ణయిస్తుంది?

ఇంకా అనేక నిగూఢ రహస్యాలను 'చందు' పైలోకాలనుంచి ఎన్నో యోగప్రక్రియలను ఇంగ్లీషు మంత్రాలను **మాస్టర్ CVV** గారికి ఉపదేశించాడు! చివరకు ఆ పసిబిడ్డ తాను వచ్చినపని పూర్తయిందని చెప్పి మరణించాడు!

## తండ్రికి – "చందు" ఉపదేశం :–

ఇలా చందు ఉపదేశించిన అనేక ఇంగ్లీషుమంత్రాల సాయంతోనే మాస్టర్‌గారు తర్వాతికాలంలో అనేకమందికి రోగాలు నయంచేశారు! మరణించిన మనిషిని బ్రతికించారు! మనిషి అనేకసార్లు జన్మించే గతజన్మల 'రికార్డు' — ఒక గ్రంథంలోని పేజీలలాగా మెదడులో ఉల్లిపాయలలోని పొరలలాగా ఎలాగ నిక్షిప్తం చేయబడివుంటుందో మైక్రోఫిల్మ్‌లాగా చూపించాడు! తర్వాత కాలంలో **చందునుంచి పొందిన ఇంగ్లీషుమంత్రాల ద్వారానే** మాస్టర్‌గారు సూర్యుడు, చంద్రుడు, గురువు, బుధుడు, అంగారకుడు, శనివంటి గ్రహాలను కంట్రోలు చేసి — **మానవజాతి గ్రహాలకు బానిసకాకుండా** వుండే భవిష్యత్ కార్యక్రమాన్ని చేపట్టారు!

## సంసారం చెయ్యకుండా – పిండోత్పత్తి :–

ఇలా మాస్టర్‌గారి రెండవభార్య మదర్ వెంకమ్మగారి శరీరంలోకి తమ యోగశక్తిద్వారా పైనున్న బ్రహ్మలోకంనుంచి ఒక జీవాత్మను ఆకర్షించి

శారీరకంగా సంసారం అవసరంలేకుండా ఆమె గర్భంలోకి ప్రవేశపెట్టడం ద్వారా ఇలా గర్భస్థుడైన శిశువుయొక్క "జన్మ" పైన బయటి గ్రహాలకు **ఏమాత్రం 'కంట్రోలు' లేకుండా** చేసి స్వతంత్రజీవిని సృష్టి చేయగలిగారు! దీనివల్ల ఆ పిల్లవాడి జీవితం మామూలుగా అందరి జీవితాలలాగా అతని **జాతకంలోని గ్రహాలకు బానిసగా** లేకుండా స్వతంత్రంగా **"అయోనిజుడు"**గా జన్మించి గ్రహాల కంట్రోలులేని **పరిపూర్ణ ఆధ్యాత్మిక జీవునిగా** నిరూపించాడు.

దీనిలో దాదాపు అన్ని గ్రహాలూ సహకరించినా మాస్టర్‌గారి ఇంగ్లీషు మంత్రాల కోర్సులకు వశమై — CVV యోగం తీసుకొన్న జీవుల జాతకం లోని గ్రహాల బానిసత్వం లేకుండా సాధించగలిగాడు!



## 14

# చనిపోతే బ్రతికించిన మాస్టర్-C.V.V. యోగం

మాస్టర్ యోగం ఒక ఎలక్ట్రానిక్ సైన్సువంటి అతిలోకమైన యోగ విధానం! ఇది ఈనాటి సైన్సుకుకూడా అందని మానవ 'సృష్టి' పరిణామం గురించిన రహస్యాలతో నిండివున్నది సగటుమనిషి ఆలోచనలకు అందనంత ఎత్తున!

చాలామంది నిత్యజీవితంలో అసలు తానెవరో ఎందుకు జీవిస్తున్నాడో ఎలా జన్మించాడో అన్న విషయాలేవీ పట్టించుకోకుండా పశుపక్ష్యాదులైన జంతువుల వలే జీవిస్తూండటంవల్లనే ఈనాటి సమాజంలో అసురశక్తులు హింస, స్వార్థం, యుద్ధము, రక్తపాతం వంటి ఘోరపాపాలు భూగోళాన్ని కాలుష్యంతో నింపి వేశాయి!

ఈనాటి సైన్సు తెలివి — రాకెట్టుతోనూ చంద్రమండలంవంటి గ్రహ మండలాలకు ప్రయాణంతోనూ, లేదా అణువును భేదించి అణుబాంబుతో వినాశనాన్ని సృష్టించడంతోనో — నిలిచిపోయింది! దీనివల్ల మనిషే కాకుండా ఈ భూమిమీద బ్రతికే ప్రాణులన్నీ కూడా గొప్ప సంక్షోభంలో పడిపోయాయి! అలాకాకుండా సైన్సు కనుక మనస్సును గురించి మనసుకు అతీతమైన

ఆత్మను గురించి ఈ రెండిటినీ జీవింపచేసి బ్రతికివుంచే ప్రాణశక్తి గురించి పరిశోధనచేసి వినాశంవైపు కాకుండా మనిషి సరిగ్గా మానవునికి సంబంధించిన విజ్ఞానాన్ని పరిశోధించి సాధించగలిగినపుడు ఎలాంటి విజయం లభిస్తుందో మాస్టర్ యోగం దాన్ని గురించి చెప్తుంది! కాబట్టే ఈ నూతన యోగవిధానం దీనిని సాధించిన మాస్టర్‌గారి ఆలోచనావిధానం **ఈనాటి సైన్సుకన్నా ఒక శతాబ్దం ముందునడుస్తోంది!**

ఎంతో ముందుదృష్టితో పూర్తి విజ్ఞానంతో యోచించగలిగే మేధావులకు మాత్రమే ఈ యోగంలో కొన్ని రహస్యాలు అయినా బోధపడతాయి! ఈవిషయాన్ని ఋజువుచేసే అద్భుత సంఘటన ఒకటి మాస్టర్‌గారి జీవితంలో జరిగింది!

మాస్టర్ CVV గారు తన శ్రీమతితోసహా ప్రయాణమై బయలుదేరుతుండగా వారి తండ్రి హడావుడిగా అడ్డువచ్చి "ఇంటిలో మేనత్త 80 ఏళ్ళునిండిన పండుముసలిది, మరణావస్థలోవుంటే ఈ ప్రయాణమేమిటి? వచ్చేప్రాణం పోయేప్రాణంగా వున్న ఆ ముసలితల్లిని చూడు!" — అని అడ్డుపడినా మాస్టర్‌గారు ఏమీ చలించలేదు సరికదా తానొక అర్జంటు పనిమీద ప్రయాణమై వెళుతున్నాననీ, ముసలామెకేమీ భయంలేదని చెప్పారు! దాని కాయన తండ్రి — "ఆమె కొద్ది నిముషాలలో మరణిస్తుంది! అప్పుడిక నీవు చేయగలిగింది ఏమున్నది?" అంటే మాస్టారుగారు

"ఒకవేళ ఆమె మరణించినప్పటికీ శవాన్ని భద్రంగా కాపాడ"మనీ, తానొచ్చేవరకూ శవదహనం చేయకుండా అలాగే వుంచమని చెప్పి వెళ్ళిపోయారు. తండ్రి శిలాప్రతిమలా విస్తుపోయాడు!

ఇక్కడ ముసలావిడ ఎగశ్వాస తన్నుకురాగా క్రమంగా కాళ్ళూ చేతులూ చల్లబడి కొంతసేపటికి శ్వాస పూర్తిగా నిలిచిపోయింది! గుండె కొట్టుకోవడం ఆగిపోయింది! మరికొద్దిసేపట్లో డాక్టరు ఆమె మరణించిందని శరీరం నిర్జీవ

మైన కాళేబరమనీ, ధృవపరిచారు!

చుట్టూరా బంధువులందూ శవానికి అంత్య క్రియలు ఏర్పాటు చేయమని తొందరచేయసాగారు! కాని, మాస్టారుగారు తాను తిరిగివచ్చేవరకూ ఆమె మరణించినాసరే శవాన్ని భద్రంగా కాపాడమని చెప్పివెళ్ళారుకదా? ఇప్పుడేమిటి చేయడం? ఇలా తర్జనభర్జనలతో ఒకరోజు గడిచింది! శవం క్రమంగా చెడిపోయిన సూచనలు కనిపించసాగాయి! మరి కొన్ని గంటలలో దుర్వాసనకూడా ప్రారంభమైంది! ఇంట్లో బంధవుల గోల ఎక్కువైంది! 'ఇలా ఇంట్లో శవాన్ని పెట్టుకొని ఎంతకాలం శవజాగరణం చేస్తాము? ఇది ఇంటికి అరిష్టం! బ్రాహ్మణ్యం అంతా వెలివేస్తారు!' అంటూ హంగామా చేయసాగారు! ఎటూ తీర్చుకోలేని పరిస్థితిలో చిక్కుకుని, కాళ్ళూ చేతులూ ఆడక కూలబడి పోయాడు!

ఇంతలోకే మాస్టర్‌గారు రైలుదిగి రావడం, వాకిట్లో బండిదిగి ఇంట్లో రావడంతో తండ్రి సుడిగాలిలా వెళ్ళిపడ్డాడు ఆవేశంగా! "ముసలామె మరణించి చాలాకాలం గడిచిపోయింది! ఇక శవంకూడా నిలిపివుంచే స్థితిలో లేదు! ఇంక ఇప్పుడు నువు చేసేదేముంది! శవాన్ని అట్టేపెట్టి ఏమి చేసుకుంటావు?" అని కన్నీళ్ళతో, ఆక్రోశంతో బావురుమన్నాడు! మాస్టరుగారు మాత్రం మౌనంగా గంభీరంగా చూసి — తనను ప్రశాంతంగా పది నిముషాలు వుండనీయమని చెప్పి తలస్నానం చేసివచ్చి శవం ముందు పద్మాసనంలో కూర్చున్నాడు! బంధువులంతా ముందుహాలులో చేరి ఉత్కంఠతో సూది కిందపడితే చప్పుడయ్యేంత నిశ్శబ్దంగా ఊపిరిపీల్చకుండా చూస్తున్నారు! నిముషాలు గడిచాయి గంటలలాగా!

మాస్టర్‌గారు చందూనుండి పైలోకాలకు చెందిన ఇంగ్లీష్ మంత్రాల కోర్సులను ఉచ్ఛరించారు! పరబ్రహ్మకు నమస్కారపూర్వకంగా ప్లెంటి ప్రాణా సప్లై (Plenty-Prana Supply) చేసే కోర్సులను ముమ్మారు జపించి గాఢమైన

ధ్యానంలో మునిగిపోయారు! క్షణాలు గడుస్తున్నాయి! ఉన్నట్టుండి శవం చివాలున కదిలింది! అందరూ గుండెఆగినంత పనై తృళ్ళిపడ్డారు!

రెండవసారి ప్రేయరు శరీరంలో చలనం ఆరంభమైంది! క్రమంగా కాంతిపుంజుకుని నిముషాలమీద అతినెమ్మదిగా శ్వాస అనుమానంగా ఆడ సాగింది! ప్రేయరు మరికొంతసేపు గడిచాక పూర్తిశ్వాస ఆడి ముసలామే కాళ్ళూచేతులూ బారచాపి ఒళ్ళువిరుచుకుని కళ్ళుతెరచి చూసి — అస్పష్టమైన నూతిలోంచి మాట్లాడుతున్న స్వరంతో

"అబ్బా! ఆకలి దాహం! నీరసంతో చచ్చిపోతున్నాను గొంతులో ఏమైనా పోయండర్రా!" అంటూ మూలగ సాగింది! మాస్టర్‌గారు చివాలునలేచి ఒక వెండిగిన్నెలో నీళ్ళమజ్జిగ రసం అన్నంతో పిసికి గుజ్జుగా జావలా తయారుచేసి స్వయంగా తనచేత్తో మూడుసార్లు ముసలావిడ నోట్లో చుక్కచుక్కలుగా పోశారు! క్రమంగా ఆమెప్రాణం కుదుటపడ్డది! మరికొన్ని గంటలలో ఆమె ఆకలి దహించుకుపోతున్నదని చెప్పి ఆహారం తీసుకోసాగింది! ఆతర్వాత ఆమె మరి అయిదు సంవత్సరాలు దృఢంగా జీవించింది!

మాస్టరుగారు పద్మాసనంనుంచి లేచి బయటకు రాగానే ఆయన తండ్రి "నీవు దేవుడివి!" అంటూ — తటాలున కాళ్ళపైపడి సాష్టాంగ నమస్కారంచేస్తూంటే —

"నేను పరబ్రహ్మనైనాసరే మరింకేదైనాసరే, మీరుమాత్రం ఈ శరీరానికి తండ్రి! నాకు మీరు నమస్కారంచేయుట తగదు! కావాలంటే మీరు పరబ్రహ్మగా ప్రేయరులో మీరు ప్రార్థించవచ్చు! కాని శరీరంతోమాత్రం మీరు నసమ్కరించరాదు" — అంటూ వారించారు! చూస్తున్న బంధుమిత్రు లంతా రాతి విగ్రహాలులాగా స్థంభించి ఆశ్చర్యపోయారు!

ఇది **మృత్యువుపై — విజయం!** మాస్టరుగారి జీవితంలో రెండవ అద్భుతమైన విజయం!

15

# 'నమస్కారంతో - రోగనివారణ' - శ్రీ వేటూరి ప్రభాకర జ్యోతి!

అద్భుతమైన మాస్టర్ యోగాన్ని ఈనాటి మనకాలంవరకూ కూడా సజీవంగా ఉండేలాగ శ్రద్ధతో సాధనచేస్తూ అనేక వందలమందికి మాస్టర్‌గారి ఇంగ్లీషుమంత్రాలతో ప్రేయరుద్వారా రోగనివారణచేసిన మహామహులలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ముఖ్యులు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సాహిత్య పండిత ప్రపంచంలో చిరస్థాయిగా నిలిచిపోయే పరిశోధనలుచేసిన జగద్విఖ్యాతులు. అమూల్యమైన తాళపత్రాల నుంచి ఎన్నో విలువైన కావ్యాలను శాస్త్రగ్రంథాలను పండిత పరిష్కారంచేసి ప్రచురించటానికి తయారుగా ఎడిట్ చేసిన గొప్ప సాహిత్య పరిశోధకులు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మద్రాసులోని ప్రాచీన తాళపత్ర పరిశోధన శాఖ (Government Oriental Manuscript Library) లో పనిచేస్తున్న రోజుల్లో తరచూ ఆరోగ్యం దెబ్బతిని, ఇటు తమ విధులను నిర్వర్తించలేకా అటు

రోగనివారణ కాకా ప్రభుత్వంలో శెలవులుకూడా పూర్తిఅయి తిరిగి జబ్బుపడ్డ తరుణంలో ఆత్మత్యాగం తప్ప వేరే దారి కనిపించని భయంకర విష వలయంలో చిక్కుకున్నారు. అలాంటి విపరీత విపత్కర పరిస్థితిలో శ్రీప్రభాకరులకి అభయమిచ్చి ఆరోగ్యమిచ్చి అనుగ్రహించి బ్రతికి బట్టకట్టించిన ఆశాజ్యోతి — శ్రీ మాస్టర్ CVV గారి దివ్యోపదేశమూ, కరుణయే! దీన్ని కాలాంతరంలో శ్రీప్రభాకరశాస్త్రిగారే తమ అద్భుతమైన శైలిలో అనుభవాన్ని ఆధారంగా కళ్ళకుకట్టినట్లు ఇలా వివరించారు :

> "ఇక నౌకరీ దుష్కరమని నిశ్చయించుకొంటిని! అప్పటికే క్యూరేటర్‌గారికి — '**నీతడు సెలవుకోరినచో** dismiss **చేసి యింటికి పొమ్మనవలసినదే!**' అని... శెలవు చీటిమీద వ్రాసిరి! ... లాభము లేదయ్యెను. నాకును దిక్కుతోచదయ్యె! బలవంతంగా శరీరమును నరములశక్తిని ఎగసనద్రోసికొని స్నానముచేసి హోటలుకు వెళ్ళితిని! ఇట్టి స్థితిలో ఇంటికి మరలివెళ్ళుట బ్రతికిఉండి చచ్చుటే అగును!... లభించినది ఆరగించి మహాప్రస్థాన కల్పముగా పోయి గంగానదీ ప్రవాహములో గలియుదునుగాక! అని నిశ్చయించు కొంటిని... ఇత్యాది యోచనలతో అక్బర్ సాహెబ్ వీధిలో వచ్చు చుంటిని!

## వెలుగుబాట :

> రోడ్డుమీద అబ్బూరి జగన్నాధరావుగారనే మిత్రుడగపడి 'మీరు ప్రభాకరశాస్త్రిగారేనా? ఇట్లుంటిరేమి' అనడిగెను. మూడేళ్ళ నుంచి జబ్బుగానుంటినంటిని. 'ఏమి జబ్బు?' అనుచూ అతడు నన్నింటిలోనికి కొనిపోయెను... శ్రీపోతరాజు నరసింహముగారను ప్రెసిడెన్సీకాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసర్ అగపడిరి!... నా యనారోగ్య మును తెల్పితిని. వారి బావమరిది యగు జగన్నాధరావు... "మా

బావగారు చేరిన యోగగోష్ఠిలో చేరిన మీ అనారోగ్యము తొలగి పోవునుగదా? ఏల చేరరాదు?" అనిరి.

ఈవిధంగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తనకే ఊహించని రీతిలో మిత్రుల ప్రోత్సాహం రూపంలో తమపై అజ్ఞాతంగా ప్రసరించి తమను ఆకర్షించుతున్న మాస్టర్‌గారి అనుగ్రహమును గ్రహించకుండానే చివరికి కుంభకోణము చేరుకున్నారు. భగవదనుగ్రహమూ సద్గురు కటాక్షమూ మానవుని బుద్ధికి అందనంత ఎత్తునుండి ప్రసరించుచుండును గదా!

రైలుస్టేషన్‌వద్ద మధ్య దారిలో శాస్త్రిగారితో పనిచేసే ఒక సహోద్యోగి కనబడి వీరిచేత సెలవుచీటీ వ్రాయించుకుని తానే తీసుకుని పైఅధికారికిచ్చి శలవును గ్రాంటుచేయించినాడు. అయాచితంగా ఇలా సహాయం చేయుట గురుకటాక్షముగాకేమిటి? అతడే టిక్కెట్టుకూడా కొని యిచ్చి శాస్త్రిగారిని రైలెక్కించాడు.



*శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, వారి భార్య*

రైలుకన్నా వేగంగా మనస్సు పరుగెత్తుతూవుంటే పరిపరివిధాల తన భవిష్యత్తును తర్కించుకుంటూనే శాస్త్రిగారు కుంభకోణం చేరుకున్నారు. తరువాతి అనుభవం వారి మాటలలోనే విందాము :-

"నేనంతలోనే చేరవలసిన చోటికి చేరితిని! నరసింహముగా రిచ్చిన అడ్రసుకు బండిమీద వెడలితిని. బండివాడాయింటిని బాగుగా ఎరిగినవాడు! త్రోవలో నతడు అక్కడి గురుదేవుల ఘనతను వర్ణింపతొడగ... చేరవలసిన చోటికి చేరితిని! ఒక సన్యాసి కాషాయధారి బండి నిలుపగానే చేరవచ్చి... 'ఎవరునాయనా నీవు?' అని తిన్నని తెలుగు పలుకుబడితో ప్రశ్నించెను. నన్నాలింగనము చేసుకొని బండి దించెను... అప్పటి పరితోషము నేనెన్నటికీ మరువ జాలను."

"నాచేతి పండ్లబుట్ట, పుచ్చుకొని... వడిగా లోనికరిగి నా విషయములు శ్రీవారి కెరిగించి నన్ను దర్శనమునకు తోడ్కొనెను. లావుగాక సన్నమూగాక, పొట్టిగాక మరీ పొడుగూ కాక నిమ్మవంటి ఛాయతో అరుణోదయకాంతులు కడల్కొల్పుచున్న శ్రీవారిని చూడగానే నా యొడలు పులకరించెను.... నమస్కరించి జాబు నర్పించుకొంటిని... శ్రీవారితో నాస్థితిని విన్నవింపగా 'ఇక నీ ఆరోగ్యరక్షణాభారము నేను వహించితిని! వెరవక నలుగురితో పాటుగా మామూలు భోజనము చేయవచ్చును...' అనిరి. ఆవాల తెట్టె తేలుతున్న చారుతో నూనె తిరగమోత కూరలతో నేనానాడు భోజనము చేసితిని!..."

"నాటి సాయంకాలము ఆరుగంటలకు నాకు శ్రీవారి శిష్యతానుగ్రహము లభించెను... శ్రీవారికి సాష్టాంగముగా నమస్కరించి నాయభ్యర్థనము నివేదించుకొంటిని! ఉపదేశము చేసిరి. 'నీవు

హాలులోనికి వెళ్ళి ప్రేతాసనమున శయనించి నమస్కరించి ఉపదిష్టము నొక్కతూరే ఉచ్చరించి కనులు మూసుకొని శరీరము లో... నేమేని జరుగునుగాక దానిని గుర్తించుచుండుము. మనస్సు బహిర్ముఖమై ఎక్కడికేని పోయినచో పోనిమ్ము! నీవై అరికట్టవలదు! అదే తిరిగిరాగలదు. ఏమి జరుగునో సాక్షీమాత్రుడవై పరికింప తలపుము. అంతే నీవు చేయవలసినది... కన్నులు తెరువ ప్రయ త్నింపకుము. ప్రయత్నించిననూ తెరువ వీలుపడదు... శరీరములో జరుగవలసినదెల్ల జరుగగానే కన్నులు తెరపియగును...' అట్లే ఉపదిష్టమునొక్కమారే సార్థకముగా స్మరించి ఉచ్చరించి కన్నులు మూసికొని పండుకొంటిని.'

ఈవిధంగా ఎంతో పూర్వజన్మ పుణ్యము గలవారికికాని లభించని పరబ్రహ్మస్వరూపులగు శ్రీ **మాస్టర్ C.V.V.** అనుగ్రహాశీస్సులు స్వయంగా పొంది ప్రభాకరశాస్త్రిగారు ఊహించరాని దివ్యానుభవంతోపాటు సంపూర్ణారోగ్య మును పొందగలిగారు. అప్పటి వీరి అనుభూతి గురించి వీరి మాటలతోనే విందాము :-

...నేనానాటి రాత్రి కొంత హాయిగా నిద్రపోయితిని... మర్నాడు... నావిషయమును 'టెస్టు' తీయవలసినదిగా శ్రీవారు వారి నాజ్ఞాపించిరి.

నన్ను దగ్గరగా కూర్చుండుమనిరి. రాధాకృష్ణపిళ్ళెగారు గురుదేవులకు నమస్కరించి కనులు మూసికొని ఒక నిముష మాగి... గ్రంధము పఠించుచున్నట్లేదో చెప్పగా మహాదేవయ్యగారు దానిని వడివడిగా వ్రాయసాగిరి.... ఉదయం సరిగ్గా 9 గంటల 15 నిముషముల వేళ అది వ్రాయనారంభించిరి... అంతర్దృష్టికి కనబడినవి, అంతశ్రృతికి వినబడినవి చెప్పదొడగిరి."

ఈ అద్భుతమైన టెస్టులో శాస్త్రిగారి శరీరములోని అవయవాలూ, వాటి ఆరోగ్య-అనారోగ్య పరిస్థితీ, శాస్త్రిగారికున్న బాధలూ, వీరి మనఃస్థితీ సంగ్రహంగా వీరి జీవిత అనుభవసారమూ అంతా అద్భుతంగా ఒక పుస్తకం చదివినట్లుగా పిళ్ళెగారు చెప్పుకుపోతూవుంటే మహదేవయ్యగారు వ్రాస్తూపోతూ వున్నారు. ఇంకా అందులో శాస్త్రిగారి పూర్వజన్మములు, అంతవరకూ జరిగిన గత జన్మలకర్మ, అనారోగ్య కారణము, దాని నివారణ, ప్రస్తుతం వీరికి నడుస్తున్న — జన్మఎన్నవదో అసంఖ్య మొదలైన వివరాలెన్నో రికార్డు చేయబడినాయి. మాస్టర్ గారి యోగసాధకుల రిజిస్టరును బట్టి చూడగా అందులో మొత్తం 752-మంది మీడియములు శ్రీవారి జీవితకాలములో ఉపదేశము నొందగలిగిరి. అందులో శ్రీశాస్త్రిగారి సంఖ్య 303వ శిష్యుడు. వారికి శ్రీవారి ఉపదేశము లభించిన శుభదినము **22-6-1916.** విచిత్ర మేమంటే సరిగ్గా ఆ తేదీ సంవత్సరంలో కల్లా పొడుగాటి దినకాలంవుండే కటక సంక్రమణ కాలం (Winter solstice Day).

తరువాత శాస్త్రిగారు తమ ఉద్యోగ బాధలనూ అనారోగ్యగాధనూ సెలవు లభించకపోవటం వలన ఏర్పడ్డ కష్టమైన పరిస్థితినీ, తమ దుస్థితినీ మాస్టరుగారికి నివేదించుకుని — తాను ఉద్యోగమునకు రాజీనామాచేసి శ్రీవారి పాదసేవలో జీవితం గడపటానికి అనుమతికోరారు!

## మాస్టరుగారి ఉపదేశము :

దానికి **మాస్టర్ C.V.V.** గారు గంభీరంగా నవ్వి అడ్డంగా తలాడించి :

"**బండి నడుచుచుండగానే రిపేరు సాగవలెను!** బండి ఊడ దీసినచో బండివాని జీవిక చెడును. అట్టిది నా యోగమార్గము! సాగుచున్న ప్రవృత్తికి భంగము కలుగరాదు! ఇది నివృత్తి మార్గము కాదు! రాజయోగ మార్గము! గార్హస్థ్యము వుండవలెను. సన్యాసి

కారాదు! సౌఖ్యముండవలెను. ఆహారాదులు సరిగా ససిగా గైకొను చుండవలెను. ఇట్టిచో నీవు నీ ఉద్యగమున వుండుట అవశ్యకము. నీ ఉద్యోగము... లోకమునకు కూడా నుపకారము. ఆరోగ్య వంతుడవై నీయుద్యోగముననుండి తిన్నగా సాగించుకొను చుండుము!"

అనిచెప్పి మాస్టరుగారింకా నిగూఢార్థంతో కూడిన గంభీర వాక్కులతో ఇలా అన్నారు :

నీవిక్కడ ఉండగోరటం నిత్యమూ నాసన్నిధి కోసమేగదా? **'నేను సదా నీలోనుందును!'** — నీకు వలసిన సహాయము నీలో నుండి జరుపుచూనే యుందును... ఉదయము జరిగిన యోగ సాధన... సాయంకాలం దాకా పనిచేయుచుండును. ఎప్పుడెంతెంత జరుగ వలెనో అంతంతే జరుగును... నీలోనిప్పుడు క్రొత్తగా ప్రవేశించిన ప్రజ్ఞ నీవధికముగా నుపయోగించుకో గోరిననూ అది అట్లు పనిచేయదు! **ఎంత చేయవలెనో అంతే** చేయును.

"వివేకముతో సత్యమును, ధర్మమును గుర్తుంచుకొనుచూ **అంతరాత్మ** నారాధించుచూ లోపలికి జొచ్చుకొలది నీకు వలసిన ఉద్భోధము లభించగలదు... నీకారోగ్యము తరువాతనే యోగ సాధనా ఫలము దొరుక గలదు!"

అనిచెప్పి మాస్టర్‌గారింకా తమ నూతన యోగమార్గంలోని విశేషాలనూ యోగ సాధనా నియమాలనూ దయతో ఓపికగా వివరించారు. అందులో ముఖ్యమైన అంశాలు :

1) మాస్టర్ CVV గారి యోగము నమ్మితేనే పనిచేస్తుందని లేదా నమ్మకం కలిగిన వారికే సహాయం చేస్తుందనే కాదు. సాధకునియొక్క **విశ్వాస**

**అవిశ్వాలతో పనిలేకుండా స్వతంత్రంగా పనిచేసే మహాశక్తియే — ఈ యోగం!**

2) శరీర ఆరోగ్యము బాగుపడి ప్రత్యక్షానుభవంద్వారా సాధకునికి నమ్మకం కలిగించే బాధ్యతకూడా మాస్టర్‌గారిదే! ఆరోగ్యబాధ్యత కూడా వారే వహిస్తారు.

3) జీవిత పరమార్థం గురించిన ఆసక్తి వుంటేచాలు!

4) ఆహారం కొంచెమైనా తీసుకోకుండా **సాధన చేయరాదు!**

5) మద్రాసులోని మాస్టర్ యోగా సాధకులైన మిత్రులతో కలిసి సాధన చేయవచ్చు! సెలవు దొరికితేనే మాస్టర్‌గారిని దర్శించవచ్చు! దర్శించక పోయినా యోగానుగ్రహంతో ఆరోగ్యమూ, దివ్యానుభవమూ అయాచితంగా లభిస్తూ అనుగ్రహంగా వర్షించగలవు!

6) **డిసెంబరు** చివరివారంలోనూ **మేనెల** చివరివారంలోనూ జరిగే **"జనరల్ కాల్"** అనే యోగాకోర్సులకు తప్పక హాజరుకావాలి!" అని ఆశీర్వదించి అనుగ్రహించి పంపినారు.

ఇలా అతి తక్కువ సమయంలోనే మాస్టర్‌గారి యోగమార్గపు ముఖ్యాంశాలు మాత్రం శ్రీప్రభాకరశాస్త్రిగారికి లభించాయి. నిత్యసాధనలో అద్భుతమైన అనుభవమూ, శరీరంలో ఆరోగ్యము సరిచేయబడుట జరుగుచుండినాయి. దాని అద్భుతవిధానం శ్రీశాస్త్రిగారి మాటలలో :

## చేకూరుట :

"... మరల సంధ్యవేళ శిష్యులు పలువురు విచ్చేసిరి! ఎల్లరూ కూడా యోగసాధన చేయుట జరుగుచుండెను!!" శాస్త్రిగారి

చేయివాచి తీపునొప్పితో బాధించుతున్నదల్లా ఒక్క ప్రేయరు చెప్పగానే... "వాచియున్న నాచేయి నాటి సంధ్యాప్రార్థనమున నెంతో చక్కబడెను. వాపూ, తీపూ తగ్గెను. నాలో లోలోపల ఎక్కడో చిరువెలుగు గోచరించుచున్నట్లూ, దానిని నేను చేరపోవుచున్నట్లు... లీలగా గోచరింపదొడగెను. శరీరమున బ్యాటరీ పెట్టి నరములనెల్ల యూగించి వేసినట్లు గొప్ప ఊపు గలిగెను. చేతులు వాటియంతట అవే లేచి నమస్కరించెను. కాని కుడిచేతికింకనూ బాధ గోచరించు చుండెను. 'టిక్కు-టిక్కు' మని జబ్బఎముక అదరుట తెలియు చుండెను.

"...ఇట్టి విశేషమెక్కడగాని ఎప్పుడుగాని జరుగుట ఎరుగ నైతినే? ఒక్కతూరి ప్రార్థన మాత్రముననే యిట్లు జరుగుట ఏమిటి?... నాప్రార్థనను లోననెవరో వినుచున్నట్లు — సమాధానము చెప్పుచున్నట్లు, అనుగ్రహించుచున్నట్లు అగుచున్నదేమివింత? నాజబ్బు నాకు చాలా ఉపకారమే చేసెనా ఏమి? ఇక నాజబ్బు కుదిరినట్లే తోచుచున్నదే? ఏమి ఆనందము?" రెండుచేతులూ లేచి కలిసి నమస్కరించుట దానంతటదే జరుగగా శాస్త్రిగారు పరమాశ్చర్యపడిరి.

తరువాత కొంతకాలము వరకూ శాస్త్రిగారు ఉదయమే ప్రార్థన చేసికొని లైబ్రరీలో డ్యూటీకి వెళ్ళేవారు. పనిలో కూర్చోగానే 'యోగప్రక్రియ' తిరిగి ప్రారంభించేది. బస్సులోగాని, రైలులోగాని ప్రయాణిస్తూంటే అప్పుడుమాత్రం తాత్కాలికంగా నిలిచిపోయేది. మళ్ళీ కాస్త తీరిక దొరకగానే రైల్లోగాని, బస్సులోగాని దీర్ఘప్రయాణం జరిగితే మళ్ళీ అదే 'యోగప్రక్రియ' ప్రారంభించేది! అనగా స్వచ్ఛంద యోగశక్తి ఏదో శరీరంలోవుండి పనిచేస్తూ — శాస్త్రిగారి ఉద్యోగ అవసరాలనుబట్టి శరీరంలోని యోగప్రక్రియ హెచ్చుతూ

తగ్గుతూ సమతూలికగా జరిగేలా చూస్తూవుండేది. త్వరలోనే శాస్త్రిగారు సంపూర్ణ ఆరోగ్యవంతులైరి.

తరువాత మాస్టర్‌గారు అనుగ్రహించి శాస్త్రిగారి శ్రీమతియైన మహలక్ష్మమ్మగారికికూడా మాస్టర్‌గారి ఉపదేశం లభించింది. సంపూర్ణ ఆరోగ్యాన్ని పొందటమేకాక — **మాస్టర్ C.V.V.** గారి అనుగ్రహంతో ఇతరులకు కూడా ఆరోగ్యదానంచేసి ఘోరమైన బాధలనూ రోగాలనూ నయంచేయ కలిగారు!

శాస్త్రిగారి ఆరోగ్యం బాగుకావడంతోనే మాస్టరుగారు చెప్పిన ఆదేశాన్ని మరచిపోయి మాస్టర్‌గారి ఇంగ్లీషుమంత్రాలను ఒకేసారి ఉచ్చరించాలి గాని అనేకసార్లు చేయరాదన్న నిషేధాన్ని విస్మరించి శాస్త్రిగారు...

> "...యోగసాధనానంతరం రామజపమువలే కొంతతడవు తదేకానుసంధానము చెప్పితిని. నియమిత సమయములలోతప్ప ఇతర సమయములలో నా యనుష్ఠానము **చేయరాదని,** ఏదేని ఆవశ్యకత కల్గినచో అప్పుడొక క్షణము స్మరించినంతనే దానికి జరుగదగిన సౌకర్యము జరుగగలదని చెప్పి 'తదేక పారాయణ చేయుటకు పరతత్త్వము చెవిటిగాదని' — ... ఒకతూరి ప్రార్థించ గానే సర్వస్వమూ ననుగ్రహించగా అది చూచుచూ మరల మరల అర్థించనేల?" యనిరి!

> "నీవు టెలిఫోనులో మాట్లాడునప్పుడు నీమాటకు అవతలి వారు సమాధానం చెబుతున్నాగానీ తిరిగి మళ్ళీ మళ్ళీ వారిపేరే చెబితే ఏంలాభం? ఒక్కసారి ఇంగ్లీషు కోర్సును స్మరించినంతనే చాలనిన, రామజపము చేసినట్లు చేయుటవలననే ఈ మంటలు పుట్టినవి!" అని వీరిని ఆజ్ఞాపించారు. తర్వాతనే శాస్త్రిగారికి సంపూర్ణ ఆరోగ్యమునూ యోగానుగ్రహమూ కూడా కలిగింది.

తరచూ శాస్త్రిగారికి అనారోగ్యం కలిగినప్పుడల్లా ఒక కార్డుద్వారా మాస్టర్‌గారికి నివేదించుకొనే వారు. సరిగ్గా శ్రీవారికి పోస్టుకార్డు **చేరిన క్షణం లోనే** శాస్త్రిగారి బాధలు సర్వమూ **నయమయ్యేవి.** సమాధానంకూడా రాయ వలసిన వ్యవధికాని, అవసరంకాని లేకుండానే **బాధానివారణ తక్షణం లభించేది!**

## దివ్యానుభూతి :

ఇదిలావుండగా, ప్రభాకరశాస్త్రిగారి యోగపరిపాకం పూర్తికావచ్చింది. ఇంతవరకూ అనారోగ్యనివారణ మాత్రమే జరిగి ఇప్పుడు పరమాత్మ స్వరూప మైన బ్రహ్మసాక్షాత్కారం తమకు అర్థమయ్యేలాగా ఆఫీసులో కూర్చున్న శాస్త్రిగారు దివ్యానుభవాన్ని పొందగలిగారు. అది వారిమాటల్లోనే విందాం!

> "పదిగంటల వేళ నభ్యాసము జరుగగా టేబులు దగ్గర గ్రంథపరిశీలనము జరుపుతుండగా నా మూలాధారమునుండి ప్రబలముగా పిచికారితో కొట్టినట్లు ప్రజ్ఞాబల ధారలు రేగచొచ్చినవి! ఉత్సాహానందములు పొంగిపొరలి శరీరమెల్లా వ్యాపింపచొచ్చినవి. ఆ ధారలు తలలోనికి పోయినవి. అప్పటి నా యాహ్లాదము చెప్పతరముకానిది. లోపల చిచ్చుబుడ్డీ వెలిగించి, దానిపై పరచిన కుండ మూసినట్లు... లోలోపల ఏవో మెరుపు రేఖలు తిరుగ జొచ్చినవి. అప్పుడు పని కట్టపెట్టి వినోదింప దొడగితిని. పది నిమిషములట్లే యుండెను. నాస్థితి ఆనంద తాండవమాడుచున్నట్ల య్యెను."

క్రమంగా శాస్త్రిగారి శరీరమంతా ఒక **మధురమైన శక్తి,** ఒక విచిత్ర మైన **జ్ఞానము, చైతన్యము వ్యాపింపసాగింది.** లోపలనుండి ఆనందం, సంతోషం కొండరాతి అడుగుననుండి జలవూరినట్లు నిత్యం పైకి చిమ్మ

తుండేది! ఇలాగ నిత్యమూ బ్రహ్మానుభూతివల్ల ఆనందం లభించుచూ ఆరోగ్యం సంపూర్ణంగా చేకూరిన ధన్యజీవులు ప్రభాకరశాస్త్రిగారు.

మాస్టర్‌గారి నిర్యాణం (12-5-1922) తరువాత కూడా తిరుపతిలోని తమ ఇంటివద్ద వందలాదిమంది రోగులకు రోగనివారణచేసి వారి బాధలను తొలగించేవారు! 1950 ప్రాంతంలో శ్రీప్రభాకరశాస్త్రిగారు మాస్టర్‌గారిలో ఐక్యమయ్యేదాకా ఈవిధంగా గురుసేవను ఆఖరిశ్వాస దాకా సాగించి మాస్టర్‌గారి ఋణాన్ని ఈవిధంగా మానవసేవ ద్వారా తీర్చుకున్న ధన్యజీవి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

ఇది మాస్టర్‌గారు శరీరంలోవుండగా లభించిన అద్భుత అనుభవం. కాని మాస్టర్‌గారి నిర్యాణం తరువాత సరిగ్గా 42 సంవత్సరాలతరువాత నాకు మాస్టర్‌యోగం అనుగ్రహంగా లభించింది 1968 ప్రాంతంలో. మాస్టర్ గారి శారీరకమైన నిర్యాణం చెందిన తరువాతకూడా నాకూ, నాద్వారా యోగమిత్రులైన డాక్టర్‌వైద్యుడు శ్రీ C.S. శాస్త్రిగారికి (24-అధ్యా.), ఇంకా అనేకమందికి జరిగిన అనుభవాలను చూస్తే మరింత ఆశ్చర్యమౌతుంది.

వీటిని హైదరాబాద్ సరస్వతీనగరంలోని నా స్వగృహంలో పదేళ్ళపాటు నిర్వహించి **మాస్టర్‌యోగా స్కూలు**లోని అనుభవాలను 17-18 అధ్యాయాలలో వివరించాను.



## 16

# మాస్టరు ప్రేయరు - శిష్యుల అనుభవాలు!

మాస్టరుగారి దగ్గరనుంచి యోగదీక్ష పుచ్చుకున్నవారిని మీడియంలు అనీ శిష్యులు (Disciple) అనీ రెండువర్గాలుగా మాస్టరుగానే విభజించారు!

ఇందులో మీడియంలు అనగా — వారి స్వప్రయోజకత్వం సొంత సాధనమీద ఆధారపడకుండా మాస్టరుగారి శక్తికి ఒక పనిముట్టుగా విద్యుత్తు ప్రవహించడానికి ఒక కరెంటుతీగవలే వారి మనస్సులు శరీరమూ ఉపయోగ పడేవారని అర్థం! ఇలాంటి మీడియంలలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మొదలైన యోగమిత్రులు 752 మంది మాస్టరుగారి జీవితకాలం లోనే చేర్చుకోవడం జరిగింది! వీరందరూ మాస్టరుగారు చెప్పిన కోర్సులన్నీ వారు సాధనచేసి ఆతర్వాత వారి జాతకదోషాలను నివారించుకునే — లగ్నా రెక్టిఫికేషన్ (లగ్నమును పరిశుద్ధముచేయుట) 'చంద్రా రెక్టిఫికేషన్' మొదలైన నవగ్రహాల దోషాలను తొలగించే మాస్టర్‌గారి 'రెక్టిఫికేషన్' కోర్సు లనుకూడా పూర్తిచేసి మాస్టర్‌యోగా కోర్సులలోని 'మెర్చరీ' (Mearchary),

కోర్సు ఆరీకోర్సు (Auri Course), హల్లర్ కోర్సు (Haller Course) వంటి ఏడుస్థాయిలలోని మాస్టర్‌యోగ శిక్షణను సంపూర్ణంగా పొందినవారికి మాస్టరు గారు కేవలము నమస్కారం పెట్టుకోండి అనీ, మరికొందరికి ప్రాణశక్తి సప్లై అవడానికి విగర్ (Vigor) అనగా బలము పుష్టినిచ్చే విగర్ కోర్సుల వంటివి చేయించినవారు మరికొందరు! అలాంటివారి అనుభవాలు ఎంతో ఆశ్చర్యంగానూ మాస్టర్ యోగపద్ధతి పనిచేసే విధానం మనకి విశదీకరించేవి గానూ వుంటాయి! కనుక అలాంటి అనుభవాలు కొన్ని ఈ అధ్యాయంలో తెలుసుకుందాం!

మాస్టర్‌గారివద్ద సంవత్సరంలో రెండుమాట్లు "మాస్టర్స్ కాల్" (Master's Call) అనే యోగా ఏర్పడేది! అప్పుడు అందరూ మీడియంలు శిష్యులు ఒక్కసారిగా గుమికూడి కుంభకోణంలో మాస్టర్‌గారితో కలిసి ప్రేయర్లు చేసేవారు. ఆరోజుల్లోనే సాధకుల సందేహాలు, సమాధానాలు వారికేదైనా సమస్యలుంటే సహాయమూ నివారణ లభించేవి!

ప్రతీరోజూ ఉదయం, సాయంత్రం మాస్టర్‌గారి శ్రీమతి (మదర్‌గారు) చేసిన మల్లెపూవులాంటి ఇడ్లీలు వేడి వేడి కాఫీతో ఉదయం, సాయంకాలం ప్రేయర్లూ — అలానే మృష్టాన్న భోజనంతో సమృద్ధి అయిన సాపాటూ, నిత్యం విందుగా శిష్యులకు అనుగ్రహించేవారు మాస్టరుగారు! ఆతర్వాత ఎవరిళ్ళకు వారు వెళ్ళి వారివారి ఉద్యోగాలు వృత్తిధర్మాలు చేసుకుంటూనే రోజూ ప్రేయరు చేసుకోవడం — అలానే బాధలలో వున్నవారెవరైనా వస్తే ఆర్తులకు రోగనివారణ, బాధ నివారణ జరిగేవి!

ఈ మీడియంలు ఒక్కసారి రోగిని చేతితో ప్రేమపూర్వకంగా తాకి, నిమిరి మాస్టర్‌గారిని తలచుకొని నమస్కరించి ఒకేసారి ప్రేయరును ఉచ్చ రించగానే ఆశ్చర్యంగా వారికి నివారణకావడం జరిగేవి!

ఒకసారి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ ఉద్యోగధర్మం నిమిత్తం ముక్త్యాల, మైలవరం, నూజివీడు గ్రామాలువెళ్లి ఆ గ్రామాలలో ప్రాచీన తాళపత్రగ్రంధాలు తాటియాకుల ప్రతులు సేకరించి తీసుకురావడం నిమిత్తం పర్యటించడం జరిగింది!

అలా ఒకనాడు చాలాదూరం కాలినడకన వెళ్ళవలసివచ్చింది! మధ్యాహ్నం దాటింది! ఎండ నడినెత్తిన మాడ్చేస్తోంది! దరిదాపున భోజన వసతులు లభించనిచోట కడుపులో ఆకలి దంచేస్తోంది! అటూఇటూ చూసి ఎదురుగా పెద్దపెద్ద సీతాఫలాలు చూసి కోసుకొని మంచి రుచిగా వున్నందున కడుపునిండా తినేశారు శాస్త్రిగారు! అలా రెండు సీతాఫలాలు తిని కడుపు నిండా నీరు త్రాగేశారు!

సాయంత్రం కాగానే ఒళ్ళంతా సలపరం అనారోగ్యత, సీతజ్వరంలాగా రావడం దానితో విరోచనం కాక బంధించబడి, రెండురోజులు విపరీతంగా బాధపడడం జరిగింది! మాస్టర్‌గారికి వెంటనే టెలిగ్రాం ఇచ్చారు — తమ ఆర్తిని వెళ్ళబోసుకుంటూ, ఆరోగ్యం ప్రసాదించమని! ఐనాసరే 24 గంటలు దాటినా శాస్త్రిగారి బాధ నిమ్మళించలేదు!

అక్కడ మాస్టర్‌గారు ఊరిలో లేనందున శాస్త్రిగారిచ్చిన టెలిగ్రాం తెరవకుండా పడివున్నది! ఆమరునాడు మాస్టరుగారు రాగానే టెలిగ్రాం కాయితం విప్పిచూడగానే మాస్టరుగారు నవ్వి "శాస్త్రికి అంతా చక్కబడు తుంది ఇప్పటినుంచీ!" అని ఆరోజు టైము, తేదీవేసి జవాబు రాయించారు! కాని మహదాశ్చర్యం ఏమిటంటే అక్కడ **శాస్త్రిగారికి ఈ ఉత్తరం చేరకముందే** తక్షణమే వారి **అనారోగ్యం శమించి** సాఫీగా రెండు విరేచనాలై వెంటనే టెంపరేచర్ తగ్గింది! సుఖనిద్ర పట్టింది! కరకరా ఆకలివేసింది!

అంతేకాక సకలానికల్లా వేడిభోజనం లభించి శాస్త్రిగారు పూర్తిగా

స్వస్థులయ్యారు! మరునాడు మాస్టరుగారి ఉత్తరం అందుకున్న శాస్త్రిగారు సరిగ్గా తమకు రోగం అకస్మాత్తుగా తగ్గిన టైమూ, తేదీ సరిగ్గా మాస్టరుగారు జాబురాయించిన టైముకే వారి రిప్లై అందకముందే తగ్గడం చూసి ఆశ్చర్య పోయారు! మాస్టరుగారి అనుగ్రహ శక్తి కరెంటువలే పనిచేసింది!

ఇంకోసారి మరొక యోగమిత్రుడు దూరాన ఓ చిన్నగ్రామంలో పని చేస్తుండేవాడు — ఏస్కూలు మాస్టరువంటిదో చిన్న ఉద్యోగం! ఒకనాడు గ్రామంలోని రైతులందరూ కలిసి ఒకవ్యక్తిని చేతులమీద మోసుకొనివచ్చి ఇంటిముందు దించారు! అప్పటికే అతడు నాడి శ్వాస అందనిస్థితిలో దాదాపు మరణించినట్టుగా వున్నాడు!

విషయం ఏమిటని ప్రశ్నించగా పొలంలో పనిచేస్తుంటే పాము కరిచిందని అతడు గుర్తించేసరికే ఆలస్యమైపోయిందని మిగతా రైతులు పరిగెత్తుకుని వచ్చేసరికి నోటివెంట నురగ కక్కుకుని పడిపోయాడు! గ్రామంలో దగ్గరలో ఏ ఆస్పత్రిలేదు! మీరే ఇతడిని తప్పక బ్రతికించా" లని ఇంటిముందు దించారు!

ఆ యోగమిత్రునికి పైప్రాణాలు పైనే ఎగిరిపోయినట్లైంది! దాదాపు శవంలా వున్నాడు! తనకా మాస్టరుగారి యోగాకోర్సుతప్ప మరే పాముమంత్రం రాదు! ఒకవేళ ప్రేయరుకు ఇతడు తిరిగి జీవించకపోతే ఈ గ్రామస్థులు తనపైనపడి చావకొట్టినా ఆశ్చర్యంలేదు! మూర్ఖులతో ఏదివచ్చినా తంటానే! ఇలా అనుకుంటూనే ఆరోగిని ప్రేమతో తాకి మనసులో మాస్టరుగారిని ఏంతో తీవ్రంగా తలచి ప్రేయరుచేశారు! నిముషాలు గడుస్తున్నాయి! రోగి నల్లబడిపోతున్నాడు! శ్వాసకూడా ఆగిపోయిందా, ఆడుతున్నదా తెలవకుండా వున్నది! రెండునిముషాలు ఆగి మళ్ళీ రెండవసారి గట్టిగా మాస్టర్‌గారికి నమస్కరించి ప్రేయరు చేశాడు! అంతే! మరి రెండునిముషాలలో శరీరం

వేడెక్కసాగింది! అయిదునిముషాలలో కాంతి తేజస్సు కలిగి శ్వాస నిలకడగా పనిచేస్తోంది! మరి రెండునిముషాలలో అతడు విషాన్ని కఫం కలిగిన ద్రవాన్ని కక్కేసి మామూలుగా శ్వాసపీలుస్తూ కాళ్ళూచేతులు విదిల్చికొట్టాడు! ఆపైన లేచికూర్చుని ఒళ్ళు విరుచుకుంటూ అందరినీ వింతగా చూశాడు! రోగి బ్రతికాడు — తనే ఆనందంగా ఇంటికి నడుచుకుంటూ వెళ్ళాడు! రైతులంతా యోగమిత్రుని కాళ్ళపై పడ్డారు మీరే దేవుడంటూ!

ఇందులో తన ప్రయోజకత్వం ఏమీలేదనీ, మాస్టర్‌గారి దివ్యానుగ్రహమే అతడిని బ్రతికించిందని ఎన్నివిధాల చెప్పినా వారు వినిపించుకోలేదు!

ఇది జరిగిన కొన్నాళ్ళకు మన యోగమిత్రుడు కుంభకోణం మాస్టర్‌గారి వద్దకు మిగతా శిష్యులవలే యోగాగోష్ఠి (Masters Call) కి వెళ్ళడం జరిగింది! అందరి యోగమిత్రులూ సమావేశమై సామూహిక ప్రార్థనలు వంటి కార్యక్రమాలు పూర్తి కాగా అందరినీ భోజనాలకు లెమ్మన్నారు! మాస్టర్‌గారు నవ్వుతూ ఛలోక్తిగా, ఉల్లాసంగా భుజిస్తున్నారు శిష్యులందరితో కలిసి! అందరూ భుజిస్తుంటే ఉన్నట్టుండి మాస్టర్‌గారు భోజనం మధ్యలో మన యోగమిత్రునివైపు తిరిగి పెద్దగా నవ్వుతూ ఇలా అన్నారు :

"ఏమిరా! నువ్వు నాకు **చెముడుగాని వచ్చిందని అనుకుంటున్నావా?** ఏమిటి సంగతి?" — అన్నారు! కాస్త గట్టిగా గర్జిస్తున్నట్టుగా!

మనవాడు భోజనం మధ్యలోనే ఆగిపోయి విస్తుపోయి నిలబడిపోయాడు; మాస్టరుగారికి చెముడేమిటి? తానేమి పొరపాటుచేశాడో తెలియక! అప్పుడు మాస్టర్‌గారు తిరిగి మనవాడిని ఉద్దేశించి మిగతా శిష్యులందరితోనూ "వీడు తనవద్దకి పాము కరిచినవాడిని ఎవరో తీసుకొనివస్తే నాకు ప్రేయరుచేసి నమస్కరించాడు! మళ్ళీ అంతలోనే ధైర్యంచాలక **రెండవసారి**

**కూడా** మళ్ళీ ప్రేయరుచేశాడు — నేను ఆ రోగిని బ్రతికించేలోగానే! అందుకే అడుగుతున్నాను రెండుసార్లు ప్రేయరు ఎందుకుచేశావురా! నాకేమైనా చెముడా? వినపడదా? ఒకవేళ నీప్రేయరు వినపడకపోతే నిజంగానే నాకు చెముడు వున్నట్లైతే రెండవసారి ప్రేయరుచేస్తే మాత్రం ఎలా వినపడు తుందిరా?" అంటూ!

తన యోగమిత్రులంతా **రెండుసార్లు** ప్రేయరుచేయడం **అనవసర** మని ఆత్మవిశ్వాసంతో యోగమిత్రుడు పనిచేయాలని మాస్టరుగారు ఛలోక్తిగా సూచించారు! ఒక మంత్రంలాగా వెయ్యిసార్లు ప్రేయరు చేయాలంటే దేవుడికేమైనా చెము డొచ్చిందా? మనం ప్రేయరుకనుక సరిగ్గాచేస్తే ఒక్కసారికే సమాధానం రావాలి — అన్నారు! దాంతో అక్కడున్న యోగమిత్రులందరికీ కూడా అది చక్కటి గుణపాఠం!

ఇలాంటి అనుభవాలెన్నో మాస్టర్‌గారి శిష్యులకి జరగటంద్వారా మాస్టర్‌గారి సర్వజ్ఞతనూ ప్రతీవిషయాన్నీ గమనిస్తున్నారని తెలియకనే తెలియ చెప్పారు!

అలానే ఇంకోసారి మాస్టర్‌గారి మీడియం బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కుంభకోణం వెళ్ళినపుడు తనకు యోగదీక్షనిచ్చిన విధంగానే తమ తల్లిదండ్రులుకూడా చాలా వృద్ధులైనందున వారు తరించడానికి అవసరం కనుక వారికికూడా మాస్టర్‌యోగాన్ని ఉపదేశించమని కోరారు!

దానికి మాస్టర్‌గారు నవ్వి — "నీతో నిత్యం నివసించే సహధర్మచారిణి ని విడిచిపెట్టి కష్టసుఖాలు పంచుకునే ఇల్లాలికి ఇనీషియేషన్ అడక్కుండా ముసలివారైన తల్లిదండ్రుల గురించి ఎందుకు దిగులుపడుతున్నావు? వారి శరీరం ఇప్పటికే ముసలితనంచేత క్షీణమైవున్నాయి! పైగా ఈ భూమిమీద వారికింక ఎంతో టైములేదు!" — అని, నీభార్యకు ఉపదేశం చేయించుకో మని ఆజ్ఞాపించారు!

శాస్త్రిగారు బ్రతిమాలి తల్లిదండ్రులు వృద్ధులైనందునే వారు కడసారి తరించేందుకు ఉపదేశం చేయమని కోరినా లాభంలేదన్నారు! అంతేకాక మాస్టరుగారు — "నీ భార్యకి ఇనీషియేషన్ ఇవ్వడంద్వారా రాబోయే నీ వంశంలోనివారు పదితరములు, నీ వెనుక పదితరములూ తరిస్తారు!" అని అభయమిచ్చారు!

మాస్టర్‌గారు ఆజ్ఞాపించిన విధంగా శాస్త్రిగారు తమ భార్యను తమతో తీసుకొని వెళ్ళడం జరిగింది! అప్పుడు మాస్టర్‌గారు వీరి భార్యకికూడా ఉపదేశాన్ని శాస్త్రిగారిచేత మాస్టర్‌యోగదీక్ష నిప్పించారు! అది జరుగుతున్న సమయంలో ఆమెకు గొప్ప తేజస్సు ప్రశాంతత ప్రాణశక్తి, సత్తువా కలిగినట్లై, ఆయన భార్యకి ఉపదేశంచేసే టైములో శాస్త్రిగారికి సూక్ష్మరూపాలలో వారి తల్లిదండ్రులు ఆపైన తాతగారూ, పూర్వీకులు అంతా — నిచ్చెనవలే ఒకరిపై ఒకరు వెలుగుతూ దర్శనమిచ్చారు! తద్వారా మాస్టర్‌గారి యోగంచేత పూర్వీకులు పదితరాలు తరిస్తారన్న విషయం శాస్త్రిగారికి ప్రత్యక్షంగా చూపించారు మాస్టరుగారు —

"దశపూర్వేషాం దశాపరేషాం" — అన్న పూర్వసూక్తిని యదార్థంచేస్తూ!

ఇలా మాస్టర్‌గారు చూపిన అనుగ్రహాలు ఎన్నో ఇంకా ఇప్పటికీ ఆశ్చర్యంగా పనిచేస్తూనే వున్నాయి!

# II

## "రోగంనుంచి విముక్తి - 'యోగం'తో శ్రీరామరక్ష !"

క్రిస్టమస్ సెలవకలని కుంభకోణం వెళ్ళినపుడు ప్రభాకరశాస్త్రిగారు మాస్టర్ CVV గారిని డిసెంబర్ 1916లో దర్శించుకున్నారు. అప్పుడు వారి

దివ్యానుభవం వారికి పరిపూర్ణ ఆరోగ్యాన్నీ — రోగంనుంచి శాశ్వత విముక్తినీ ఎలా కలిగించిందన్న విషయం ఆసక్తిగొలిపే సన్నివేశం!

ఒకరోజు నలభై, యాభై నీళ్ళవిరేచనాలతో లేచికూర్చునేందుకు కూడా ఓపికలేని స్థితిలో నీరసం, నిస్సత్తువా ఆవరించి శల్యావశిష్టుడై ఉన్నారు ప్రభాకరశాస్త్రిగారు. మహదేవయ్యగారనే సహశిష్యులు సగ్గుబియ్యపుజావను త్రాగించారు. ఐనా వారి పరిస్థితిలో చెప్పుకోతగ్గ మార్పేమీ కనబడలేదు. ఆరోజే ఉద్యోగ విధులకు చేరాల్సినరోజూ — ఇక అదనంగా సెలవు మంజూరీకి ఏమాత్రం వీలులేని పరిస్థితి! ఈ విషయం మాస్టర్ CVV గారి దృష్టికి వచ్చింది. వెంటనే రామచంద్రయ్యగారనే ప్రధాన మీడియంను పిలిచి **'ప్రభాకరునికి విగర్ సప్లై ట్రీట్‌మెంటునివ్వు!'** — అంటూ ఆదేశించారు.

మంచంమీద బల్లిలా అంటుకుపోయి పాలిపోయిన మొహంతో పడుకున్న ప్రభాకరుని రామచంద్రయ్యగారు స్పృశించి మాస్టర్‌యోగా కోర్సులలో విగర్ (ప్రాణశక్తి)ని సమకూర్చే ఇంగ్లీషుకోర్సును యిచ్చారు.

అంతే! ఒక్కసారిగా కరెంట్‌షాక్ తిన్నట్లు ఉలిక్కిపడ్డారు ప్రభాకరులు! నులివెచ్చని ఓశక్తి శరీరమంతా నాడుల గుండా, వెన్నుపూసలోంచీ ప్రసరించి ఆయనలో తక్షణమే జవసత్వాలను, బలాన్నీ, త్రాణనూ సమకూర్చి లేచి కూర్చునేలా చేసింది! పచ్చిపుండులా మారిన అరుస్తున్న కడుపులోని ప్రేవులు నెమ్మదిగా మామూలు కాసాగాయి. కడుపులోని మంటా, **బాధా** తగ్గి కరకర మంటూ ఆకలి వేయసాగింది. పునరుజ్జీవం పొందిన శక్తివల్ల — ఉత్సాహం తో స్ప్రింగులా లేచి మంచంమీంచి దూకి, క్రిందకు దిగి నిలబడ్డారు.

కృతజ్ఞతతో మాటపెగలక శ్రీవారి పాదాలపై వ్రాలిన ప్రభాకరశాస్త్రిగారితో ఏమీ జరగనట్లే మాస్టర్‌గారిలా అన్నారు :

"ప్రభాకరా! నీకు రైలుకి వేళవుతున్నది ఇహ బయల్దేరు! ఇంకో ముఖ్యవిషయం. ఈనాటినుండీ అనారోగ్యంతో నీవెప్పుడూ బాధపడ నవసరం ఉండదు! ఇది మా ఆజ్ఞ!

ఎప్పటిమాదిరిగా ప్రతీవారం యిక్కడికి వచ్చేందుకు నీవు ఇక శ్రమతీసుకోనక్కరలేదు. నీకు తగినంత శెలవు లభించితే తప్పక రావచ్చు.

"అంతేకాదు! ఇకపైన నీకు ఆహారంపైన ఆంక్షలేవీ అవసరం లేదు! నోటికి రుచించినంతా నిర్భయంగా భోంచేయవచ్చు.!! ఉదయాన్నే బలవర్ధకమైన ఆహారం తీసుకోవడం మాత్రం అశ్రద్ధచేయకు! సాయంత్రాలు అల్పాహారం తీసుకోవచ్చు! రాత్రుళ్ళుమాత్రం పెరుగు, మజ్జిగలకు బదులు పాలను తీసుకుంటే శ్రేష్ఠం! మీ లివర్ పూర్తిగా స్వస్థత నొందింది. ఆకలి కూడా బాగుంటుంది!"

ఈ అపూర్వ సన్నివేశం తరువాత — తమ అరవై రెండోఏట మాస్టర్ గారిలో ఐక్యమయ్యేవరకూ — ఏనాడూ అస్వస్థత అన్నది ఎరుగరు ప్రభాకర శాస్త్రిగారు! దాంతోపాటూ జీవితాంతం అస్వస్థులైన అనేకమంది అభాగ్యులకు రోగనివారణచేసి మాస్టర్‌యోగం ప్రేయర్సుద్వారా ఆరోగ్యాన్ని చేకూరేలా సేవాభావంతో గడిపారు. వారి ప్రేయరువల్ల స్వస్థతపొందిన అనేకమంది అనుభవాలను ప్రభాకర యోగమిత్రమండలిలో రిజిస్టర్లలో రికార్డుచేశారు. అలాంటివాటిల్లో మచ్చుకి ఒకటి :

## అనుభవాలు :

మేతకు ఆకులు కోయడానికి చెట్టెక్కిన ఒకకుఱ్ఱవాడు పైనుంచి క్రిందపడటంతో కాలు ఎముక విరిగింది. అతడి తండ్రి రిక్షాలాగి జీవించే

వాడవటంచేత భుక్తి గడవటమే గగనమైన పరిస్థితుల్లో ఇక పిల్లవాడికి వైద్యం చేయించటానికి చిల్లిగవ్వకూడా మిగలని దైన్యస్థితి.

ఆ పిల్లవాడు కదల్లేక, నోటివెంట మాటకూడా పెగలని స్థితిలో — ఎవరినీ గుర్తించకుండా బిక్కచూపులు చూస్తున్నాడు. వెన్నెముకకు దెబ్బ తగలటంవల్లనేమో కాళ్ళూచేతులూ వంకర తిరిగిపోయాయి. మూతి ఓపక్కకు తిరిగిపోయింది. నల్గురు మనుషులు తమ చేతులను ఊతంగా పట్టుకొని అతణ్ణి స్ట్రెచ్చరుపైన తెచ్చినట్లుగా మోస్తూ తెచ్చారు.

ఓ బియ్యపు మూటను ఉంచినట్లుగా ఆ చిన్నవాణ్ణి ప్రభాకరశాస్త్రిగారి ఎదుటతెచ్చి, దించారు. అతణ్ణిచూసిన శాస్త్రిగారు అవాక్కైనారు. ఆతడి నిస్సహాయ తకూ, తండ్రియొక్క కటిక బీదరికం తోడై అత్యంత దయ నీయంగా వున్నది అతడి పరిస్థితి.

వెంటనే వాడికేమీ ఆహారంపడలేదన్న విషయం తృటిలో గ్రహించారు శాస్త్రిగారు. వంటింట్లోకి వెళ్ళి ఆవిర్లు కక్కే వేడి వేడి, కాఫీని కలుపుకు వచ్చారు. రెండు మూడు చెంచాలు అతడి నోట్లో నెమ్మది నెమ్మదిగా పోశారు. అతి కష్టంమీద గుటకవేయగలిగాడా బాలుడు. ఆ బాలుడి ప్రక్కనే పద్మాసనంలో కూర్చుని ప్రేయరుచేస్తూ అతడి స్వస్థతకై వ్యాకులతతో, శాస్త్రిగారు కళ్ళవెంట నీళ్ళు జాలువారు తుండగా మాస్టర్‌గారిని అతడి బాధానివారణకై అర్థించారు.

అలా రెండు-మూడు నిమిషాలు గడిచాయి! ఆ బాలుడి నోటివెంట సన్నటి మూలుగులాంటి శబ్దం వినవచ్చింది. నెమ్మదిగా ఓప్రక్కకి ఒత్తిగిల్లాడు. అతని గాయాన్ని నెమ్మదిగా ప్రేమతో నిమరసాగారు శాస్త్రిగారు! చేతితో తట్టుతూ మాస్టర్‌గారి కోర్సులను ఉచ్చరించారు స్పష్టంగా. ఆ బాలుడి వంట్లోకి చైతన్యం నెమ్మది నెమ్మదిగా ప్రసరిస్తూ అతణ్ణి లేచి కూర్చునేలాగా

శక్తివంతుణ్ణి చేసింది. కళ్ళలోంచి ఆనంద బాష్పాలు వస్తూండగా కృతజ్ఞతతో లేచి పాదాలనంటుకో బోయాడు!

మరో రెండుమూడు నిమిషాలు గడిచాక విరిగిన అతని ఎముక టక్-టక్ మన్న శబ్దంచేస్తూ యధాస్థానంలో అమరినట్లు సర్దుకున్నది. 'లేచి నిలబడు' అంటూ చెప్పగానే ఎంతో ప్రయత్నంమీద నిలబడి — మళ్ళీ కుప్పలా నేలకు కూలిపోయాడు.

మూర్తీభవించిన శక్తిలా నిలబడ్డ ప్రభాకరశాస్త్రి **"లే! లేచి నిలబడు!"** అంటూ దృఢస్వరంతో హెచ్చరించారు! అతికష్టంమీద నిలుచుని రెండు అడుగులు తడబాటుతో నడిచాడు. ఐనా శాస్త్రిగారికి సంతృప్తికలగలేదు! హృదయంలోంచి మాస్టర్‌గారి కరుణకూ, తక్షణమే ప్రసరించిన అనుగ్రహానికీ కృతజ్ఞతా ఆనందమూ పెల్లుబికి వచ్చాయి!

**"లే!! లేచి నడువు!"** అంటూ మూడునాలుగుసార్లు ఆదేశించారు. ఆ ఆదేశం చెవినబడిన ప్రతీ తడవా అతనిలో మార్పు — మరింత ప్రస్ఫుటమై మామూలుగా నడవగలిగాడు.

"మీ అబ్బాయినిక ఇంటికి తీసుకువెళ్ళవచ్చు!" అన్న ప్రభాకరశాస్త్రిగారి మాటలకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి అతడి చేతులను తన భుజాలపై ఆసరావేసుకుని తీసుకెళ్ళబోయాడా తండ్రి శాస్త్రిగారు తీవ్ర స్వరంతో :

'వీల్లేదు! ఆతడు స్వయంగా నడవాలి!' — అన్న మాటలకు భయం తోనూ, ఆనందోగ్వేదంతోనూ ఉక్కిరిబిక్కిరైనారు అక్కడున్నవాళ్ళు!

మంత్రంలా శాస్త్రిగారి మాటలు పనిచేయటమూ తండ్రివెంట ఆ బాలుడు మామూలుగా నడిచివెళ్ళటమూ కళ్ళముందటే జరిగిన మహాద్భు

తంగా తోచిందందరికీ! వారంతా శాస్త్రిగారి పాదాలపై మోకరిల్లబోగా 'ససేమిరా!' అంటూ అందుకు ప్రభాకరశాస్త్రిగారు ఒప్పుకోలేదు! — "ఈ మహత్తంతా మాస్టర్‌గారిదే! మరెవరూ ఆస్థానానికి సరిరారు! మనమంతా మీడియమ్స్‌మే! ఆయన శక్తిప్రసారానికి మాధ్యమాలవంటివారం మాత్రమే! పరబ్రహ్మ స్థాయినుంచి ప్రజ్ఞామయ శక్తికిరణాలను స్వయంగా ప్రసరించగల వారు వారే!" అన్నారు — ఆనందభాష్పాలతో!



## 17

# ఇంగ్లీషులో మంత్రాలు

ఇంగ్లీషులో మంత్రాలేవిటి ? అని చాలామందికి ఆశ్చర్యం వేయడం సహజమే! 'మంత్రా'లంటే సామాన్యంగా అందరూ అనుకునేలా వందలూ వేలూసార్లు జపంచేసే **మంత్రాలు** — కాదు ఇవి! ఇంగ్లీష్‌లో కేవలం మూడుసార్లు మాత్రమే ఉచ్చరించితే చాలు! ఒక అద్భుతమైన కరెంటువంటి **"శక్తి"** శరీరంలో ఉద్భవిస్తుంది!

ఆయుర్వేదమందులు నెలలతరబడి వాడితే వచ్చే ఫలితం, హోమియోపతీ మందులు అతి తీవ్రమైన 'పొటెన్సీ'లలో పంచదారమాత్రలా నోట్లో వేసుకున్నంతనే క్షణాలమీద రోగం మాయమైనట్లే ఈ నూతన యోగం లోని ఇంగ్లీషుమంత్రాలు అనబడే ''కోర్సు'లూ పనిచేస్తాయి! అయితే ఇది చాలా ఆశ్చర్యకరమైన **నూతన యోగ**విధానం! ఈ కోర్సుల గురించి కొంత పరిచయం అవసరం!

## మాస్టరుగారికి 'ప్రార్థన' :

ఈ యోగమార్గంలో సాధనకు ముఖ్యమైన మెట్టు "నమస్కారం!" సాధనలో ప్రతీరోజూ ఉదయం సరిగ్గా 6 A.M. లకు సాయంత్రం 6 P.M. లకూ ఈ యోగసాధన చేసేవారు స్నానంచేసి కూర్చుని మాస్టరుగారికి "ప్రేయరు" చేయాలి!

ఈ 'ప్రేయరు'కు ముఖ్యమైన నియమం — నిరాహారంగా ప్రేయరు చేయరాదు అలాచేస్తే — చాలా ప్రమాదం! అంటే ప్రేయరు చేసేముందు రెండు ఇడ్లీలు నెయ్యి వేసి తేలికగా టిఫిన్‌గా చేయాలి! కాఫీగాని, వేడిపాలు గాని పుచ్చుకుని నోరూ, కాళ్ళుచేతులు శుభ్రంగా కడుక్కుని — ప్రేయరుకు కూర్చోవాలి!

విధిగా మాస్టరుగారి ఫోటో ప్రేయరులో ఎదురుగుండా వుండాలి! రెండు మూడు అగరు వత్తులు వెలిగించి పూర్తిగా దీర్ఘమైన శ్వాసను పీల్చి నిలపగలిగినంతసేపు ప్రాణాన్ని నిలపాలి! ఆ సమయంలో కళ్ళుమూసుకుని గాని, తెరుచుకునిగాని, మాస్టరుగారి రూపంపైనే మనసును నిలపాలి! ఆతర్వాత దీర్ఘంగా శ్వాసను విడిచి కొంత వ్యవధి తీసుకున్నాక — **ఓంకారం** పూర్తిశ్వాస అయ్యేదాకా **ఉచ్చరించి** ఆ నాదాన్నే వింటూ శ్వాస పూర్తిఅయ్యే దాకా చెయ్యాలి! అలాగ మూడుసార్లుచేసి నిశ్శబ్దంగా కూర్చుని మాస్టరుగారి వైపు తిరిగి నమస్కారం చేసి ఈక్రింది ప్రార్థనను మనస్ఫూర్తిగా సంకల్పంతో చేయాలి!

### "మాస్టర్ CVV, — నమస్కారం!"

(ఇది పదిహేనునుండి ఇరవై సెకండ్లు ఖాళీ ఇచ్చి మళ్ళీ తిరిగి ఇలాగే ఉచ్ఛరించాలి!)

ఇలా — మూడుసార్లు మాస్టరుగారికి నమస్కరించి 'ప్రేయరు' ప్రారంభం చేయాలి! ఆతర్వాత ఏమీ చేయరాదు — నిశ్శబ్దంగా కూర్చోవాలి!

మనసు పరిపరి విధాల పోయినా దానిగురించి ఆందోళన పడరాదు! మాస్టరుగారే దానిని కంట్రోలుచేస్తారు! ఇలా ప్రేయరు చేసింతర్వాత శరీరంలో కరెంటుపెట్టినట్టు మాస్టరుగారి శక్తి ప్రసరించడం అనుభవంలో కనిపిస్తుంది! అదంతా అనుభవిస్తూ మనసుతోనే గమనిస్తూ పూర్తి శరణాగతి భావంతో (మనమేమి చేయకుండానే!) కూర్చోవాలి!

వెన్నుపై చీమలుపాకినట్టో లేక తేలికగా కరెంటు ప్రవహిస్తున్నట్టో, లేదంటే నీళ్ళతోడే మోటారు పనిచేస్తున్నట్టో స్పందన శరీరంలో కలగవచ్చు! వాటికోసమై ఊహించరాదు! అలాంటివి కల్పించుకోరాదు! ఒకవేళ, మన గమనికకు అందని మార్పులుఏమీ లేకపోయినా మనం విచారపడరాదు! ప్రేయరులో కలిగే యోగానుభూతులు ఆ సాధకుడి పూర్వజన్మను బట్టి ఒక్కొక్కరికి ఒక్కోలాగ మారుతూవుంటాయి! ముఖ్యంగా — ప్రస్తుతం నడిచేది ఎన్నోజన్మ అన్న దానిమీద, వారి ఆత్మయొక్క అనుభవం ఆధారపడి వుంటుంది!

ఒక్కోసారి ప్రేయరులో కూర్చున్నప్పుడు ఎవరో టెలిఫోనులో మాట్లాడితే వినపడ్డట్టు మాటలంటంగాని శబ్దాలుకాని లేక లైట్లు పెట్టినట్టు రంగులుగాని ముందుగా మనం నిర్ధారణ చేయలేని అనుభవాలు ఏవైనాసరే, మాస్టరుగారు ఏంసంకల్పిస్తే ఆ ప్రకారం జరుగుతాయి! ఒక ముఖ్యవిషయం. — ప్రేయరు జరుగుతున్నంతసేపూ కళ్ళు తెరవాలనిపించదు! ఒకరకమైన తన్మయత్వం, హాయి, విశ్రాంతి, ఫీలవుతాము. అది ఎట్టి ప్రయత్నమూ మననుంచి లేకపోయినాసరే (ప్రత్యేకించి ప్రయత్నం చేయరాదు) దానంతటదే జరుగుతుంది.

ఇలాగ ప్రేయరు పూర్తికాగానే మనలో జరిగే యాక్షన్ (Action) లేక కరెంటుపెట్టిన వైబ్రేషన్ — ఆగిపోతుంది! అప్పుడే ప్రేయరు పూర్తిఅయిన అనుభవం కలిగి లేచిపోదామన్న సంకల్పం రాగానే లేవాలి!

## ప్రేయరు తర్వాత :

ప్రేయరు పూర్తికాగానే హడావుడిగా బజారుకో లేక బయట పనులకో పరిగెత్తరాదు! చల్లని నీళ్ళతో కాళ్ళూచేతులూ, ముఖమూ కడుక్కుని వేడివేడి కాఫీతాగి 'ఫ్రెష్-అప్' (Fresh-up) అయి మన నిత్య కార్యక్రమంలోకి అప్పుడు దిగాలి!

ఇది మాస్టరుగారి యోగంలో ప్రాథమిక ప్రేయరు! ఇది సంవత్సర కాలం చేశాక మస్టరుగారి కోర్సులలో క్రమం ప్రకారం 1) **మెర్చురీ** (Merchery) కోర్సు 2) **ఆరీ కోర్సు** (Auri Course) 3) **హల్లర్** (Haller Course) కోర్సులు చేయాలి!

ఆతర్వాత **'ప్లెంటీ-ప్రాణా'** (Plenty Prana) **లార్డియన్స్** (Lordians) కోర్సు, (జాతకంలోని దోషాలకు) రెక్టిఫికేషన్ కోర్సులూచేయాలి!

ఈ కోర్సులు చేసి యోగ పరిపూర్తి పొందిన అనుభవజ్ఞులైన మీడియమ్స్ వద్ద కేవలం కళ్ళుమూసుకుని కూర్చుని మాస్టరుగారిని తలచుకుని ప్రేయరులో కూర్చుంటేనే చాలు — ప్రతీవారూ పైకోర్సులన్నీ చేయాల్సినపనే లేదు!

ఈ కోర్సులు చేసిన మీడియంలవద్ద గతంలో వేటూరి ప్రభాకరశాస్త్రి గారివద్ద ప్రేయరులో కూర్చున్న వారివలెనే అప్రయత్నంగా మాస్టరుగారికి నమస్కరించి పూర్తిగా శరణుపొందినంతనే అన్ని అనుభవాలూ వారే ఇస్తారు!

అనుభవజ్ఞులైన మీడియంల ద్వారానే మాస్టరుగారి ప్రేయర్లు చేయాలి

గాని కేవలం పుస్తకాలు చదివి చేయరాదు! అందుకని మిగతా 250 కోర్సులూ ప్రతీవారికీ ఇవ్వటం క్షేమకరం కాదని ఈ అధ్యాయంలో వాటన్నిటినీ ఎలాచేయాలో వివరాలు ప్రచురించటం లేదు! ఈ యోగమార్గంలో ఆసక్తికలవారు స్వయంగా సలహాను పొంది ఆతర్వాతే ఈ యోగం చేయాలి!

ఈ యోగం మొదలుపెట్టటానికి కొన్ని నియమాలున్నాయి!

వైద్యానికి నయంకాని దీర్ఘరోగాలు (సుఖరోగాలవంటి — క్షయ-క్యాన్సరూ) ఉన్నవారు ఈ యోగం చేయరాదు! సారాయి, విస్కీ, బీరువంటి మత్తుపదార్థాలు సేవించేవారు మాస్టరు యోగంలో కూర్చోరాదు! కోర్టుకువెళ్ళి కేసుపెట్టడం, పోలీసుల సాయంతో నేరస్థులను అనుమానం వున్నవాళ్ళని కొట్టించి, బాధించటంవంటి పనులు చేయరాదు!

మాస్టరు CVV గారి యోగంగురించి అందులోని అనుభవాలగురించి బహిరంగంగా చర్చించడంగాని, విమర్శించడంకాని, ఇతరులముందు గొప్ప కోసం ప్రచారంగాని ఎప్పటికీ చేయరాదు. ఇతర యోగ మార్గాలనూ వారివారి సద్గురువులనూ ఇతర మతస్థులను ఎట్టి పరిస్థితిలోనూ విమర్శించరాదు! దూషించరాదు!

అందరికీ తగు గౌరవం ఇచ్చి వ్యవహరించవలెను! తనకు తెలియనట్టివి గొప్పకోసం ప్రగల్భంకోసం అందరిముందూ మాట్లాడరాదు! ఎవరికైనా ఆపదలో వున్నవారికి తక్షణ సహాయం కావల్సివస్తే అది తన శక్తికి లోపలే వున్నసహాయం అయితే కుంటిసాకులు చెప్పి తప్పించుకోరాదు — వెంటనే సాయంచేయాలి!

అందువల్ల మనం గొప్ప ఆపదలో చిక్కుకున్నపుడు మనకికూడా దైవసహాయం లభిస్తుంది! అనవసరంగా అప్పులు చేయరాదు! ఇతర్ల బాకీలకు పూచీలు, జవాబుదారీ వుండరాదు! తన ఆదాయానికి సరిపోయినంతవరకే తన ఖర్చులను సరిదిద్దుకోవాలి! లేదా ఇతర్లకు సహాయంగావుండే

పని ఒకనికి నష్టంలేని పని ఏదైనాచేసి దానితో ఏదన్నా సంపాదించుకోవచ్చు! వివాహితులైనవారు న్యాయంగా గృహస్థధర్మాన్ని పాటించాలి! అవివాహితులు బ్రహ్మచర్యాన్ని విధిగా అమలుచేయాలి! వివాహేతర సంబంధం కలవారు ఈ యోగంలో కూర్చోరాదు! నల్లమందు వంటి మత్తుపదార్థాలు సేవించే వారు, మాంసం, గుడ్డు, చేపవంటి నీచు పదార్థాలు తినేవారూ, ఈ యోగానికి నిషేధం! మరీ ముసలివారు, బలహీనులు, రోగిష్టివారు ఈయోగం చేయరాదు! ఊరికే ప్రేయరులో నలుగురితోపాటు కూర్చోవచ్చు!

శక్తిపూజలు, శ్రీచక్రార్చన, తాంత్రికపూజల వంటివి చేయటం — అందులో చేరటమూ ఈ యోగమార్గంలో వున్నవారికి నిషేధం! ఆ నిషేధం వినకుండా పూర్వం డా॥ గాలి బాలసుందరరావుగారు శక్తిమంత్రాలు చేస్తూనే, మాస్టరుగారి ప్రేయరు చేయటంవల్ల ముందుగా మాస్టరుగారినుంచి హెచ్చరిక వినపడింది! ఆతర్వాత వినకుండా అదేప్రకారం చేస్తుంటే **తలలో రక్తనాళం చిట్లి** — మెదడుకు పక్షవాతంవచ్చి మరణించినంత పనైంది! చివరికి ఎలాగో కొనవూపిరితో బ్రతికారు — మాస్టరుగారి అనుగ్రహంతో!

కాబట్టి ఇతర తాంత్రిక, మాంత్రిక, హఠయోగ మార్గాలు **మాస్టరు CVV యోగంతో** కలిపి **ఎప్పటికీ చేయరాదు!**

ఏదోఒక మార్గమే అనుసరించాలి! రెండుగుర్రాలపై స్వారీ నిషేధం, ప్రమాదం!

నియమాలు అనుసరిస్తూ అతిస్వార్థం లేకుండా ప్రశాంత జీవితం సంతృప్తితో గడిపేవారికి **మాస్టర్** CVV గారు **పది సంవత్సరాలలోనే** — జన్మరాహిత్యం గ్యారంటీ ఇచ్చారు! అంటే పది వరుసగా సంవత్సరాలు ఈయోగం చేసినవారికి తిరిగి జన్మవుండదు! ముక్తి మాస్టర్‌గారిచే ప్రసాదించ బడుతుంది!

ఇవి, ముఖ్యమైన మాస్టర్‌యోగ విశేషాలు!

## 18

# "యోగానుసంధానం" - "ప్రేయరు"లో ప్రత్యక్ష అనుభవం!!

ఇప్పటివరకూ **మాస్టర్ యోగం**గురించీ, మాస్టర్‌గారి జీవితవిశేషాల గురించీ, యోగశాస్త్ర మూలసూత్రాలగురించీ కొంత తెలుసుకున్నాం! కాని, మీలో చాలామందికి 'అసలు మాస్టర్ యోగంలో కూర్చుని ఏమిటిచేస్తారు? అసలీ ఇంగ్లీషుమంత్రాలను ఉపయోగించేదెలాగ? ప్రేయర్ (Prayer) లో కూర్చుని ఏంచేస్తారు?' అన్న కుతూహలం సహజంగానే వుంటుంది! అలానే మాస్టర్ యోగాప్రేయరు చేసే వాతావరణం ఎలావుంటుంది? అక్కడ ఈ కోర్సు (Courses) ల ప్రకారం ప్రార్థనచేసే వారికి **కలిగే అనుభవాలు** ఏమిటో ఒకసారి ప్రత్యక్షంగా కళ్ళతోచూస్తేనే పూర్తిగా అవగతమౌతుంది. సరిగ్గా ఇప్పుడు, అదేచేద్దాం!

గతంలో నేను 1969 ప్రాంతంలో మాస్టర్ C.V.V. యోగాన్ని మా ఇంట్లోనే నేర్పేందుకు సంవత్సరకాలం ఒక 'యోగాస్కూలు'గా నడిపాను. అప్పుడక్కడ అనేకమంది యోగమిత్రులకు (మాస్టర్‌గారి పర్మిషన్ ఉన్నవారికి

మాత్రమే) ఇంగ్లీషు కోర్సులు యివ్వడం జరిగింది. అప్పుడు జరిగిన ప్రార్థనా విశేషాలపై ప్రత్యక్షమైన రిపోర్టువంటిది కూడా ఒకటి "**కదిలేబ్రహ్మం - నడిచేదైవం**" అన్నపేరుతో ప్రచురించాము. దాన్నే యిప్పుడు మీ ముందుంచు తాను.

## యోగాస్కూలు :

'హైదరాబాదులోని సరస్వతీ నగర్‌లో అది ఒక విశాలమైన ఎత్తైన మేడ! ఆవరణలో ఎదురుగా పచ్చని పూలమొక్కలు! ఆ ప్రశాంత వాతావరణం ఒక 'ఋషివాటిక'ను తలపిస్తోంది! ఈశాన్యంగా ఒకపెద్ద గేటుతో ఒక ప్రభుత్వ భవనంవలే ఠీవిగా కనిపించే ఆ నివాసంలో **ఆధ్యాత్మికమూ - రాజరికమూ** రెండూ మేళవించి పోటీపడుతున్నాయి.

'లోపలికి అడుగుపెట్టగానే ఒక **తీవ్రమైన** ప్రశాంతత! (అది కేవలం '**నిశ్శబ్దత**' మాత్రమేకాదు!) బయటిధ్వనులు లేకుండావుండే **బాహ్య** నిశ్శబ్దత మాత్రమే కాకుండా — మనస్సులోకికూడా ఏ **ఆలోచనలూ రానివ్వని** తీవ్రమైన ప్రశాంతత! మనస్సులో **ఆలోచనలు** పూర్తిగా **శాంతించితే** ఎలావుంటుందో అలాంటి '**మానసిక మౌనం**' (Mental Silence) పొగమంచులా పేరుకుని ఆ ఆవరణంతా ఆవరించివుండి అందులోకి అడుగుపెట్టినవారి **ఆలోచనలన్నీ, కరిగి పటాపంచలైపోతాయి!**

'ఆశ్చర్యం!! ఎన్నో ఆలోచనలు! ఎన్నో అడగాలనీ, ఎంతో తెలుసుకోవాలనీ వచ్చే మనకి గేటుదాటి లోపల పాదంపెట్టగానే క్షణంలో మనస్సులోంచి అవన్నీ ఎగిరిపోతాయి! ఒక — యోగి గాఢంగా ధ్యానిస్తుంటే ఏర్పడే ప్రశాంతతవంటి నిశ్శబ్దత మనలను ఒక కరెంటులా పులకింపజేసేటంతటి **తీవ్రతతో** హృదయానికివచ్చి తాకుతుంది! ఆ ఇంట్లో వున్నది ఎవరో తెలియకపోయినా మనకే తెలియని భక్తిభావం కళ్ళవెంట కన్నీరు చిమ్మటం

— హృదయం లోతులనుంచి ఏదో గుడిలో కెళుతున్నట్టుంది! ఒక అగాధమైన అభిమానము, కారణం తెలియని ప్రేమా ముంచుకొస్తాయి!

## 'కుంభ'-యోగము :-

కారణం — అది, అలభ్యమైన **'కుంభ-యోగము'** (Aquarian Yoga) ను సాధనచేసే **'రహస్యమైన యోగా-స్కూలు'** (Secret Yoga School)!

ఆ లోపలినుంచి ఏదో అస్పష్టమైన తుమ్మెద నాదంవంటి ఓంకారం వినవస్తున్నది! క్రమంగా అది పెరిగి పెద్దదై సుస్వరంగా శ్రావ్యమైన తంబురనాదంలా పైకిలేస్తూ పడుతూ వేదం చదివే 'ఉదాత్త', 'అనుదాత్త' స్వరంలోని స్థాయిలలో ఓంకారం అదంగా ఉచ్ఛరించబడుతోంది! ఎవరా ఇంత కమ్మగా హృదయానికంటేలా హృద్యంగా **ఓం-కారం అనుసంధానం చేస్తున్నది?** అనుకుంటూనే వరండాలోకి ప్రవేశించగానే — లోపల ఒకహాలు! నేలమీద మూడుచాపలు పరచిఉన్నాయి. షుమారు అయిదారుగురు **'యోగ-మిత్రులు'** కళ్ళుమూసుకొని వొళ్ళుతెలియని తన్మయావస్థలో ముందుకీ వెనక్కీ ఊగుతూ ఓంకారం చేస్తున్నారు! వారి ఎదురుగా ఒక చిన్న ఎత్తుపీట (Stool) వేసివున్నది. దానిపై ఒక అగరువత్తుల గొట్టంలో సాంబ్రాణిధూపం ఘుమ ఘుమలూ, విభూతి పరిమళంతో కలిసి ఆ పవిత్ర వాతావరణాన్ని మరింతగా పరిశుద్ధంచేస్తూ ముంచెత్తుతున్నాయి!

ఆ పీటపై ఒక అపరిచితుడైన, గంభీర విగ్రహుడైన ఓ గురుమూర్తి ఎత్తైన ఫోటో కనిపిస్తోంది! ఆయనే **మాస్టర్ C.V.V.** గారు!

## 'యోగా-స్కూలు' :

ఆ ఎదురుగా సాధనచేస్తూన్న యోగమిత్రులు శ్రీవేదవ్యాస గురుదేవుల నుండి **'మాస్టర్ యోగాన్ని'** పొందగలిగిన అతికొద్దిమంది అదృష్టజీవులలో

**కొందరు** మాత్రమే! అవి 1969-71 మధ్యరోజులు, 'న్యూనల్లకుంట' అనబడే సరస్వతీ నగర్‌లోని శ్రీవేదవ్యాస స్వగృహంలో పైన ఏకాంతమైన హాలులో ఈ యోగసాధన రహస్యంగా నిత్యమూ జరిగేది!

'ఉదయమే సరిగ్గా 6.00 గంటలకు వీరంతా 'ప్రేయరు'లో కూర్చుంటారు! **ఇంగ్లీషులో మంత్రాలు** — వాటిని 'కోర్సులు' (Courses) అంటారు!! అందరు **యోగమిత్రులూ** దానిని ఒకేసారి ఉచ్ఛరించి శ్రీవేదవ్యాస గురుదేవుల ఆదేశాన్ని పొంది నమస్కరించి వారి సమీపంలో గుండ్రంగా వృత్తాకారంలో కూర్చుంటారు.

ఈ ప్రత్యేకమైన 'యోగాన్ని పొందిన యోగమిత్రులను **'మీడియమ్స్'** (Mediums) అంటారు. అప్పటి **యోగమండలిలో** ఈనాడు మనకి పరిచితమైనవారెవరూ **కనిపించరు!** కనిపించినా గుప్తంగా వుంటారు! వారుచేసే పని అతిరహస్యంగా నిగూఢంగా ఒకానొక యోగసాధనలో కనిపించే తీవ్రతతో అన్నిపనులూ నిత్యకృత్యాలు వారు చేయడం మనకు కనిపిస్తుంది.

శ్రీగురుదేవులు ఏమాట చెప్పినా దాన్ని వేదమంత్రంలా శిరసావహించే **'యోగమండలి'** యొక్క విచిత్ర యోగవిధానమిది! ఈ కుంభకోణపు సద్గురువైన **'మాస్టర్ C.V.V. యోగపాఠశాల'** నడిచిన ఆ పవిత్రకాలంలోని ఆశ్చర్యకరమైన వింతలను కొన్ని ఇక్కడ తెలుసుకుందాం!

ఈ **నూతన కుంభయోగము** ఒక విచిత్రమైన దివ్యశక్తితో నడుస్తుంది! **ఆ శక్తి** సాధకునియొక్క ఆత్మలోంచిగాని, శరీరంలోంచిగాని వచ్చేది **కాదు!** అంతేకాదు తన సాధనపై **సాధకునికి** ఎట్టి కంట్రోలుగాని **స్వాతంత్ర్యము** గాని, **లేదు!** ఇది 'పరిపూర్ణ **శరణాగతి** మార్గము'.

'శరణాగతి' అనగానే శ్రీవైష్ణవ సిద్ధాంతంలో చెప్పే శరణాగతి వంటిది కాదు! ఇది శివయోగులు చెప్పే 'శరణులు' అనబడేవారి శరణాగతీ కాదు!

అలానే అయ్యప్పభక్తులు బిగ్గరగా అరిచే "**అయ్యప్పశరణం**"లో కేకలుపెట్టే శరణాగతి వంటిదీ **కాదు!** ఇది ఒక విచిత్రమైన "**యోగ-శరణాగతి**"!!! అదేమిటో జాగ్రత్తగా అర్థం చేసుకుంటేనేగాని తెలుసుకోలేము ఈ యోగ-రహస్యాన్ని!

పైనుండి క్రిందకు '**అనుగ్రహ శక్తి**'గా దిగివచ్చే పరబ్రహ్మ శక్తి (Cosmic Force) జలపాతంలా **తలమీదకు** దిగి సాధనను — నడిపించే విచిత్రమైన **యోగప్రక్రియ!** ఇది సాధకుని శక్తికాదు — '**విశ్వకుండలిని**' (Cosmic Kundalini) యొక్క ప్రేరణవల్ల నేరుగా సాధకుని శరీరంలో కావలసిన మార్పులు, **కరెంటువంటి** యోగ-తరంగాలద్వారా, **ఆరోగ్యంలో మార్పులూ,** జీవితంలో, **ఉద్యోగంలో** బంధుమిత్రులతోటి సంబంధాలలో **అన్నిటిలోనూ, మార్పులు** కావలసినవిధంగా అదే చేసుకుంటూపోయే ఒక దివ్యమైన "**మాస్టర్ గారి శక్తి**" అనబడే బ్రహ్మశక్తి యొక్క '**అనుగ్రహ** విజృంభణ'! అంటే ఏమిటో ఏం జరుగుతుందో ప్రత్యక్షంగా చూద్దాం! [ఇది గతంలోని సాధకుల యోగానుభవాలనుంచి — తిరిగి ముద్రిస్తున్నాము.]

## మాస్టర్ – ప్రేయరు :

యోగమిత్రులు స్నానంచేసి తెల్లగా ఉతికినబట్టలు ధరించి శ్రీవేదవ్యాస ఇంటికి అయిదున్నరకల్లా చేరుకునేవారు! వారు రాగానే వేడివేడి ఇడ్లీలు నెయ్యివేసిన (చట్నీలేకుండా) ఆవిరి వస్తున్నవి, టిఫినుగా, తినిపించేవారు. ఎందుకంటే, ఈ యోగంలో **నిరాహారంగా సాధనచేస్తే ప్రాణప్రమాదం!!** ఘుమఘుమలాడే ఒక కప్పు కాఫీ సేవించి రెండు నిమిషాలు ఆదుర్దా తగ్గించుకుని స్థిరపడేవారు. కాళ్ళూచేతులూ కడుక్కుని నోరు శుభ్రపరచుకుని (ఇది ప్రత్యేకము) ప్రేయరుకు సరిగ్గా 5-55 A.M. కు ముందుగానే ఒక క్రమవరుసలో కూర్చునేవారు. ఎవరిస్థానంలో వారే కూర్చుంటారు. అంటే

ఈరోజున ప్రేయరులో తాను కూర్చున్న **చోటునే** మార్చకుండా, **కాలమును** మార్చకుండా, ప్రదేశాన్ని మార్చకుండా (Identity of Time and Space) — సరిగ్గా **అదే సమయానికి** — ప్రార్థనకు కూర్చోవాలి! సాధకుడు చేయవలసిం దల్లా ఇంతే! మిగతాదంతా గురువే చేస్తాడు! అదే **'యోగప్రక్రియ శరణాగతి'** అంటే!

## అజ్ఞాతంగా 'కుండలినీ' విజృంభణ! :

అందరూ కలిసి కళ్ళుమూసుకొని ఒక్కసారి ప్రార్థనచేసి వారికి ఉపదే శించిన విధంగా మనస్సులోనే ఆ 'కోర్సులు' ఉచ్ఛరిస్తారు! ఇక అంతా మౌనంగా జరిగిపోతుంది! శరీరంలో **కరెంటు పెట్టినట్టు** ఉలిక్కిపాటు! శ్వాస పీల్చుకోవడంలో **వేగం** హెచ్చిపోతుంది! — భస్త్రిక ప్రాణాయామంలా!! సాధకునికి ఎరుకలేకనే బుసలా (అతడు **కంట్రోలు చేయలేని** పరిస్థితిలో) శబ్దంతో శ్వాస బైటకువస్తుంది! **చేతులు** ఒక్కసారి పులకరించినట్టు కంపించి, క్రమక్రమంగా **పైకిలేస్తాయి!**

కాని ఆశ్చర్యం!! వారెవరికీ శరీరపు స్పృహయే లేదు! ఏం జరుగు తున్నదో కనీసం **తెలిసినట్టుకూడా లేదు!** వారికి నిజంగా తెలిస్తే తమ **ఎరుకలేకుండా వారి శరీరంలో** ఇలా రకరకాలైన 'కదలికలు' (Actions) ఏర్పడుతున్నాయని భయపడివుందురేమో! అది, వారి ధ్యానాన్నికూడా భంగంచేసి వుండును! అందుకే వారికి ఏంజరుగుతున్నదో లోలోపల లీలగా తెలుస్తున్నా కళ్ళు తెరుచుకుందామన్నా **తెరిపిడి పడవు!** శరీరం తూగిపోయి ముందుకీ వెనక్కీ ఊగుతూ లయబద్ధంగా నాదస్వరం వింటున్న నాగుపాము వలే స్పందిస్తుంది! లోపలేదైనా మనకి వినిపించని నాదం (అనాహత నాదం) వీరు వింటున్నారా?

ఇంతలో అకస్మాత్తుగా ఒక యోగమిత్రుని **కాలు** పద్మాసనంనుండి

విడివడి కాలు విదల్చినట్లు గబగబా విదిలిస్తున్నాడు! అది అలాగే ఆ కాలు పైకిలేచి క్షణాలమీద అతడి పాదం తన తలకన్నా పైకి లేవడమూ, మరుక్షణంలో అతడికాలు పిక్కవద్ద తలపైనుంచి క్రిందకి దిగడమూ జరిగి పోయాయి! మహాశ్చర్యం!! సాధకునికి శరీరంపైన ఏ కంట్రోలూ లేకుండా అతని కాలు తలమీదుగా వెళ్ళి మెడమీద యోగాసనం పద్ధతిలో బిగించు కున్నది!!!

అతను వేగంగా శ్వాసను లోపలికీ బైటకీ వదులుతూ తన్మయావస్థలోనే ఉన్నాడు! ఇంతలోకే రెండవపాదంకూడా పైకిలేచి మళ్ళీ అలాగే తలమీదుగా ఎవరో లాగినట్టుగా గుంజబడి మెడమీదకు వాలింది, ఓ విచిత్రమైన యోగా సనం ఫక్కీలో!

అతని చేతులు క్రమంగా నేలకు త్రాకి రెండు అరచేతులూ అంజలి ఘటించినట్టు నేలకు త్రాకించి అతడు నేలపైనుండి అడుగు ఎత్తుకు లేచి నిలబడ్డాడు! అతని శరీరంలో ఓం-కారం నడుస్తూనేవుంది! మిగతావారు ఇదంతా ఏమీ చూడకుండా నిశ్శబ్దంగా కళ్ళుమూసుకుని వారి యోగస్థితిలో వారు వున్నారు.

ఇంతలో, ఇంకోవ్యక్తి క్రమంగా వెనక్కి ఒరిగి వీపు నేలకు తాకేలా వాలిపోయాడు! మరుక్షణలో పాదాలు ఎవరో, గుంజినట్లు అతని ఎరుక లేకుండానే పైకిలేచి కాళ్ళు నిటారుగా 'సర్వాంగాసనం' ఫక్కీలో నిలబడ్డాయి! మరికొందరికి శరీరంలో లైట్లు వెలిగించినట్లు ఒక్కొక్క యోగ-చక్రంలోనూ కరెంటు స్విచ్‌వేసి లైటు వెలిగించినట్టు, రంగురంగుల ఎలక్ట్రిసిటీ బల్బులు వెలిగినట్టుగా అనుభూతి!

'ఇంతలో క్రమంగా వారి శ్వాసవేగం తగ్గింది! చేతులు క్రమబద్ధంగా దిగి నమస్కారం పట్టు విడిపోయి క్రిందకు వాలిపోయాయి — రెండు

తొడలపైనా రెండుచేతులూ 'ప్రేయరుకు **ముందువున్న స్థితిలోకి వచ్చేశాయి** అవే! తన్మయత్వం తగ్గి కళ్ళుతెరచి మామూలు స్థితిలోకి వచ్చారు అందరూ **ఒకేసారి!!**

అయినా శ్రీగురుదేవులు ఎవరినీ వెంటనే లేచి వెళ్ళవద్దని వారించారు. ఎందుకంటే 'ప్రేయరు' పూర్తిఅయిన తర్వాత 15-నిముషాలవరకూ ఆ **యోగశక్తి సంచాలనం** 'Action' శరీరంలో నడుస్తూనేవుంటుంది. దాన్ని పూర్తిగా శరీరంలోకి మనస్సులోకీ, ఆ ప్రశాంతి (Peace) ని పీల్చుకొని మనస్సులో **ఆస్వాదించి** క్రమంగా ఆ మత్తులాంటి 'యోగ-మైకం' (Yoga Trance) నుంచి దిగిపోయి మామూలు స్థితికి చేరుకున్నారు.

## 'ప్రేయరు'–పూర్తి :

"చల్లని కూజాలో నీరు ఒక గ్లాసుతో ముఖం, శిరస్సూ, కాళ్ళూచేతులూ కడుక్కొని చల్లని నీరుత్రాగి అంతా లేచిపోయారు! ఎవరి బట్టలు వారు వేసుకొని, వాచీ, కళ్ళజోడు వంటివి ధరించి ఎవరికివారు వారి ఆఫీసు పనులకోసం ఏమీ జరగనట్టే వెళ్ళిపోయారు.

ఇందులోని ముఖ్య నిబంధన ఇదే!!! **సాధనానంతరం** ఎవరూ **మాట్లాడ కూడదు** — అత్యవసరమైన పొడిమాటలుతప్ప లోకవ్యవహారాలూ, విద్యా విషయాలూ, జోకులూ, కబుర్లూ అప్పుడు పూర్తిగా **నిషిద్ధము!!**

ఈ యోగప్రక్రియ అంతా జరిపేది **సాధకుని** ప్రజ్ఞకాదు! మాస్టర్‌గారి **దివ్యానుగ్రహమే!"**

# III

పై ప్రత్యక్షమైన రిపోర్టువల్ల ఆనాడు మా ఇంటిలోని యోగాస్కూలులో మాస్టర్‌యోగాప్రేయరు ఎలాజరిగేదో ఒక అవగాహనకు వస్తుంది! యిలా

కొన్నేళ్ళు మాస్టర్‌యోగంలో పరిపక్వత గలిగిన తరువాత నాకు మద్రాసులో ఉద్యోగరీత్యా IAS ఆఫీసర్‌గా ట్రాన్స్ఫర్‌మీద వెళ్ళడం జరిగింది. అప్పుడే నేను ప్రత్యక్షంగా **కుంభకోణం వెళ్ళడం** అక్కడ శ్రీ **మాస్టర్ C.V.V. గారి** ఆనాటి **ఇంటినీ** వారిఇంటికి ఎదురుకుండా వుండే **యోగాస్కూలు** హాలూ, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారివంటి మహనీయులైన 'మీడియమ్స్' (Mediums) ను తయారుచేసిన ఆ పవిత్ర ఆధ్యాత్మికకేంద్రాన్ని దర్శించటమూ జరిగింది. అవి చూడనివారికోసం మాస్టరు C V.V. వారి ఇంటిఫోటోలు ఈక్రింద ప్రచురిస్తున్నాను.

మాస్టర్‌గారి ఈ నివాసం 'యోగాస్కూలు'ను ఒక పవిత్రమైన యోగ కేంద్రంగా పునర్నిర్మించి అక్కడ శ్రీవారి విగ్రహాన్నికూడా ప్రతిష్ట చేసేందుకు



*మాస్టర్ C.V.V. గారి ఇల్లు (కుంభకోణంలో)*



*మాస్టర్ C.V.V. సాధనచేసిన "యోగాస్కూల్"*

అప్పట్లో ప్రయత్నాలు జరుగుతున్నాయి. నన్నుకూడా ఆప్రయత్నంలో కలవమంటూ ఆహ్వానంకూడా వచ్చింది. కాని నాకు వెంటనే భయంవేసింది! — అదేమిటంటే విగ్రహస్థాపన కాగానే అదిమళ్ళీ ఒక గుడిలాగా మారి పూజలు, అర్చనలు, టిక్కెట్లు, భక్తులు హుండీలలో వేసే దక్షిణలూ — వాటికోసం ఇలాంటి దేవాలయాలలో తయారయ్యే రాబందులూ, నక్కలవంటి ట్రస్టుబోర్డు మెంబర్లుండే — ఈ విషవాతావరణంలో పవిత్రమైన **"భృక్త రహిత తారకయోగ"** విధానంలోవుండే కరెంటువంటి యోగప్రక్రియ నిలచిపోయి, హిందూమతంలోని మిగతా దేవాలయాలలాగే ఒక శిలాజం (Fossil) గా శిలగా ఘనీభవించి పోకూడదని దానికై మాస్టర్‌గారినే గట్టిగా ప్రార్థించాను.

చాలాసేపు వారినుండి స్పందనలేదు. అలా రెండు మూడు రోజులు నాలో నేనే తీవ్రంగా మథనపడి ప్రేయర్‌లోకి వెళ్ళికూర్చుని శ్రీవారి ఆదేశాలకై ప్రార్థించగా —

> "దీనికి కొత్తగా 'మాస్టర్ యోగవిధానం' గురించిన ఒక గ్రంథం సమగ్రంగా తయారుచేయాలి! ఇది అన్ని రాష్ట్రాలవారికీ ఉపయోగపడేలాగా — ఇటు ఇంగ్లీషులోనూ, అటు తెలుగులోనూ ఆపైన తమిళంలోనికీ అనువాదం కావాలి! అది శ్రద్ధగా మాస్టర్ యోగం లోని పవర్ తీవ్రతపెంచే పరికరంలాగా తయారుచేయాలి! దాన్ని విడుదలచేస్తే యిప్పుడు నామమాత్రంగా కొనఊపిరితో నిలిచి వున్న మాస్టర్ C.V.V. యోగవిధానం మళ్ళీ చైతన్యశక్తిని పుంజు కుంటుంది. అప్పుడే ఈ యోగమార్గం దేవాలయాలస్థాయికి పతనం కాకుండా రక్షించవచ్చు!"

ఎక్కడినుంచో వినిపించినట్టయింది! అయినా దీనికి ప్రయత్నం ఎందరో నాకన్నా వయసులో పెద్దవారు దశాబ్దాల ముందుగానే మాస్టర్ యోగంలోవుండే **'C.V.V. యోగకేంద్రాలు'** నడిపిస్తున్నవారు చేస్తారని ఆశించాను.

ఏవోకొన్ని **C.V.V. యోగగ్రంథాలు** చిల్లరమల్లరగా వెలువడ్డాయి వేరువేరు శాఖలనుంచి! అందులో కొన్ని అప్పటి సాధకులూ మీడియమూ ఐన శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి అనుభవాలపై కేంద్రీకరించిన గ్రంథాలు కొన్నైతే — శ్రీ N.R.B.V. గారి యోగపాఠశాలలోని విధానాలను మాత్రమే చిత్రించిన చిరుపుస్తకాలు మరికొన్ని! అలానే కుంభకోణంనుంచి చిన్న పాకెట్ బుక్ సైజులో అతితక్కువ సైజులో వెలువడింది మరొకటి. ఇంకా ఇలాగే పిడుగురాళ్ళనుంచీ, గుంటూరునుంచీ, విశాఖపట్టణంలోని Master E.K.

అనబడే మా అన్నగారైన డాక్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యగారి గ్రంథమూ అన్నీ యిదేకోవకి చెందుతాయి. ఈ గ్రంథాలన్నీ వారు దయతో నాకు పంపించటం జరిగింది. వారందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ ప్రస్తుత మాస్టర్ C.V.V. యోగకేంద్రాలవారు ప్రచురించిన సాహిత్యమంతా కలబోసిచూస్తే నాకో ముఖ్యమైన విషయం కనిపించింది.

1) అందులో మాస్టర్ C.V.V. గారి జీవిత విశేషాలపై వారి రహస్యమైన యోగాడైరీలపై దృష్టి **కేంద్రీకరించబడలేదు** — పుస్తకమంతా ప్రచురించే వారి యోగాబ్రాంచి స్కూలు ప్రతిష్ఠించిన మీడియమ్స్ (Mediums) లేక **శిష్యులపైనే** కేంద్రీకరించబడింది.

2) ఇలాగ వేరువేరు మాస్టర్ యోగకేంద్రాలను నడిపే (నడిపిన) వారిపేర్లే మాస్టర్‌గారి ప్రేయర్‌లోకి చొప్పించి **'నమస్కారం మాస్టర్ C.V.V.'** అన్న ప్రేయర్ **తరువాత** ఈ శాఖలు నడిపించే **యోగమిత్రులపేర్లు** చొప్పించి వారిని క్రమం**గా మాస్టర్‌స్థాయికి** ప్రమోటుచేయడం కనిపించింది.

మాస్టర్‌గారి శిష్యులనూ మీడియమ్స్‌నూ సాక్షాత్పరబ్రహ్మ అవతార పురుషులైన **మాస్టర్‌గారితో సమానస్థాయికి** ప్రమోషన్‌యిచ్చి పీఠంవేసిపెట్టడం **సమంజసం కాదనిపించింది.** బహుశా వారే జీవించివుంటే ఈ వీరభక్తిని ఆపుచేసేవారేమో! ఇది ఒక్క శ్రీ ప్రభాకరయోగ కేంద్రంలో మాత్రమే ఈ దురలవాటు చోటుచేసుకోలేదు.

ప్రభాకరులు ఎన్నడూ మాస్టర్‌గా తనపేరునుగాని, తననుగాని ప్రేయర్ లో మాస్టరుఅని వాడుకోవటానికి అనుమతినివ్వలేదు. ఇదినాకు ఎంతో నచ్చింది. ఇది మాస్టర్‌గారియందు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారికున్న పరిశుద్ధ

మైన గురుభక్తిని — మాస్టర్‌గారికీ తమకీ ఉన్న దూరం, అంతరాన్ని మరచి పోని గొప్ప ఆధ్యాత్మిక సంస్కారాన్నీ చూపిస్తున్నది. ఇలా కొంత వరకూనైనా మాస్టర్ C.V.V. యోగం కొనఊపిరితో నిలబడగలిగింది.

తక్షణమే నాకర్తవ్యమేమిటో నాకు తెలిసొచ్చినట్లయింది.

మాస్టర్‌గారు ఆదేశించినట్లు ఒక సమగ్రమైన సైన్సువంటి గ్రంథాన్ని కేవలం మాస్టర్ **C.V.V. గారి జీవిత విశేషాలతో**, మాస్టర్‌యోగంలోని మూల మైన సూత్రాలమీద సైన్సు **విశ్లేషణతోనే** వ్రాయాలి. ఇందులో వీరభక్తితోనూ, మూఢమైన గురుభక్తితోనూ మీడియమ్స్‌ను వారివారి భక్తులు పైకెత్తిన అంశా లను పరిష్కరించి — ముఖ్యంగా మాస్టర్ C.V.V. గారి **రహస్య యోగాడైరీ లోని** అంశాలు, వారి **జాతక కుండలి**, ఇంకా మాస్టర్‌యోగం భూమికి అవతరించిన పవిత్రదినమైన **29 మే 1910 నాటి** గ్రహస్థితినీ మేళవిస్తూ రానున్న తరాలవారికై సులభంగా దొరకని అనేక ఫోటోలు, జీవితవిశేషాలను ఈ గ్రంథంలో పొందుపరచటానికి నా శాయశక్తులా కృషిచేశాను చిత్తశుద్ధితో!

## అనుభవాలు :

ఈ గ్రంథంలో వేరేభాగంలో అనేకమంది డాక్టర్లు, పిలకా గణపతి శాస్త్రిగారి వంటి పత్రికాధిపతులు సైతం విద్యుత్తువంటి మాస్టర్‌యోగ శక్తివల్ల నాద్వారా పొందిన రోగనివారణ — యోగప్రబోధం తాలూకు గతంలో ప్రచురించిన రెండు **యదార్థ అనుభవాలనుకూడా** పాఠకులముందుంచు తున్నాను.

ఇవి మాస్టర్‌గారి **యోగంయొక్క శక్తి నిరూపించేందుకేగాని** — ఇందులో నాప్రమేయంగాని, నాపేరుప్రతిష్టలకోసంగాని ఎలాంటి నిమిత్తంలేకుండా ఈ అనుభవాలను యథాతథంగా పాఠకులముందుంచుతున్నాను!

# IV

మాస్టర్ యోగం ఒక విచిత్రమైన అద్భుతశక్తిని మానవశరీరంలోనుంచి ప్రసారం చేస్తుంది — కరెంటు తీగలోనుంచి విద్యుత్ శక్తివలే కరెంటు ఎలా ప్రవహిస్తుందో అలాగే ఈశక్తికూడా మానవ శరీరంలోకి ప్రవహిస్తుంది!

ఈ శక్తి మామూలుగా సైన్సుకు తెలిసిన జ్ఞానంలేని **'జడ-శక్తి'** (Blind-Force) **కాదు!** ఇది ఒక స్వయంప్రజ్ఞ కలిగిన **'జీవించే శక్తి'** (Living-Energy, or Conscious Force)!

"ఒక్క మెతుకు పట్టిచూస్తే అన్నం ఉడికిందో, లేదో తెలుస్తుంది! అలానే కొన్ని అద్భుతాలు చూస్తే వింత ఆశ్చర్యం కలుగుతుంది! అదే చేద్దాము!"

"శ్రీవేదవ్యాస గురుదేవులు 1973 ప్రాంతంలో పశ్చిమగోదావరిజిల్లాలో ధర్మప్రచారం నిమిత్తం పర్యటిస్తున్నారు! ఇటు IAS ఆఫీసరుగా తమ వృత్తి బాధ్యతలను నిర్వహిస్తూనే అటు అనేక మహాగ్రంధాలనూ, పరిశోధనా సిద్ధాంత గ్రంధాలనూ, శరపరంపరగా ప్రచురిస్తూనే, మరోప్రక్కన శలవు రోజులలో ఊరూరా **"యోగ కేంద్రములు"** స్థాపించి వేలాదిమంది భక్తులకు, సాధకులకు తమ అద్భుత యోగశక్తితో ఆశీర్వదించి అనేక **సత్సంగ — కేంద్రములను** నెలకొల్పారు! ఆరోజు అనుకోకుండా పశ్చిమ గోదావరిజిల్లా, **'పాలకోడేరు'** రావడం జరిగింది!

శ్రీఅల్లూరి రామలింగరాజు అక్కగారు శ్రీమతి గాదిరాజు రామసీత 1961 నుంచే శ్రీగురుదేవుల అనుగ్రహాన్ని చూరగొన్న భక్తురాలు! తన తమ్ముడు రామలింగరాజు మరణిస్తూ ఆమెకు 'అప్పగింతలు'గా చెప్పిన మాటలు దివ్యప్రబోధములై ఈమె జీవితాన్నే మార్చివేశాయి! ఆరోజు ఆమె

అమలాపురం చూడవచ్చిన శ్రీగురుదేవులను బ్రతిమాలి తనకు చదువుచెప్పిన మాస్టారు శ్రీవెంకట్రామయ్యగారు తనకు ఎంతో జ్ఞానబిక్ష పెట్టిన గురువు కాబట్టి ఆ గురుఋణాన్ని తీర్చుకోవడానికి వారికి శ్రీవేదవ్యాస **గురుదేవులు తమ అనుగ్రహ ఆశీస్సులను** ప్రసాదించాలని గట్టిపట్టు పట్టింది! వెంటనే గురుదేవులు కారులో భీమవరం మీదుగా ప్రయాణించి పాలకోడేరు చేరుకున్నారు.

ఆరోజు గ్రామంలోని పెద్దలందరూ ఊరేగింపుగా మేళతాళాలతో ఎదుర్కొని స్వాగతం చెప్పారు! ఊరంతా ఎదురేగి, మహోత్సవంగా వీధివెంట ఊరేగిస్తూ తీసుకువచ్చారు! శ్రీవారి ఉపన్యాసమును విని పులకించి చీమల పుట్టలా వేలాదిమంది జనం క్రిక్కిరిసి శ్రీవేదవ్యాస దర్శనానికి ఎగబడ్డారు! కిటికీల వెనకనుంచి ప్రహరిగోడ బయటనుంచి వారి కారుచుట్టూరా సముద్రంవలే గుమిగూడివున్నారు! ఉపన్యాసం, సంకీర్తనలూ పూర్తిఅయి నాయి! బహుదూరం ప్రయాణంచేసిన బడలిక, వేసవి, వేలాదిమంది త్రొక్కిడి వల్ల అలసిన గురుదేవులకు కనీసం భోజనం తమఇంట చేసి వెళ్ళమన్నారు! — శ్రీఅప్పలరాజు గారింట ఏర్పాట్లుచేశారు! ఎంతో కష్టంమీద 'ఎవరింటా భోజనం చేయను' అన్న గురుదేవుల దీక్షకు శ్రీరాజుగారు రాజీపడి దేవాలయంలో మడిగా, శుచిగా వంటచేయించి, వంటకములను తనఇంట ఒకపెద్ద హాలులో సర్ది ఏర్పాటుచేశారు! బయట జనం కోలాహలం లేకుండా అన్ని కిటికీలు, తలుపులు మూసివేశారు! టేబుల్‌మీద ప్రసాదం పాత్రలన్నీ సిద్ధం చేయించారు!

బయట కారునుండి దిగిన శ్రీవేదవ్యాసగురుదేవులు మెడపైన కుప్ప తిప్పలుగా పేరుకున్న పూలమాలలను తీసి ఆ భక్తులపైకి విసిరివేస్తూ, చిరునవ్వుతో ఎందరినో ఆశీర్వదిస్తూ మరికొందరిని పలకరిస్తూ ఇంకా

కొందరిని బుజ్జగిస్తూ, లాలిస్తూ, మెరుపులా హాలులోకి ప్రవేశించి క్షణంలో తలుపులన్నీ బంద్‌చేశారు! లోపల తనకు వడ్డించడానికి ఎవరూ అవసరం లేదని, అందరినీ బయటికి పంపించారు శ్రీవేదవ్యాస!

ఏకాంతంగా క్షణకాలం ప్రార్థించి ఆ వంటకాలలో **మూడు గుప్పెడులు** మాత్రం ప్రసాదంగా తన పళ్ళెంలో ఉంచుకొని **శ్రీమాణిక్యప్రభువు భిక్షలా భోజనం** పూర్తిచేసారు!

## దివ్యానుభూతి :

భోజనం మొదలుపెట్టారో లేదో అనుకుంటున్న బయటవారికి ఆశ్చ ర్యం కలిగిస్తూ అంతలోనే దొడ్డితలుపు తీసుకొని పెరటివైపు చిక్కుడు పందిరికింది కెళ్ళి చేతులు కడుక్కోవడానికి ఉపక్రమించారు!

ఇంతలో పరుగు పరుగున ఇద్దరు పదహారేళ్ళ బాలికలు వెళ్ళి రెండు చెంబులతో మంచినీరు తెచ్చారు! ఒకరు శ్రీవారి చేతిమీద నీరుపోయగా రెండవవారు తువ్వాలు ఇవ్వబోయారు... అంతే! ఊహించని స్పీడుతో శ్రీవేదవ్యాస వెనుతిరిగిచూశారు! అక్కడ జనంలోనుంచి ఒక ఇరవై - ఇరవై అయిదు సంవత్సరముల వయసున్న స్త్రీ, పెద్దగా దుఃఖిస్తూ శ్రీవారి పాదాల మీద పడబోయింది! క్షణంలో వెనక్కి గెంతి — "**పాదాలు ముట్టుకోకు!** లే! చేయిపట్టు!!" — అంటూ **ఎంగిలి నీళ్ళనే** బొట్లుబొట్లుగా **ఆమెచేతిలో జార విడిచారు!!!** ఆవిడ పట్టరాని భక్త్యావేశంలో రెండుచేతులూ ఒకదానికింద ఇంకొకటి చేర్చి, దాన్ని '**తీర్థం**' లా స్వీకరించి ముమ్మారు పుచ్చుకున్నది!

శ్రీగురుదేవులు చెంబులోని నీళ్ళతో ఇంకోసారి చేయికడుక్కుని, ఆ **తడినీళ్ళను** ఆమె **తలపై** సంప్రోక్షించినట్లు చల్లారు! ఇదంతా ఒక్క నిముషంలో జరిగిపోయింది!"

"అంతే! మెరుపు మెరిసినట్టు వెనుదిరిగి శ్రీగురుదేవులు హాలులోకి వెళ్ళి అందరూ తనను చుట్టుముట్టేలోగా శరవేగంతో కారులోవెళ్ళి కూర్చున్నారు! మరుక్షణం కారు కదిలివెళ్ళింది!"

"నెలరోజుల తర్వాత సంగతి! శ్రీవేదవ్యాస హైదరాబాదులో ఆఫీసుకు వెళ్ళబోతూ తమ ఇంటిముందు నిలిచిన జీపులోకి ఎక్కబోతున్నారు! ఇంత లోకి ఒక రాజుగారు, ఆయనవెంట మధ్యవయస్కురాలైన ఒక యువతి, ఒక పళ్ళగంప రిక్షాలో పెట్టుకొని, గులాబీమాలలు రెండు గజమాలలుగా అల్లించి తెచ్చారు! శ్రీవేదవ్యాస ఆఫీసుకు వెళుతున్నారు, తర్వాత కలవండి! ఇప్పుడు సమయంలేదు అన్నారు! దానికి వారు నిలదొక్కుకోలేని ఆవేశంతో పాదాలమీద పడి కన్నీళ్ళతో కృతజ్ఞతలు వెక్కిళ్ళతో నివేదించుకొని మళ్ళీ మళ్ళీ పాదనమస్కారం చేశారు!

"మీరెవరు? ఎక్కడో చూసిన మొహంలా వుందే" అన్నారు!

"నెలక్రితం పాలకోడేరు గ్రామంలో శ్రీగురుదేవులు శ్రీఅప్పలరాజుగారు, గ్రామప్రెసిడెంటుగారి ఇంట కొంతకాలం నిలిచి ప్రసాదం స్వీకరించినపుడు ఈ భక్తురాలికి తమ అనుగ్రహం లభించింది! పదేళ్ళకు పైగా మూర్ఛలవ్యాధి! ఎన్నో వైద్యాలు చేయించాము! మరెన్నో జపాలూ, పూజలూ చేయించాము! స్పెషలిస్టులచేత పరిశీలనలు చేయించినా నిద్రమాత్రలు మినహా మూర్ఛలు తగ్గించలేకపోయారు! అన్ని సహాయాలూ విఫలమైన ఆమె — 'దిక్కులేనివారికి దేముడేదిక్కు' అన్న నిస్సహాయతలో బయట జనాన్ని త్రోసుకుని పరుగున వచ్చి వేదవ్యాస పాదాలపై పడబోయింది! అప్పుడే భోజనంచేసి చెయ్యి కడుక్కున్న నీరునే తీర్థంగా స్వీకరించింది! అంతే!! ఆ క్షణంనుంచీ ఆమెకు మూర్ఛలు మాయం అయినవి!"

అయినా అనుమానం పెనుభూతం కనుక — ఎవరో హేతువాదులు

— "ఇది తాత్కాలికంగా ఈవిడ విశ్వాసంవల్ల తగ్గినట్లు అనిపించవచ్చు! మళ్ళీ రెండురోజుల తర్వాత మూర్ఛలు మామూలుగానే వస్తాయి చూడండి! సైన్సుకు సాధ్యంకానిది మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?" అన్నారుట! అందుకని **నెలరోజులు వేచిచూసింది!** అయినా, **మూర్ఛలు రాలేదు!**

మందులు పూర్తిగా నిలిపివేసింది! అయినా శ్రీవారి అనుగ్రహశక్తియే గెలిచింది! **ఆమెకు పరిపూర్ణ ఆరోగ్యం కలిగింది!** ఇక ఉండబట్టలేక శ్రీవారి దివ్యానుగ్రహానికి కనీసం **కృతజ్ఞతలు భక్తితో తెలుపకపోవడం** — **"దైవద్రోహం,** కేవలం కృతఘ్నత మాత్రమేకాదు! దోషం అవుతుందని భావించి ఆ పళంగా వచ్చి వాలిపోయారు! ఇలాంటి విచిత్రాలు పదులూ పాతికలూ జరిగేవి! ఇవి వారి, నిత్యమహిమానుగ్రహమునకు నిదర్శనములు!

ఇలా పై 'రిపోర్టు'లోలాగే ఆరోజులలో మాస్టర్‌గారి దివ్యానుగ్రహాన్ని పొందిన ధన్యజీవులలో శ్రీపిలకా గణపతిశాస్త్రిగారు (**'ఆంధ్రప్రభ' సంపాద కులు)** ముఖ్యులు. వీరు మద్రాసులో శ్రీగురుదేవులవద్దనుండి అర సెకండు కాలంలో యోగదీక్ష తీసుకొని భూకంపంలాంటి మార్పులతో తల్లక్రిందులైన ఆనాటి, వారి దివ్యానుభూతులను **'అమృతానుభవం'** అన్న చిన్న పుస్తకం లోనూ **"కదిలేబ్రహ్మం - నడిచేదైవం"** అన్న గ్రంథంగానూ ప్రచురించారు! ఇది విడిగా చూద్దాము.



# 19

# మాస్టరు CVV - అరవిందులు - రమణ భగవానుల నూతన యోగమార్గాలు!

ఇరవయ్యవ శతాబ్దం మొదటి దశకంలో మాస్టర్ CVV యోగంతో పాటు శ్రీ అరవిందయోగికి, శ్రీకృష్ణ సాక్షాత్కారమూ, భగవాన్ రమణమహర్షికి బ్రహ్మసాక్షాత్కారమూ, రష్యన్ సిద్ధపురుషుడు గుర్జీఫ్‌కు ఈ విశ్వాన్ని నడిపించే చైతన్యం మనిషిలోకి ఆవిష్కరింపచేసుకునే ఆధ్యాత్మిక విధానము ప్రపంచం లో ఒక నూతన ఆధ్యాత్మిక రంగాన్ని సృష్టించాయి!

అలానే రష్యన్ యోగిని మేడమ్ బ్లావెట్స్కి హిమాలయాలలో తనకు దర్శనమిచ్చిన పరమ గురువులైన మాస్టర్ K.H, మాస్టర్ M (మోరియా) లద్వారా పొందిన 'దివ్యజ్ఞానము' ఆధ్యాత్మిక మహిమలూ ప్రపంచానికి చూపించారు!

శ్రీ అరవిందుని యోగంలో ఈ "అతిమానస భగవత్‌చేతన" — కొన్ని

విషయాలలో **మాస్టర్ CVV** యోగాన్ని పోలివున్నది! ఈరెండు యోగాలలోనూ యోగశక్తి సాధారణ యోగసాధనలోవలే వెన్నెముక క్రిందవున్న మూలాధారం నుంచి పైకి ప్రసరించే కుండలినీశక్తివలే **కాకుండా** — తలపైనవున్న సహస్రార పద్మంనుంచి జలపాతంలా క్రమంగా **కిందికి దిగుతూ** — సాధకుని మనస్సు, చేతన, ప్రాణశక్తినీ చివరికి శరీరాన్నికూడా మార్చివేస్తుందనీ అది సాధకునికి ఈ జీవితకాలంలోనే పరిపూర్ణత పొందించుతుందని చెప్పినట్టే, CVV మాస్టర్ యోగంలోకూడా **పైనుంచి క్రిందకి ప్రసరించటం** ఒక సామాన్యలక్షణం.

కాని, రెండిటికీ వున్న తేడా ఏమిటంటే మాస్టర్‌యోగంలో వున్నట్లు ఇంగ్లీష్ మంత్రాలుకాని, కోర్సులు కాని అరవిందయోగంలో లేవు! సాధన చేసేందుకు మాస్టర్‌గారి యోగంలో 6 గంటలకు చేసే ప్రేయరు సామూహికంగా చేసేలాగే అరవిందాశ్రమంలోకూడా, అందరూ చేరి ధ్యానం చేస్తారు! కాని, శరీరంలో కదలికలుకాని, శక్తితరంగాలు ప్రసరిస్తున్న బాహ్యా మైన కదలికలుకాని వుండవు! కేవలం అనుభవంతో యోగి తన చేతన, మనస్సు, ప్రాణము భగవన్మయం చేయబడుతుందని చివరికి శరీరంకూడా దైవశక్తితో సమ్మేళనం చెందుతుందని అరవిందయోగి సిద్ధాంతం!

ఇకపోతే శ్రీ రమణభగవానుని మార్గంతో అరవిందుల 'అతిమానసిక యోగావతరణ' (Supra Mental Desctent) ను సరిపోల్చి — మన మాటలతో కాకుండా శ్రీరమణ మహర్షియొక్క స్వయంవాక్యాలలోనే వినవచ్చు!

ఒకానొకప్పుడు భగవాన్ రమణమహర్షికి పరోక్షశిష్యుడైన కావ్యకంఠ వాశిష్టగణపతిముని భగవాన్‌వద్ద కొంతకాలం తపస్సుచేసి, వారు చెప్పిన 'అహం' లేక 'నేను' అన్న ప్రజ్ఞయొక్క పుట్టుక గమనించి — ఆతరువాత మంత్రజపం ప్రారంభించారు! అది కొంతకాలం చేశారు! ఆ తరువాత పాండిచ్చేరి అరవిందాశ్రమానికి వెళ్ళారు! ఈ భోగట్టాని భగవాన్‌కి అందించిన

ఒక శిష్యుడు అరవిందయోగి సిద్ధాంతాన్ని చెప్పగా భగవాన్ దానిపై ఈక్రింది విధంగా సంభాషించారు!

"ఈ సందర్భమున శ్రీ అరవిందుని సిద్ధాంతములనుగూర్చి భగవానుని భావన లెట్లుండునో గ్రహించుట యుక్తము :



13-3-1936 తేది బొంబాయినుండి వచ్చిన ఒక పెద్దాయన మహర్షితో ఇట్లనెను. "శ్రీ అరవిందాశ్రమమున నేను మాతను ఈప్రశ్న అడిగితిని. 'భగవంతుడు తన నిజస్వరూపమున గోచరింపవలెనని నేను తలంపులు లేకుండా మనస్సును శూన్యమొనర్చుచున్నాను! కాని నాకేమియూ కనిపించుటలేదు! ఆమె ఇచ్చిన సమాధానమున విషయం ఇట్లున్నది! పద్ధతి సరిగానే యున్నది! పైనుండి శక్తి క్రిందకివచ్చును! అది ప్రత్యక్షమగు అనుభూతి!"

కాబట్టి ఇంక పైన నేను ఏమిచేయవలెను?

మహర్షి :- "నీవు ఏదిగా నున్నావో అట్లే యుండుము! పైనుండి క్రిందకు వచ్చినదిగాని, అభివ్యక్త మగునదికాని, ఏదియునూ లేదు! అహంకారము తొలగించుకొనుటయే కావలసినది! ఏదియున్నదో అది ఎప్పుడునూ వున్నది! ఇప్పుడు కూడా నీవు **అదిగానే** వున్నావు! దానికంటే భిన్నంగా లేవు! ఈ శూన్యము నీచే చూడబడుతున్నది! దానిని చూచుచూ నీవు వున్నావు! నీవు దేనికొరకు వేచియుండవలె? నేను చూడలేదు!" అను తలంపు, చూడవలయునను నిరీక్షణ, దేనినో పొందవలయునను కోరిక, ఇవన్నియూ అహంకారంయొక్క కార్యములు! నీవు అహంకారంయొక్క వలలో పడినావు! ఆ అహంకారమే వీనినన్నింటినీ చెప్పుచున్నది! నీవుకాదు! నీవు నీవుగా యుండుము అంతకుపైన ఏమియూలేదు!

'శ్రీ అరవిందుడు సమగ్రమైన శరణాగతి చేయడని ఉపదేశించుచున్నాడు! మొదట ఆ పనిని చేసి ఫలమును నిరీక్షింతము! తరువాత అవశ్యకమైనచో ఇతర విషయములుగూర్చి చర్చించుతము! ఇప్పుడుకాదు!' — అని మహర్షి శరణాగతినిగూర్చి చెప్పెను!

వారు మరల ఇట్లుప్రశ్నించిరి! "ఈ దివ్యచైతన్యము క్రిందకు తెచ్చుటనుగూర్చి ఏమందురు?"

మహర్షి :- "అది ఇప్పుడు మన హృదయమునందు లేనట్లేనా?"

"ఓ అర్జునా! నేను హృదయాకాశమునందు వున్నాను!" అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు!

"సూర్యునియందు ఎవరు వున్నాడో ఆ పురుషుడు ఈ మానవునియందుకూడా వున్నాడు!" — అని ఉపనిషత్తులోని మంత్రము చెప్పుచున్నది!

"భగవంతుని రాజ్యము లోపలనున్నది" — అని బైబులు చెప్పు



చున్నది! ఈవిధముగా భగవంతుడు లోపలనే యున్నాడను విషయమును అందరునూ అంగీకరించుచున్నారు! క్రిందకు తేవలసినది ఏది? ఎక్కడనుండి? ఎవడు దేనికొరకు తేవలె? శాశ్వతము సర్వగతమును అయిన వస్తువును గుర్తించు టకు అవరోధములుగా వున్నవానిని తొలగించుటతోడనే సాక్షాత్కారం వస్తూవున్నది! దానిని ఒక చోటునుండి మరియొక చోటికి తీసుకొనిపోవలసిన పనిలేదు!

## "కర్మ" – 'కర్మ'క్షయమూ :

ఒకసారి రమణమహర్షిని ఒకాయన అడిగారట "అయ్యా భగవత్ సాక్షాత్కారానికి సాధన చేయాలంటే కర్మ పరిపాకం కావాలికదా! కర్మ పరిపాకం అయితేగాని సాధన రాదు. అయితే కర్మ పరిపాకం అయిం తరువాత సాధన మొదలు పెడతారా? సాధన మొదలుపెట్టింతరువాత కర్మక్షయం అయి మోక్షం పొందుతారా? — ఏది ముందు? — అని అడిగారు!

ఎందుచేతనంటే 'కర్మ' అనుకూలిస్తేకాని సాధనచేయడం కుదరదనీ

— 'సాధన' చేస్తేగాని కర్మక్షయం కాదనీ — ఇలా **ఒకదానికొకటి ముడిపడి** వున్నవి! పెళ్ళి కుదిరితేగాని పిచ్చికుదరదు పిచ్చికుదిరితేగాని పెళ్ళి జరగదు — అన్నట్టు!

అప్పుడు "శ్రీరమణమహర్షి" అన్నారట — "కర్త, కర్మ, క్రియ అనగా పనిచేసేవాడు, ఫలితం పొందినవాడు, చేసేపనీ! — వీటిలో ముందు 'కర్త' ఉంటేగాని కర్మ ఉండదు! కర్మ ఉంటేగాని క్రియ ఉండదు! అందుచేత 'కర్మనివారణ' చేయదల్చుకొంటే దాన్ని 'కర్త'యే చేయాలి! కర్మ జడమైనది — **కర్తయే ముఖ్యం!**

**"కర్తు రాజ్ఞయా వర్తతే ఫలం"**

**"కర్మ కింపరం? కర్మ తజ్జడం"** — అన్నారు.

అంటే 'కర్త'యొక్క ఆజ్ఞవల్లనే ముందు 'కర్మ' ప్రవర్తిస్తుంది! 'కర్మ తజ్జడం' అంటే — కర్మ **జడమైనది!** కాబట్టి అందుచేత **కర్మకి తాను బానిసనని కర్త అనుకోవడం చాలా హాస్యాస్పదం!** అన్నారు. ఇదే ఏ జగద్గురువులైనా ఏ మహాత్ములైనా చెపుతారు.

పై సంభాషణవల్ల రమణభగవానుని తర్కము అరవిందయోగంలో చెప్పిన **అతిమానస** ప్రజ్ఞ తలమీదనుంచి క్రిందకి దిగిరావడం గురించిన భావాన్ని తులనాత్మకంగా విడమరచి తెలుపుతుంది!

అయితే **మాస్టర్ CVV** యోగంలో రోగార్తులకు రోగనివారణ చేయడం అద్భుతమైన మానవసేవా ప్రక్రియ — అటు అరవిందయోగంలోనూ ఇటు శ్రీరమణభగవానుని 'నేనెవరు?' అనే బ్రహ్మజిజ్ఞాసమార్గంలోనూ — **కనిపించని** విశేషం! అంతేకాదు రమణభగవానుడు చివరిదశలో భక్తులకర్మను తన శరీరంమీదకు తీసుకొని ఒక వ్రణం రూపంలో ఆ బాధను అనుభవించి — చివరకు దానితోనే శరీరం విడిచిపెట్టారు! అనగా మాస్టర్ CVV

యోగంలో కనిపించే రోగనివారణా విధానము — ఆధ్యాత్మిక శక్తితో శరీరానికి కలిగే బాధలను బాగుచేసే ప్రక్రియ రమణభగవానుని మార్గంలో కనిపించని విశేషం!

## పదార్ధం "మార్పు" :-

ఈ సందర్భంలో శ్రీ అరవిందయోగి చెప్పిన కొన్ని వ్యాఖ్యలు గమనించదగ్గవి! ఆయన ఏమంటారంటే — భగవత్‌శక్తి లేక బ్రహ్మసాక్షాత్కారం కేవలం పైలోకాలలోనే అంటే బ్రహ్మలోకం, పరబ్రహ్మలోకానికే పరిమితి కారాదు! ఆ దివ్యశక్తి భూలోకానికి దిగివచ్చి భూలోకంలోని వృక్ష, ప్రాణి, మానవ జీవకోటిలో శరీరం బలము, పుష్టిని, ఆరోగ్యాన్ని, ఆనందాన్నికూడా కలిగించి మానవలోకాన్ని ఆనందమయంగా మార్చడం ఈనాటి అవసరం అంటారు!

## 'పదార్ధం' – శక్తిగా మార్పు! :

ఒక పదార్థాన్ని — ఇంకో పదార్థంలోకి మార్చడం వంటివీ... **పాదరసం** లోంచి **బంగారంగా** ఎలామారుతుందో, అలానే **అణువుల్లో మార్పుతో** మళ్లీ బంగారం **పాదరసంగా** ఎలా మారుతుందో కంటికి కనపడకుండా ఈ గాలిలో తేలియాడే **అణువు** (Atoms) లను మనస్సుతో సంకల్పంతోనే ఘనీభవింపజేయవచ్చునన్న 'సిద్ధాంతం' ఆధ్యాత్మిక శక్తితో నిరూపించారు!

నీటి '**ఆవిరి**'నే చల్లబరచి ఘనీభవింపచేస్తే అదే '**వడగళ్ళు**' అవుతుంది! ఒక్క నీళ్ళు నిముషంలో వడగళ్ళక్రింద రాలి పడటం మనకి కనపడుతోంది! ఈవిధంగానే 'భౌతిక పదార్థాన్ని' దేన్నైనాసరే — ఇనుము, బంగారం, వజ్రం, వెండి ఏది కావాలంటే ఆ వస్తువులోని ఈ 'అణువుల'యొక్క సంఘటనవల్ల కొత్త ధాతువు (Elements) లను ఉద్భవింపచేసే **సంకల్పశక్తి** మనుష్యుడి **ఆత్మకు** ఉన్నదని ఈ "**మాస్టర్ — K.H.**" ఆధ్యాత్మికంగా ఋజువుచేశారు!

## ఆధ్యాత్మికం - నాస్తికత్వం :-

ఈనాడు చాలామంది మహాత్ములు శ్రీసత్యసాయిబాబా వంటివారు ప్రపంచంలో ఇలాంటి అద్భుతశక్తినే విరివిగా, ప్రదర్శింపచేస్తున్నారు. దీనివల్ల మనకు తెలియాల్సిన మహాసత్యం ఏమిటంటే **పదార్థానికి మనిషి బానిసకాదు** అని! "నేను నా కర్మకు బానిసను" నాశరీరానికీ బానిసను! 'ఈ పదార్థాన్ని మనమేం చేయగలం? ఈ పదార్థమే శాశ్వతము, దానికింద అణిగిపడి వుండవలసిందే' అన్న **'భౌతికవాదం'** (Materialism) తద్వారా ఏర్పడ్డ 'నాస్తిక-వాదం' చాలామందికి అలవాటైపోయింది.

నిజానికి ఈ "కర్మ" అనేదికూడా **మనమే సృష్టించుకొన్నది!** కర్మ మనదే అయినా మనిషికి అదే **యజమాని** అన్నట్టుగా, నిత్యజీవితంలో మనం వ్యవహరిస్తున్నాం!

ఈ భావాన్ని పోగొట్టాలి! మానవుడు **కర్మకి యజమాని** (Mastery over Karma). — తన కర్మకీ బానిసకాదు అన్న భావాన్ని **మనలో** పెంచ **డానికే** ఈ **'మాస్టర్సు'** (Masters) ప్రపంచ వ్యాప్తంగా ఇటువంటి ఆధ్యాత్మిక ప్రబోధ కార్యక్రమాన్ని రూపొందించారు. పై నేపథ్యంలో **'పదార్థం – శాశ్వతం'** అన్న భౌతికవాదం **నశిస్తేనే**కాని నాస్తిక — ప్రధానమైన "కలియుగం" అంతం కాదు! "లేకపోతే ఈ కలియుగం అంతం కావాలంటే ఎలా?"



20

# రష్యన్ సిద్ధగురువు శ్రీ G.I. గుర్జీఫ్

ఈ 20వ శతాబ్దం మొదటి దశకంలో ప్రపంచంలో గొప్పమార్పులు ప్రారంభమయ్యాయి! రష్యన్ యోగిని మేడమ్ H.P. బ్లావెట్స్కీ చాలాకాలం క్రిందటే చెప్పిన భవిష్యత్తు ప్రకారం **కలియుగం 5000 సంవత్సరాలు** పూర్తి అయిన వెంటనే ప్రపంచంలో గొప్పగొప్ప మార్పులు చోటుచేసుకుంటాయని చెప్పిన భవిష్యత్తు అక్షరాలా నిజమైంది!

కలియుగం 1901 నాటికి 5000 సంవత్సరాలు పూర్తికావడంతో ఇంకొక గొప్ప ఖగోళ పరిణామంకూడా తోడైంది! అది 1910లో ప్రపంచానికి దర్శన మిచ్చిన **హేలీ తోకచుక్క ఆగమనం!**

ఈ తోకచుక్క కనపడగానే 1910 మే ప్రాంతంలో ప్రపంచంలో అయిదుగురు గొప్ప మహాయోగులు అవతరించడం జరిగింది! అందులో మొదటివారు రష్యన్‌యోగి అయిన **G.I.గుర్జీఫ్ (G.I. Gurdjieff)**! ఈయన పూర్తిపేరు జార్జి ఇవానోవిట్చ్ గుర్జీఫ్! ఈయన రష్యాలోని జార్జియా రాష్ట్రంలో 1 జనవరి, 1866 ప్రాంతంలో జన్మించారు!

రష్యాలోని జార్జియా మంచుకొండలలో తన తండ్రితోపాటు గొర్రెలు కాస్తూ అవి దారితప్పి దూరంగా కొండలలో తప్పిపోకుండా ఆ గొర్రెలచుట్టూ ఒకరోజున ఒక గుండ్రని గీతగీశాడు! అంతే! అవి ఒకరోజంతా అతడు తిరిగి వాటిని విడిచిపెట్టేదాకా ఆగీత దాటి బయటికి రాలేకపోయాయి! మరికొంతకాలానికి గుర్జీఫ్ కొందరు మిత్రులను ఒకచోట కూర్చోపెట్టి వారి చుట్టూ సరిగ్గా అలాంటి గుండ్రని గీతే గీశాడు! "Ring Pass Not" అని పేరుపెట్టాడు! మరుక్షణమే ఆ వ్యక్తులందరూ ఆ గీతదాటి బయటకు రాలేక చిక్కుపడిపోయారు! ఎవరైనా గీత దాటాలని ప్రయత్నిస్తే వారికి అకస్మాత్తుగా కళ్ళుకనిపించక పొగమంచులాగానో — లేక T.V. స్క్రీన్‌మీద ప్రోగ్రాం లేనపుడు వచ్చే గాజునూకవలె అతుక్కుపోయిన విధంగా కనిపించి మళ్ళీ తిరిగి అతడు గీసిన గీతలోకి రావలసివచ్చేది! ఇది అతని బాల్య విషయం!

కాలక్రమేణా గుర్జీఫ్ పెరిగి పెద్దవాడై స్టాలిన్‌గ్రాడ్‌లోనూ, సెయింట్ పీటర్స్‌బర్గ్ నగరంలోనూ ఆధ్యాత్మిక రహస్యాలను బోధించే "శిక్షణా తరగతులు" నడిపేవాడు! అందులో గొప్పగొప్ప మేధావులు రచయితల వంటి వారు ప్రముఖ బ్రిటీష్ డాక్టర్ కెన్నెత్ వాకర్ (Dr. Kenneth Walker) వంటివారు, రచయిత్రి కేథరిన్ మాన్స్‌ఫీల్డ్ వంటివారూ ఆ తరువాత రహస్యంగా రష్యా నియంత స్టాలిన్ విన్‌స్టన్ చర్చిల్, 13వ దలైలామా (Dalai Lama) కూడా వీరితో సన్నిహితంగా మెలిగేవారు!

సరిగ్గా **మాస్టర్ C.V.V. లోకి** పర**బ్రహ్మాంశ అవతరణ** జరిగిన — 1910 లోనే శ్రీ గుర్జీఫ్‌లోనికికూడా పైనుండి ఒక అతీతమైన దైవశక్తి — అవతరణ జరిగింది! అలానే మాస్టర్ C.V.V. తోపాటు భగవాన్ రమణ మహర్షికి తిరువణ్ణామలైలోనూ, శ్రీ అరవిందయోగికి పాండిచ్చేరిలోనూ

అతిమానసికశక్తి (Supramental Force) గానూ అవతరించి మానవజాతిని దైవత్వపు స్థాయికి తీసుకొనివెళ్ళ గలిగే నూతనయోగాల ఆవిష్కారం జరిగింది! ఈ ఐదుగురు మహాత్ములు — అనగా మాస్టర్ C.V.V., అరవిందయోగి, గుర్జిఫ్, శ్రీరమణ మహర్షి, వడలూరు జ్యోతిరామలింగస్వామి వంటి మహాత్ములలోనూ — దైవశక్తి అవతరించి మానవుడు దైవత్వస్థితికి పరిణామం చెందగలిగే దైవశక్తి ఆవిష్కారం జరిగింది! అయితే ఈ నలుగురూ వాడిన పదాలుమాత్రం వేరు! వారి భాష, దేశం, జన్మసంస్కారాల్నిబట్టి యోగాన్ని వర్ణించిన పదాలు వేరైనా ఈ నాలుగింటిలోనూ సామాన్యలక్షణాలు కొన్ని వున్నాయి! అంతేకాక తీవ్రమైన విభేదాలుకూడా సిద్ధాంతపరంగా చోటు చేసుకున్నాయి!

ఇందులో ముగ్గురు మృత్యువుపై విజయం మానవుడు సాధించడానికి కావలసిన యోగప్రక్రియ లను కనుగొన్నారు! అందువల్ల **మాస్టర్ C.V.V.** యోగంతోపాటు రష్యన్‌యోగి **గుర్జీఫ్** కనుగొన్న యోగసత్యాలు కూడా మనిషి మృత్యువుపై విజయం సాధించే మార్గాన్ని తెలియచేస్తుంది. మన భారతీయు లలో చాలామందికి గుర్జిఫ్ జీవితం గురించిగాని ఆయన ఉపదేశాల గురించి కాని ఏమీ పరిచయం లేనివాళ్ళే ఎక్కువ!

గుర్జీఫ్ బోధించిన యోగసిద్ధాంతాలు మాస్టర్ C.V.V., శ్రీఅరవింద యోగి అనుభవాలతో కొంత సారూప్యం కలిగినవి! అలానే ఎంతోకొంత భేదాలు వున్నాయి! మాస్టర్ C.V.V. యోగం తులనాత్మక పరిశోధనవల్ల ఈ నూతన యోగప్రక్రియలు వాటి స్వరూపం ఏమిటో అధ్యయనంచేస్తే — యోగసాధకులకు మాస్టర్ C.V.V. యోగం సాధకులకూ గొప్ప ఉపయోగం విశ్లేషణా లభిస్తుంది!

## మానవ-పరిణామం :

మానవుని పరిణామం ఈ భూమిమీద జంతుదశనుండే ప్రారంభమై మెట్లుమెట్లుగా పురోగమించింది! మొదటగా జలచరాలు, చేపలు, మొసళ్ళు వంటి సరీసృపాలు, అలానే కప్పలవంటి ఉభయచరాలు, అండజములు, వానరములు, దశలను దాటి బుద్ధికలిగిన జీవిగా మనిషి తక్కిన జీవరాసుల కన్న ఉన్నతస్థితికి చేరుకున్నాడు! ఇలానే మానవుడి భవిష్యత్ పురోగతి కనుక చేరుకొనివుంటే ఈపాటికి మనిషి భూమిమీద ఎన్నో దైవీశక్తులు సాధించివుండేవాడు! అయితే, విచారకరమైన సత్యం ఏమిటంటే భూమిమీద **మానవ పరిణామం నిలిచిపోయింది!**

ప్రకృతి ముందుకు తీసుకువెళ్ళినంతవరకే మనిషి పురోగమించాడు! కాని తర్వాతిదశలు మనిషి స్వప్రయత్నంమీదనే సాధనతో సిద్ధింపచేసుకోవాలి! ఈ **సాధన వెనకబడటంచేత** మానవజాతి పురోగతి నిలిచిపోయింది!

ఇలా తర్వాత దశను అందుకోకపోతే ఈ భూమిమీద మొత్తం మానవజాతికి గతంలో రాక్షసబల్లులకు పట్టినగతే పడుతుంది! అంటే అంతరించిపోతుంది! ఎందుకంటే **పురోగతిలేని** జీవులను ప్రకృతి క్షమించదు! ఇది జీవశాస్త్రంలో డార్విన్‌వంటి పరిణామసిద్ధాంతం ఋజువు చేసే సత్యాలు! దీని నిమిత్తమే మాస్టర్ C.V.V. లాగే గుర్జీఫ్‌కు పైనుండి ఒక **ఆధ్యాత్మిక శక్తి అవతరణ** జరిగింది! ముందుకుపోయే మానవపరిణామానికి తర్వాతి మెట్టును అందించింది! ఇది గుర్జీఫ్ రెండవ సిద్ధాంతం!

## 'నాలుగు'-మనస్సులు :

మనిషి మెదడులో ఒక మనస్సున్నది! కాని మనిషికి ఈ ఒక్క మనస్సే కాదు, ఇంకా నాలుగుమనసులు లేక **"జ్ఞానకేంద్రాలు"** భగవంతుడు ఏర్పాటు

చేసి వున్నాడు! ఇది గుర్జీఫ్ మూడవ సిద్ధాంతం!

మనం ఆలోచించే **మనస్సు** "ఆలోచనల-మనస్సు" (Intellectual Center) అనుకుంటే ఈ మనసుని అన్నిటినీ గ్రహించడం, తెలుసుకున్నవన్నీ జ్ఞాపకంలో రికార్డుచేయడం, ఇలా రికార్డుచేసిన అనుభవాల వెలుగులో జీవితాన్ని విశ్లేషించి మిగతా విషయాలను తెలుసుకోవడం ఇవన్నీ మానవుడి మొదటి మనసు లేక ఈ Intelectual Centre యొక్క పని!

ఇలానే మనిషిలో **హృదయకేంద్రం** వంటి **"భావనా-మనస్సు"** Emotional Centre పనిచేస్తుంది! ఇది ఆలోచనలకు సంబంధించిన అభిమానం, ప్రేమ, అనుబంధం వంటి **హృదయ సంబంధమైన** (Emotions) భావాలను నడిపించే కేంద్రం ఈ Emotional Centre.

మనలోని దుఃఖం, ఆనందం, కోపము, ప్రశాంతి అనబడే ఆవేశ కరమైన మార్పులు Emotional States — ఈ రెండవ లేక 'ప్రజ్ఞాకేంద్రం' సంబంధించినవి!

ఇకపోతే మూడవ "ప్రజాకేంద్రం" 'స్వభావకేంద్రం' (Instinctive Centre)! ఇది మనిషికి తెలివి ఉదయించకముందు జన్మించడంతోనే పసిపిల్ల వాడిగా ప్రకృతిఇచ్చేది; సహజంగా ప్రకాశించే **ప్రాణమయ-మనస్సు** అనుకోవచ్చు!

ఈ మనసు అధీనం వల్లనే మలమూత్రవిసర్జన, ఆకలి, ఆహారం జీర్ణమవడంవంటి — శరీరాన్ని బ్రతికించేలావుంచే కార్యక్రమాలన్నీ నిర్వహించ బడతాయి! ఈ జ్ఞానకేంద్రం సాధారణంగా **మనిషి కంట్రోలులో** వుండదు! మనిషినే ఇది కంట్రోలు చేస్తుంది! మానవజాతి పరిణామంలో ఇది విచ్చు కుంటే విశ్వప్రేమనూ అందరు జీవులనూ సమానంగా ప్రేమించగలిగే

శ్వాత్మయొక్క అనుగ్రహశక్తినీ అనుభవంతో అందుకోగలరు!

ఈ హృదయకేంద్రం పూర్తిగా విచ్చుకున్న మహాను భావులే మానవజాతి 'సం నిస్వార్థంగా పాటుపడే విశ్వప్రేమికులు అంటాడు గుర్జీఫ్! జీసస్, బుద్ధుడు, శ్రీకృష్ణపరమాత్మ, గురునానక్ వంటి అనేకమంది ప్రవక్తలు, యోగులు ఈ విశ్వప్రేమకేంద్రం విచ్చుకున్నందువల్లనే పనిచేయ అందరినీ ప్రేమించగలుగుతున్నారు!

ఇవికాక, ఇంకా **అతీత జ్ఞానకేంద్రం** (Higher Intelectual Centre) సెక్సుకేంద్రం కూడా మనిషిలో ఏర్పడివున్నాయి! ఇందులో సెక్సుకేంద్రం మనిషి అధీనం లో వుండదు! మానవుడి జననం మరణంతో సంబంధించిన ప్రక్రియలు ఇది నిర్వహిస్తూ వుంటుంది! ఇలాగ మనిషికి 7 **రకాల** మనస్సులు లేక **ఏడు 'జ్ఞానభూమికల'**ను ప్రకృతి ప్రసాదించింది! ఇది 'గుర్జీఫ్' -సిద్ధాంతం!

కాని ఈనాటి మానవుడు అందులో రెండు, మూడు ప్రాథమిక దశలకన్నా ఉన్నతకేంద్రాలు వున్నట్టే గుర్తించలేదు! దీనికి సైన్సుపరమైన యోగశిక్షణ అవసరం!

## మనిషి నాలుగు–శరీరాలు!

గుర్జీఫ్ సిద్ధాంతంలో మరొక ముఖ్యమైన నూతనసత్యం మనిషికి నాలుగు శరీరాలు! ఇందులో మనం నిత్యజీవనంచేసే స్థూలశరీరం రక్త మాంసాలతో ఏర్పడినది Physical body దీనిలోపలి ప్రాణశక్తితో ఏర్పడ్డ ప్రాణమయశరీరం! అలానే సూక్ష్మశరీరం లేక Astral body, జ్ఞానమయ శరీరం లేక Molecular body ఏర్పడివున్నట్టే మనిషి కాలంతో ఏర్పడ్డ శరీరం Time Body ఒకటి వున్నది!

దీనికి పైనవున్న ఎలక్ట్రానిక్ శరీరంతో మనిషి ఒకేసారి భవిష్యత్తులోనూ గతంలోనూ, వర్తమానంలోనూ ఏకకాలంలో జీవించగలడు — చిరంజీవుడుగా! ఎలక్ట్రానిక్ శరీరాన్ని సిద్ధింపచేసుకున్న యోగి అనేకచోట్ల ఇదే భౌతికశరీరంతో ఒకేసారి కనిపించగలడు! శ్రీకృష్ణుడు బృందావనంలో రాసకేళిలో అనేక శరీరాలు ధరించినట్టే, బుద్ధదేవుడు నూరుశరీరాలు ధరించి ఒకేసారి నూరుగురి భిక్షను స్వీకరించినట్టే — ఈ ఎలక్ట్రానిక్ శరీరంతో దూరాన్నీ, కాలాన్నీ జయించవచ్చు! దీనివల్లనే మృత్యువును కూడా మనిషి జయించ గలడన్నదే గుర్జీఫ్ సిద్ధాంతం!

28, అక్టోబర్ 1949 (ఉదయం 10.30 ని॥) ఆయన మరణించిన తర్వాత అకస్మాత్తుగా గుర్జీఫ్ నాలుగు దేశాలలోని తన శిష్యులకు భౌతిక శరీరంతో కనిపించి — ఒకరితో లండన్‌లో ట్రాఫిక్‌తో బిజీగావున్న రోడ్డు దాటించాడు — "నేను నీతోనే వుంటాను" — అని వీపుతట్టి మాయ మయ్యాడు!

అదే సమయంలో ఫ్రాన్సులోని మరొకశిష్యుని పైలట్‌గా పనిచేస్తున్న అతడి పక్క సీట్లో కూర్చుని విమానం వెనకకు తిప్పమని [గుర్జీఫ్ మరణించా డని చెప్పి, అతనికి తెలియదు] "అయినా నీకు అవసరమైనప్పుడు కనిపిస్తూనే వుంటాను" అనిచెప్పి అదృశ్యమయ్యాడు!

మరొక శిష్యుడికి ప్యారిస్‌లో మధ్యాహ్నం ఒక ఖరీదైన హోటల్‌కు తీసుకువెళ్ళి కడుపునిండా భోజనం పెట్టించి — బిల్లు చెల్లించి మరీ మాయమయ్యాడు!

మాస్టర్ C.V.V. లాగే మృత్యువుపై విజయాన్ని గుర్జీఫ్ చూపిస్తే మరణించిన తన ముసలి బామ్మను చనిపోయిన నాలుగురోజుల తర్వాత బ్రతికించారు! మాస్టర్ C.V.V. అరవిందయోగి, రమణమహర్షి లాగానే

మృత్యువుకు అతీత మైన నిర్వికల్ప సమాధిస్థితిని సిద్ధింపచేసుకున్నా — గుర్జీఫ్‌కూడా రమణమహర్షి, అరవిందయోగి, మాస్టర్ C.V.V. లాగే తన **భౌతికశరీరం మరణించక తప్పలేదు!**

అలా శరీరంతో మృత్యువుపై పూర్తివిజయం సాధించగలిగిన ఘనత ఒక్క **జ్యోతి రామలింగస్వామికే సిద్ధించింది!** అయినప్పటికీ ఈ నలుగురు యోగుల యోగసిద్ధులు, విజయాలు, **రానున్న సత్యయుగంలో** మానవజాతి మృత్యువుపై విజయాన్ని సాధించగలదు అని నిరూపించటానికే మనకీ తులనాత్మక విశ్లేషణయొక్క ప్రయోజనం!

మనలో చాలామందికి గుర్జీఫ్ గురువు గురించిగాని, ఆయన ఉపదేశాల గురించిగాని, ఏమీ తెలియనివారు అనేకమంది! నిజానికి చూస్తే అసలు **గుర్జీఫ్ మాస్టర్ C.V.V. గారు** ఇద్దరూ ఒకేవ్యక్తియా? **రెండు శరీరాలతో ఒకేవ్యక్తి** ఇటు రష్యాలోనూ అటు కుంభకోణంలోనూ జీవించి చూపారా? అన్నంతగా **వీరిద్దరి ఫోటోలుచూస్తే** మనకర్థమౌతుంది!

అదెలాగ సాధ్యం? అని మనం ఆశ్చర్యపోనక్కరలేదు! పరమహంస యోగానంద వ్రాసిన తన ఆత్మకథలో కాశీలో తన గురుదేవులు చూపిన అనుభూతితో **'రెండు శరీరాలతో యోగి'** — అన్న అధ్యాయంచూస్తే తెలుస్తుంది!

అలానే యూరప్ చరిత్రలో **సెయింట్ జర్మేన్** అనే మహా సిద్ధ పురుషుడు ప్రతీ వందఏళ్ళకీ ఒకసారి కనిపిస్తూంటాడు! కొంతకాలానికి మరణించడమూ సమాధి చేయబడటమూ జరిగింది! ఆ తర్వాత ప్యారిస్ లోనూ, జర్మనీలోనూ అనేకసార్లు ఇష్టంవచ్చినచోట్ల కనిపించీ, కనపించడమే కాక తనకిష్టమైన మిత్రులకు మంచిమంచి బహుమతులుకూడా ఇచ్చేవాడు! అందులో ఉసిరికాయంత ముత్యము, కోడిగుడ్డు ప్రమాణంలోని వజ్రాలు,



**G.I. గుర్జీఫ్**

పచ్చలువంటి విలువైన బహుమతులు జేబులోంచి విజిటింగ్‌కార్డు ఇచ్చి నట్టుగా ప్రజంటుచేసిచ్చేవాడు! చివరికీయన చరిత్రకారులకో తలనొప్పిగా పరిణమించాడు! ఈయన జన్మతేదీకాని, మరణించిన తేదీకాని, ప్రదేశంకాని, సమాధిచేయబడ్డ స్థలంకాని ఇదమిద్ధమని తేలలేదు! ఎందుకంటే అనేకచోట్ల ఈయన సమాధులు వున్నాయి! అయినప్పటికీ ఆఖరిసారి రష్యన్‌యోగి బ్లావెట్స్కికి కనపడి ఒకపెద్ద కవరును, ముఖ్యమైన ఉత్తరాలు కొన్ని ఇచ్చి వెళ్ళాడు! అందులో హిమాలయాలలో టిబెట్‌లోని సిద్ధపురుషులగురించి ఆమెకు ఆహ్వానం అందించాడు! యూరప్‌లో మరి కనపడలేదు! చాలాకాలం తర్వాత బ్లావెట్స్కి అనేక కష్టాలకోర్చి హిమాలయాలు మంచుకొండలు దాటి శంబలకై అన్వేషిస్తూపోతే దారిలో నలుగురు మహాత్ములు ఎదురయ్యారు గుర్రాలపై! అందులో ఒకరు సెయింట్ జర్మేన్! ఈమె ఆశ్చర్యం చూసి ఆయన నవ్వుతూ

**"మీరేం కంగారుపడకండి! నాకిలాంటివి మామూలే!"** అన్నారు!

విచిత్రమేమంటే అప్పటికి బ్లావెట్స్కి వయస్సు 50 సంవత్సరపడిలో వున్నది! కాని సెయింట్ జర్మేన్ మాత్రం సరిగ్గా ఆమెకు 16వ ఏట కనిపించినట్టుగానే వున్నారు!

ఇప్పటికీ ఈయన చరిత్ర అనేకరకాలుగా రాయబడివుంది! ఈయన రాసిన హస్తసాముద్రిక గ్రంథం మాత్రం ఒకకాపీ ఇప్పటికీ నావద్ద వున్నది!

దీనివల్ల తెలిసేదేమంటే మానవ పురోగతిలో మృత్యువును జయించడం సాధ్యం అని! అందరికీ కాకపోవచ్చుకాని — మృత్యువు తప్పనిసరి మాత్రం కాదు అని చెప్పడానికే!

మహాభారతంలో భీమునికి ఆంజనేయ దర్శనంవలే ఇలాంటి అనుభవాలు చిరంజీవులు ఉండటం నిజమని నిరూపిస్తాయి!

## 21

# జ్యోతి రామలింగస్వామి - 'పదార్థం' శక్తిగా మాయం!

ఈ ఇరవైయ్యవ శతాబ్ది మొదట్లో అవతరించిన మహాయోగులు సిద్ధ పురుషులలో ఈ భూమిమీద మానవజాతి పరిణామం వెనుకబడివుందని గ్రహించి, దానికిగల ఆటంకాలు సరిచేసి మానవుడికి అమృతత్వాన్ని సిద్ధింప చేసే ప్రయత్నాలు ధృఢసంకల్పంతో చేసినవారు నలుగురు (1) మాస్టర్ C.V.V. కుంభకోణంలోనూ, (2) శ్రీ అరవిందయోగి పాండిచ్చేరిలోనూ, (3) శ్రీ రమణమహర్షి అరుణాచలంలోనూ, (4) రష్యన్ సిద్ధపురుషుడు G.I. గుర్జేఫ్ మాస్కోలోనూ యింకా పారిస్, లండన్ నగరాలలో స్థాపించిన ఆధ్యాత్మిక శిక్షణాకేంద్రాలలోనూ ప్రారంభించారు. మృత్యువుపై విజయంకోసం సాగించిన ఈ గొప్ప తపస్సులో ఒక్కొక్కరు మరికొంత ముందుకు మానవ జాతిని తీసుకువెళ్ళగలిగారు. కాని వీరందరూ చివరికి వేరువేరు కారణాలవల్ల మృత్యువుకు తలవంచి శారీరకంగా మరణాన్ని పొందక తప్పలేదు!

కాని వీరిలో సంపూర్ణవిజయం సాధించిన ఘనత వడలూరు రామ లింగస్వామి అనబడే జ్యోతి రామలింగస్వామికే దక్కింది. ఏగమ్యాన్నైతే పైనల్గురూ చేరుకోలేకపోయారో దానిని శ్రీ రామలింగస్వామి అవలీలగా సిద్ధినిపొంది — శరీరంకూడా మరణించాల్సిన అవసరంలేకుండా — పదార్థమయ శరీరాన్నికూడా జ్యోతిగా మార్చుకోగల్గిన మహామహుడుగా వెలిగాడు.

ఈ ధృక్కోణంనుంచీ శ్రీవడలూరు రామలింగస్వామి జీవితం మాస్టర్ C.V.V. యోగాన్ని అధ్యయనంచేసే యోగవిద్యార్థులకు అత్యవసరం! ఈ తులనాత్మక పరిశీలనవల్ల ఏవిజయాన్ని — **'మృత్యువును జయించటం'** అనే గమ్యాన్ని మాస్టర్ C.V.V., అరవిందయోగి, రమణమహర్షి సహితం సాధించలేకపోయారో ఆ మహోన్నత జ్యోతిగా మారిపోయే సిద్ధిని శ్రీరామలింగ స్వామి ఎలా చేరుకోగలిగారో అన్నదే ప్రస్తుత అధ్యాయంలోని మన పరిశీల నాంశం!

మొదటినుంచీగూడా శ్రీజ్యోతి రామలింగస్వామి జీవితం ఒక కారణ జన్మ అనీ, ఆయన ఈశ్వర ఆదేశంతో అవతరించిన మహాపురుషుడనీ స్పష్టం చేయబడింది. మద్రాసు రాష్ట్రంలోని చిదంబరం నగరానికి 20 కిలోమీటర్ల దూరంలోఉన్న మరుదూరు అనే గ్రామంలో సాధారణ మధ్యతరగతి కుటుంబంలో 5 అక్టోబరు 1823వ సంవత్సరంలో అవతరించారు!

స్వామి రామలింగ కడుపునపడకముందే ఒకరోజున పవిత్రజీవనం గడుపుతున్న శ్రీరామయ్యపిళ్ళై, చిన్నమ్మదంపతుల ఇంటికి ఒక ఆజాను బాహుడైన శివయోగి భిక్షకై వచ్చాడు. ఆయనరూపం విలక్షణంగా వున్నది — చెయ్యెత్తు మనిషి అగ్నిలాగ మెరిసే కాషాయాంబరం ధరించి 'ఓం' కారం జపించుకుంటూ భిక్షకై వచ్చిన ఆ శివయోగి చిన్నమ్మను 'తనకి

ఆకలవుతున్నదనీ, కడుపునిండా అన్నంపెట్టగలవా?" అని భిక్షించాడు. అభ్యాగతుడే స్వయంగా భగవానుడన్న సంపూర్ణ విశ్వాసంతో ఆతల్లి శివయోగిని స్నానానుష్ఠానాలను పూర్తిచేసుకోమనిచెప్పి త్వరత్వరగా వంటపూర్తి చేసి పిండివంటలను, శుచిగా మడిగావండిన సిద్ధాన్నంను నివేదించింది.

**"ఈశ్వరార్పణమస్తు! అన్నదాతా సుఖీభవ!"** అంటూ ఆప్రసాదాన్ని తృప్తిగా భుజించిన శివయోగి చిన్నమ్మను దగ్గరకుపిలచి ప్రేమతో, కరుణతోనిండిన వెడల్పాటికళ్ళతో ఆమెవంకే చూస్తూ యిలాఅన్నాడు

> "తల్లీ! ఈరోజున నన్ను సొంతకొడుకులాగ పొట్టనిండా బువ్వపెట్టావు! నేను సంతృప్తుడనైనాను! నీకో మంచివార్త చెప్పి పోదామని వచ్చాను. నీవు త్వరలోనే తల్లివి కాబోతున్నావు! అంతేకాదు నీకడుపున మానవుల జ్ఞానంకోసం ఆకలిని సంతృప్తి పరచే సిద్ధగురువు అవతరిస్తాడు. నామాట గుర్తుంచుకో! ఆయన అవతరించటంవల్ల అంతటా అనుగ్రహవర్షం కురుస్తుంది! అతడు పుట్టుకతోనే జ్ఞానిగా నీ కడుపున అవతరిస్తాడు తల్లీ! నిజానికి అతడు నా పుత్రుడు! — అంటే ఈశ్వరపుత్రుడు. జగత్తునుద్ధరింపచేయ డానికి అవతరించే శివజ్యోతి! నీ జన్మ నిజంగా ధన్యమైందమ్మా! ఇటురా!"

అంటూ తన జోలెలోంచి విభూతిని ఘుమఘుమలాడే కర్పూర పరి మళంతో సువాసన వెదజల్లుతూండగా చిటికెడు తీసి నుదుటపెట్టి మరికొంత ఆమెనోటవేసి కొంచెం విభూతిని ప్రసాదంగా కట్టియిచ్చాడు.

> "ఈ విభూతి నీకు మహాధనం! ఈ బంగారాన్ని నీకొంగున కట్టివెళతాను! ఇందులో కొంత నీ భర్తకుకూడా యివ్వు! భక్తిగా భగవానుని ఆరాధించుకోండి!"

అంటూ ఆ శివయోగి మెరపు మెరసినట్లు వెనక్కితిరిగి పదడుగులు వేసి అక్కడే మాయమైయ్యాడు.

త్వరలోనే తల్లి చిన్నమ్మ గర్భం ధరించింది. ఆమెకు ఏవేవో దివ్య ధ్వనులు, శంఖధ్వానమూ, మద్దెల, సన్నాయి, మృదంగంవంటి మంగళ ధ్వనులూ వినిపించేవి. ఒక్కోసారి అకస్మాత్తుగా ఒక దివ్యపరిమళం పచ్చ కర్పూరం విభూతి కలిసిన వాసనతో గుప్పున అంతటా వ్యాపించేది! "శివానుగ్రహం" అనుకొని ఆ దంపతులు ఆ వచ్చిన శివయోగి సాక్షాత్తూ పరమ శివుడే అని అభిమానించసాగారు. కాని నవమాసాలు నిండినా ఎంతకీ ప్రసవం కలుగలేదు! చివరకు శివునికి ప్రీతియైన 11వ మాసం (ఏకాదశ రుద్రులు) లో 5-10-1823న ఒక శుభముహూర్తంలో సూర్యునిలా వెలిగిపోతున్న బహుసుందరమైన పసిబిడ్డ జన్మించాడు. తల్లిదండ్రులు ఆ బిడ్డకు రామలింగం అని పేరుపెట్టి ప్రేమతో పెంచసాగారు.

రామలింగస్వామికి ఐదునెలలప్పుడే తల్లి ఆ బిడ్డని చిదంబరంలోని నటరాజస్వామి ఆలయంలోకి తీసుకువెడితే, ఆ పసిపాపడు తదేకంగా దృష్టిసారించి ఆ దేవుడ్ని చూడటం మొదలెట్టాడు. ఉన్నట్టుండి పకపకా నవ్వటం ప్రారంభించాడు. పూజారికికూడా ఆ చిన్నబాలునిలో దివ్యప్రభలతో వెలుగుతున్న ఓదేవతామూర్తి కనిపించాడు. అప్రయత్నంగా అన్నాడు "**ఇతడు దేవునిబిడ్డ**" అని. ఆలయప్రాంగణంలో మంగళసూచకంగా గంటలు మ్రోగాయి.

ఆనాడు ఆ బాలుడికి కనిపించింది "**విశ్వరూపం**"! దివ్యానందంతో చేసిన దరహాసమే ఆనవ్వు! ఈ విషయాన్ని 35 సంవత్సరాల తర్వాత ఆలయాన్ని సందర్శించినప్పుడు రామలింగస్వామే ఇలాఅన్నాడు :

"ఓ తండ్రీ! ఈశ్వరా! నాకు ఐదునెలలప్పుడే నీవిశ్వరూప దర్శనం ప్రసాదించి అనుగ్రహించిన నీదయను ఎంతలా పొగడను? ఓ దేవాధిదేవా సమస్తలోకాలూ, అనేక బ్రహ్మాండాలూ, గ్రహగోళాలు సహితం నీలో ఉదయిస్తూ వెలుగొందుతూ అస్తమిస్తున్నాయి! చూడశక్యంగాని ఎంతటి తెల్లని దివ్యమైన వెలుగునీది! ఈ జ్యోతియే నా జీవితాన్ని పునీతం చేస్తుంది స్వామీ! నన్ను నీ జ్యోతిలో ఐక్యం చేసుకోవూ?"

"ఓ దేవాధిదేవా! నేను నిన్ను మిక్కిలిగా ప్రార్థించేది ఒక్కటే! నేను అనేక దుర్గుణాలు కలిగిన నికృష్టజీవిని! ఒప్పుకుంటున్నాను! నాలో బోలెడంత అహంకారమూ, కోరికలూ, ఆత్మాభిమానం గూడు కట్టుకుని వున్నాయి! ఇలాంటి నేను నీవు దయచూడకపోతే ఎలా తరించగలను స్వామీ? ఎందరో మహానుభావులు వారి దివ్య గుణాలవల్లనే నిన్ను చేరుకోగలరు! కాని నేనో? ఒక క్రిమివంటి అల్పజీవిని! కేవలం నీ అనుగ్రహకటాక్షంతప్ప నాకు వేరుమార్గం లేదు! ఓ అనుగ్రహజ్యోతీ! ఓ ఆనంద పుంజమా! నీ అమృతతత్త్వం భావన చేసినంతనే నామనస్సూ, శరీరమూ ఒక కమ్మని అమృత రుచితో నిండిపోతున్నాయి స్వామీ! మృత్యువును దాటించి నన్ను నీజ్యోతిలో చేర్చుకొని — నన్ను నీవుగా మార్చుకోస్వామీ!"

అంటూ ప్రతినిత్యమూ కట్టలుతెంచుకొని ప్రవహించే భక్తితో తన గురువూ, దైవమూ, తండ్రీ ఐన పరమశివుని ప్రార్థించేవాడు రామలింగం! దీనివలన అతడికి అత్యుత్తమమైన జ్ఞానం, తను వెళ్ళవలసిన సాధనమార్గం దానంతట అదే వెలిగి దారిచ్చి మార్గాన్ని చూపించింది.

అది ఎలాగంటే 9 సంవత్సరాలు నిండుతున్న రామలింగం ఆరోజు కూడా పరవశంగా దివ్యగానం చేశాడు భక్తితో! గొప్ప విద్యుత్తువంటి వెలుగు

వెలిగి ఎట్టయెదుట కళ్ళకు కనిపిస్తూనే ఆరుముఖాలు, పన్నెండుచేతులు కలిగి శక్త్యాయుధం ధరించి నెమలివాహనంతో కుమారస్వామి దర్శనమిచ్చాడు. తండ్రియైన శివునికే గురువైన సుబ్రహ్మణ్యుడే ఆనాటినుండి రామలింగ స్వామికి ఆరాధ్యదైవం! పరవశంతో దివ్యగానం చేశాడు.

"ఓ సుబ్రహ్మణ్యస్వామీ! ఆరుముఖాలూ, పన్నెండుచేతులూ,
శూలాయుధమూ ధరించి నెమలివాహనంపై నాకు దర్శనమిచ్చి
నీవు మాయలో పడకుండా నన్ను కాపాడావు!"

అంటూ ఎన్నో మధురకీర్తనలు ఆశువుగా చెప్పాడు. కళ్ళు మూసినా తెరచినా ఎల్లప్పుడూ సుబ్రహ్మణ్యస్వామి సుందర బాలరూపం ఆనంద నాట్యంతో చిందులు తొక్కుతూ కనిపించేది.

కాని శాస్త్రప్రకారం ఉపదేశం కాలేదన్న బెంగతో తన అన్నగారిని తనకి గురూపదేశం చేయాల్సిందిగా కోరాడు! అన్నగారికి తమ్ముడు ప్రతిభా వంతుడు అవుతున్నాడని పరమానందం కలిగింది. ఇప్పుడతడే రక్షకుడూ తల్లీతండ్రీఅయి రామలింగాన్ని పెంచుతున్నాడు. ఎందుకంటే రామలింగం జన్మించిన చిన్నతనంలోనే తండ్రి రామయ్యపిళ్ళై, తల్లి చిన్నమ్మ శివసాన్నిధ్యం చేరుకున్నారు. అన్నవద్ద ఉపదేశం పొందిన రామలింగం ఉత్సాహంతో రోజంతా జపధ్యానాలతోనే మునిగిపోయేవాడు.

నయనార్లలో ముఖ్యులైన 'జ్ఞానసంబంధనార్', వ్రాసిన 'పెరియ పురాణం', చక్కగా చదివారు. ఎన్నో శైవగీతాలు పురాణాలు చూచీ చూడగానే కరతలామలకా లయ్యేవి. మాణిక్యవాచకర్ రచించిన 'తిరువాచకం', గణేశ సంబంధర్ అనే శివభక్తుని చరిత్ర తన తమ్మునిచే చదివించాడు సభాపతి. తన తమ్ముడు ఆ గ్రంథాలను పఠించే తీరు, అర్థం చేసుకోవడంచూచి ఆనాటి తన తమ్ముడు వీడేనా అని ఆశ్చర్యపోయాడు సభాపతి.

సోమశెట్టి అనే ఓ ధనవంతుడి యింట్లో ప్రతిరోజూ వెళ్ళి పురాణం చెప్పేవాడు సభాపతి, అక్కడికి అనేకమంది పండితులుకూడా వచ్చేవారు. ఒకనాడు సభాపతికి వంట్లో బాగాలేక వెళ్ళలేకపోయారు. అప్పుడు రామలింగం తను వెడతానని అన్నగారి అనుజ్ఞతీసుకుని వెళ్ళాడు. సభాపతి తమ్ముడినైతే పంపాడేకానీ, అక్కడికి మహామహాపండితులు వస్తారే, వాళ్ళముందు 12 సంవత్సరాలుకూడా నిండని తన రామలింగం ఎలా చెప్పగలడా? అని ఒకవైపు సంశయంతోనే వున్నాడు.

మరుసటిరోజు, సోమశెట్టి స్వయంగా సభాపతి యింటికివచ్చి, మీ తమ్ముడినే పంపండి! మహామహా కాకలుతీరిన పండితులుకూడా మీ తమ్ముడి వాక్పటిమ శాస్త్రపరిచయం చూచి ఆశ్చర్యపోయారు! వాళ్ళ ప్రశ్న లన్నిటికీ ఎంత చక్కగా సమాధానాలు చెప్పాడో తెలుసా! అందరూ ఆ అబ్బాయితోనే చెప్పించమని అడుగుతున్నారు... కనుక మీరు దయచేసి ఆ అబ్బాయినే పంపండి... సభాపతీ! నిజం చెప్పాలంటే మీ తమ్ముడు సామాన్యుడు కాదయ్యా! వరప్రసాదుడు...' అన్నాడు.

సభాపతి చాలా ఆనందపడిపోయాడు. చిన్నప్పుడు తన తల్లికి శివయోగి చెప్పిన విషయం గుర్తుకువచ్చింది. ఆనాడు రామలింగం ఐదునెలల ప్రాయంలో నటరాజు ఆలయంలో ఆ మూర్తిని చూచి పకపకా నవ్వటం, పూజారీ అప్రయత్నంగా "దేవునిబిడ్డ!...." అనటం అతని కళ్ళముందు నిలచింది. తనకంతటి గొప్పవాడైన తమ్ముణ్ణి ప్రసాదించినందుకు ఆ భగవంతుడికి మనసారా కృతజ్ఞతలు తెలిపాడు.

వదినగారు తన మరిది తనముందే ఇంతగా ఎదిగిపోతూంటే, అందరి మన్ననలూ పొందుతూంటే పొందిన సంతోషానికి అవధుల్లేవు.

రామలింగానికి 16 ఏళ్ళు నిండినాయి. నవయవ్వనంలో వున్నా, అతని

ధ్యాసఅంతా ఎప్పుడూ భగవంతునిమీదే. మద్రాసు దగ్గరలోనున్న తిరువత్తూరు లోని శివాలయంలోనే ఎక్కువకాలం గడిపేవాడు. అక్కడే ఆయన ఎన్నో భక్తిగీతాలు రచించారు!

"భగవాన్! సర్వాంతర్యామీ! నా హృదయం నీ సాక్షాత్కారం కోసం విలపిస్తోంది స్వామీ! ఎందుకు ఆలస్యం చేస్తున్నావు భగవాన్! తల్లికోసం విలవిలలాడుతున్న లేగదూడలావుంది స్వామి నా బ్రతుకు!

"ఓతండ్రీ! నా యీ ఆక్రందన వినిపించడంలేదా! నీలో నన్ను చేర్చు కోవడానికి, నీకు యిష్టంలేకపోతే నేనేమైపోతాను? నేనెక్కడికి పోగలను! నాకు మరో శరణ్యంలేదే స్వామి! తేనెటీగలు పుప్పొడికోసం పుష్పాలపై వ్రాలినట్లు, ఆనందామృతాస్వాదనకై నీ పాదచరణాలపై వ్రాలుతున్నాను స్వామీ! ఎప్పుడూ నాకు ఆ ప్రసాదం లభింపజేస్తావు స్వామీ!"

రోజురోజుకు భగవంతునిపై తపన మరింతగా ఎక్కువైపోతోంది. భగవంతునిలో లీనమైపోవాలన్న, ఆనాటి ఆయన బాధే, కమనీయమైన భక్తిగీతాలుగా వెలువడ్డాయి.

ఒకనాడు అలా భగవంతునికై ఏడ్చి, ఏడ్చి కన్నులు కాయలుకాచాయి. కళ్ళనిండా నీరు నిండివుంది. ఆ కన్నీటి మసకలో ఓ దివ్యరూపం కని పించింది. కన్నీళ్ళు తుడుచుకుని చూచాడు. ఎదురుగా శివయోగి కని పించాడు. రామలింగం గర్భంలోవుండగా "నీకు దేవునిబిడ్డ జన్మించ బోతున్నాడు" అని తల్లిని దీవించిన మహాత్ముడు.

ఒక్కసారి ఆనందభాష్పాలు వెలువడ్డాయి రామలింగనినుండి! ఆ కన్నీటితోనే ఆయనపాదాలు కడిగివేశాడు.

"ఓ కరుణాసముద్రా! కరుణాంతరంగా! నన్ను కరుణించుస్వామీ!

నన్ను తరింపచేయి స్వామీ! ఎన్నాళ్ళుగానో వెతుకుతున్న గురువు యీనాటికి లభ్య మైనారా స్వామీ? తమరే నా గురుదేవులు! తమరే నా దైవం! నాకు తరుణోపాయం ప్రసాదించుస్వామీ! దిక్కుతోచక దారి తెలియక అలమటించి పోతున్నాను స్వామీ! నాకు మార్గం చూపించాల్సింది తమరే. ఆ భగవంతుని చరణారవిందాలు చేరుకునే మార్గం మీరే బోధించాలి స్వామీ" అంటూ ఎన్నాళ్ళుగానో తల్లిని తప్పిపోయిన పిల్లవాడు, తన తల్లి ఆచూకి తెలిసిన వ్యక్తి కనిపించగానే ఏడ్చినట్లుగా, వెక్కివెక్కి ఏడుస్తూ ఆయన పాదాలపై పడిపోయాడు రామలింగం.

"నాయనా! భయపడకు! నేను ఎప్పుడూ యిక నీతోనే వుంటాను. నీకు తరణోపాయం ప్రసాదించడానికే వచ్చాను! ప్రతినిత్యం నన్నే ధ్యానించు, నీ కమ్మని కంఠంతో నన్ను గానంచెయ్యి! భక్తితత్వాన్ని ప్రచారం చెయ్యి! అందరిలో నన్ను గుర్తించు, అందరినీ ప్రేమించు. ప్రేమే త్యాగం, త్యాగమే తరుణోపాయం!... నా కటాక్షం నీమీద ఎప్పుడూ ప్రసరిస్తూనే వుంటుంది. నీద్వారా నేను యెంతో లోకకళ్యాణం చేస్తాను అంటూ!..." అభయమిచ్చాడు. మరుక్షణంలో ఆ యోగి మాయమయ్యాడు. తన కోసం భగవంతుడే, తన గురువు రూపంలో తనకు సాక్షాత్కరించాడని నమ్మాడు రామలింగం.

ఆనాటినుండి ఆయన ఆధ్యాత్మిక ప్రచారం ప్రారంభించారు. తిరువ త్తూరులోని ఆలయంలో భక్తిమార్గాన్ని, ప్రేమమార్గాన్ని ఉపదేశిస్తూ, తన్మ యత్వంతో భక్తిగీతాలు ఆలాపిస్తూ వుండేవారు. ఆ ఆలయ ప్రాంగణంఅంతా ఆయన భగవన్నామసంకీర్తనంలో ప్రతిధ్వనించేది. ఆనాడు ఆయన గానం చేసిన పాటలే **"అరుల్-పా"** అనే గ్రంథంగా వెలువడింది.

రామలింగాన్ని పెళ్ళిచేసుకోవలసిందిగా యింట్లో ఒత్తిడి ప్రారంభ మయింది. ఎంతవద్దని బ్రతిమాలినా ఆయనమాట వినిపించుకోలేదు అన్నా

వదినలు. అన్న సభాపతి బలవంతం మరీఎక్కువైంది. 'జ్ఞానసంబంధనార్' అనే బాలయోగి పెళ్ళి చేసుకోలేదా అని ప్రశ్నించాడు. తనను ప్రాణ ప్రదముగా ప్రేమించే అన్నావదినలమాట కాదనలేకపోయాడు. అక్క కూతురైన ధనమ్మాళ్‌తో వివాహమైంది. ఆయనకు వివాహజీవితంమీద ఆసక్తి లేదు. శోభనంనాటి రాత్రి 'తిరువాచకం' చదివి భార్యకు వినిపించాడు. ఆయన ఏనాడూ సంసారికజీవితాన్ని గడుపలేదు. ఆమె ఆరుమాసాలకే మరణించింది. భగవంతుడు ఆయన్ను సంసారబంధంనుండి విముక్తుణ్ణి చేశాడు.

తిరువత్తూరులోని ఆలయంలో ఆయన ఉపదేశాలు వినడానికి వచ్చే భక్తులసంఖ్య నానాటికి హెచ్చుకాసాగింది. తన మధుర గానామృతంతో భక్తుల హృదయాలలో భగవంతుణ్ణి ప్రతిష్ఠింపచేసేవాడు. భగవంతుడి ఆరాధనలో వారి జీవితాలు పనిముట్లుగా తయారుచేశాడు.

హఠాత్తుగా తల్లి, అన్నగారు మరణించడం, మరో అన్నగారైన పరశురాము దీర్ఘవ్యాధికి గురికావడం ఆయన్ను ఎంతగానో కృంగదీసింది.

తల్లి అంత్యక్రియలు ముగియగానే, ప్రాపంచిక బంధాలు తొలగిపోయి నాయి రామలింగానికి. కొందరు భక్తులతో కలసి మద్రాసు వదలి చిదంబరం చేరాడు. అక్కడినుంచి కురుకుంజి చేరాడు.

అక్కడ ఆయనను దర్శించే భక్తులసంఖ్య ఎక్కువయింది. ఒకసారి ఆయన ఓ కుంటివాణ్ణి చూచి కరిగిపోయాడు. కారుణ్యం నిండిన కళ్ళతో అతడిని దీవించాడు. అంతే! అతనికి కాళ్ళువచ్చాయి! తన ప్రార్థనలను ఆలకించిన భగవంతుడికి కృతజ్ఞతాంజలితో మోకరిల్లాడు.

మరో గుడ్డివాడిని చూచి అలాగే ప్రేమతో భగవంతుణ్ణి ప్రార్థించాడు. భగవంతుడాతని ప్రార్థనలు ఆలకించాడు. ఆ భక్తుడికీ కళ్ళువచ్చాయి.

మరోసారి, ఓ చెవిటివాడి విషయంలోనూ అంతే; "భగవాన్! నీ నామాన్ని వినేలా ఆతన్ని కరుణించవా స్వామీ" అంటూ ప్రార్థించగానే, రామలింగడు పరవశంతో గానం చేస్తున్న భక్తిగీతాలు ఆ చెవిటివాని చెవుల్లో మార్మోగాయి.

ఎవరినైతే తను కరుణించేవాడో, భగవంతుడు వెంటనే వారిని అనుగ్రహించేవాడు. తనకు లభించిన యీ సిద్ధులను భగవత్ ప్రసాదంగా స్వీకరించాడు. లోకకళ్యాణం కోసం తన జీవితం నిర్దేశించబడిందని గుర్తించాడు.

తర్వాత అయన కురుకుంజినుండి దగ్గరలోనున్న వడలూరు గ్రామం చేరుకుని అక్కడే తన ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

1865లో "నవరస శుద్ధ సన్మార్గ సత్సంఘం" అనే ఒక సంస్థను ప్రారంభించారు.

"సంకుచితమైన కొత్త మతాలను సృష్టించడం నా లక్ష్యంగాదు; స్వర్గ నరకాలను చూపి ప్రలోభపెట్టడం, భయపెట్టడం నా ఉద్దేశ్యంకాదు. మిమ్ములను దివ్యపురుషులుగా మార్చడమే నా ఏకైకలక్ష్యం.

"నేను సంకేతాన్ని ధరించి ముందుకు నడుస్తున్నాను. అందరూ యీ వెలుగుబాట వెంట నడచిరండి".

"ప్రతి వ్యక్తిలోనూ, ప్రతి జీవరాశిలోనూ భగవంతుణ్ణి చూడడమే భక్తియోగం!"

"ఈశ్వరైక్యం పొందడానికి 81 లక్షల జీవరాసులపైనా ప్రేమ కలిగి వుండాలి. ఒకే ఆత్మ యిన్ని రూపాలలో అభివ్యక్తమౌతోంది. వారందరి సేవద్వారానే విరాట్పురుషునిలో ఐక్యం కాగలం".

"సమస్త వేదాంత సాధనలకూ స్త్రీలు అర్హులు. స్త్రీలను విద్యావంతులను చేయాలి! - ప్రతి స్త్రీలోనూ పురుషుడూ, ప్రతి పురుషునిలోనూ స్త్రీ

వుంది."

'మాయలకు వశులై మానవులు పాపాలు చేస్తున్నారు. తమ విరాట్ స్వరూపాన్ని విస్మరించడంవల్లనే మాయలో చిక్కుకుంటున్నారు. లోభం, స్వార్థం, అహంకారం, ధనమదాంధత, పక్షపాతం, కీర్తికాంక్ష, ఇవి ప్రధాన శత్రువులు. తస్మాత్! జాగ్రత్త!"

అలా ప్రతి హృదయంలో దైవత్వాన్ని నెలకొల్పడానికి అవిరళకృషి చేశాడు.

ఒకనాడు ఆశ్రమంలో భజన ప్రారంభంకాబోతోంది. దీపారాధనకై దీపం వెలిగించడానికి ఆశ్రమంలో నూనెలేదు. శిష్యులు కంగారుపడుతున్నారు. ఇది గమనించిన రామలింగం చిరునవ్వుతో **"నాయనా! ఫర్వాలేదు! నూనె లేకపోతేపోయింది! నీరుపోయండి!"** - అన్నాడు. ఆ నీటితోనే వారు వెలిగించగా దీపం వెలిగింది.

ఆశ్చర్యపోతున్న భక్తుల్ని ఉద్దేశించి "భగవత్స్వరూపులారా! ఇందులో ఆశ్చర్యపోవడానికేముంది? ఇంతమంది భక్తులు చేరిన యీ క్షణంలో యీ మాత్రం మహిమ బయటపడడంలో వింత ఏముంది? సర్వత్రా వ్యాపించియున్న ఆ పరంజ్యోతే ఈనాడు యిక్కడా వెలిగింది. భక్తుడు ప్రేమతో పిలిస్తే భగవంతుడు తప్పక పలుకుతాడు" అన్నారు.

ఆయనది శుష్కవేదాంతం కానేకాదు. దీనజనులు, అన్నార్తులు ఆయనకు భగవంతుని స్వరూపాలే. వారిలోని దైన్యాన్ని, ఆకలిమంటలు తొలగించడానికి 1867 లో నిరంతర అన్నదానం జరిపేందుకై 'ధర్మశాల'ను ప్రారంభించారు. ఈనాటికీ ఆ సంస్థ తన మానవసేవను కొనసాగిస్తూనే వుంది.

1871లో 'సత్యగానసభ"ను స్థాపించారు. ఆనాడు వడలూరులో

అఖండ జ్యోతిని వెలిగించారు.

"అరుళ్ పెరుంజ్యోతి అరుళ్ పెరుంజ్యోతి
తనిప్ పెరుంగ్ కరుణై అరుళ్ పెరుంజ్యోతి"

(మనోహరమైన అనుగ్రహజ్యోతి! మహోన్నతమైన అనుగ్రహజ్యోతీ! ఒక్కడవై అంతటా వ్యాపించివున్న కరుణామూర్తీ! మనోహరమైన అనుగ్రహ మూర్తీ!")

ఆనాటి వారి దివ్యసందేశం అది. ఆ పరంజ్యోతి ప్రతివాని హృదయా లలో వెలగాలని వారి ఆకాంక్ష.

"భగవంతుడు నీ తల్లీ, తండ్రి, గురువు, భార్యా-బిడ్డలు చెయ్యలేని గొప్పమేలు నీకు చేస్తున్నాడు, చేయబోతున్నాడు. నమ్మండి! నమ్మండి!"

"ఈశ్వరుణ్ణి మనసా, వాచా, కర్మణా కీర్తించండి. దీనులకు, దరిద్రు లకు సహాయపడండి. ఆ సర్వజ్ఞుని ముందు మీ అల్పత్వాన్ని నిజాయితీతో అంగీకరించి శరణువేడండి. దీనితో అజ్ఞానపుకథ అంతమవుతుంది. భగవంతు నకు జయమగుగాక."

అష్టభుజాలతో పద్మాకారంలో నిర్మించబడిన ఆలయంలో యీ జ్యోతి వెలిగించబడింది. ఆయన ఆనాడు వెలిగించిన ఆ దివ్యజ్యోతి యీనాటికీ వెలుగుతూ యీ భూమిమీద ఆధ్యాత్మిక వెలుగు కిరణాలను ప్రసారం చేస్తూనేవుంది. అజ్ఞానపు అంధకారంలో కొట్టుకుపోతున్న మముక్షువులకు జ్ఞానదీపికలు చూపుతోంది.

ఆ జ్యోతిర్మందిరానికి ఏడుతెరలు కప్పివున్నాయి. నలుపు, నీలం, తెలుపు, ఆకుపచ్చ, ఎరుపు, పసుపు అన్నీకలసి ఏడుతెరల వెనక దేదీప్య మానంగా ఆ అఖండజ్యోతి వెలుగుతోంది. ఏడుతెరలూ మనిషిలో వున్న

మాయాతెరలు. తేజోమయమైన భగవత్ తత్త్వానికి అడ్డంగావున్న మాయా వలలు! వాటిని చేధించుకొని ఆ భగవంతుని చేరపిలిచాడు రామలింగ స్వామి!!!

**"శరీరమే దీపం. రక్తమే తైలం. వీర్యమే వత్తి. ఆత్మే జ్యోతి. దీపాన్ని భద్రపరచుకొన్నట్లుగా శరీరాన్ని భద్రపరచుకో! ఆత్మదర్శనానికి మానవ శరీరమే ఉపకరణ. శరీరాన్ని అలక్ష్యపరచవద్దుసుమా!"**

క్రమంగా రామలింగస్వామి సాధన పరాకాష్టను చేరుకుంది. తన శరీరమే ప్రమిదెగా ప్రాణశక్తియే నేయిగా తన మనస్సే వత్తిగాచేసి భక్తినే జ్యోతిగా వెలిగించి తీవ్రసాధనచేసిన రామలింగానికి క్రమంగా అన్నీ ఒకటై కలిసిపోయినాయి. ప్రమిద కరిగి నేయిగా మారింది. నెయ్యి వత్తిగా ప్రవ హించింది. వత్తి జ్యోతిలా అంటుకొని భగ్గునవెలిగి పరంజ్యోతిలో లీనమై పోయింది. ఇంకెక్కడి ప్రమిద? ఇంకెక్కడి వత్తి? ఇంకెక్కడి దీపం? సమస్తమూ జ్యోతియే!

రామలింగస్వామి చరమదశ యిటు సైన్సుకూ అటు **ఊహకూ అతీత** మైన మహోన్నతస్థితి! పదార్థం **అణువులుగానూ, అణువులు పరమాణువులు గానూ, పరమాణువులు ఎలక్ట్రానులుగానూ విడిపోయి చివరికి ఈ ఎలక్ట్రానుల రూపంలోవున్న పదార్థమంతా శక్తిగా కరిగి, జ్యోతిగా వెలిగి శివజ్యోతిగా మారి పరంజ్యోతిలో ఐక్యమైంది.** ఆ పవిత్ర పుణ్యదినమే 30-1-1874.

జ్యోతిరామలింగస్వామి చూపిన అద్భుతంవల్ల కలియుగంలో శరీరంతో ముక్తినిపొందే అవకాశం యదార్థమని నిరూపించింది. రానున్న సత్యయుగం లో మానవజాతికి యోగసాధనలో గమ్యంగా నిలచిపోయింది. దానిని అందరు యోగులూ చేరుకోలేకపోవచ్చు! — కాని చేరుకోగలరని, అది సాధ్యమని నిరూపించే అద్భుత సత్యమే రామలింగస్వాముల అనుభవం —

సిద్ధిగా నిలిచిపోయింది. తద్వారా రానున్న సత్యయుగంలో ఈ కలియుగపు చీకటిభయాలు వదలిపోయాక — మానవజాతి చేసుకున్న చెడుకర్మలన్నీ యుద్ధాలరూపంలోనూ, భూకంపాలలాగా, కరువుకాటకాలు, భయంకర ప్రళయాల ద్వారా ప్రక్షాళనమైన తరువాత చీకటిపోయి సూర్యుడుదయించి నట్లు సత్య యుగం ఉదయించగానే — మానవజాతికి శరీరంతో జ్యోతిలో ఐక్యమైపోయే సావకాశాలు సుదూరంగా మానవజాతి భవిష్యత్తులో తూర్పునే వెలుగు తోరణంలా వెలిగే ఇంద్రధనుస్సులా నిలచిపోయాడు జ్యోతిరామలింగ స్వామి. అంతేకాదు! నీటిఆవిరిపైనుండి వీచే చల్లగాలికి వడగళ్ళుగా ఘనీభ వించినట్లే జ్యోతిలో ఐక్యమైన రామలింగస్వామి తిరిగి సమీప భవిష్యత్తులోనే సశరీరంగా అవతరించగలనని అప్పటికి మానవజాతి తన ఉపదేశాలను విశ్వసించగలదని ఢంకామీద దెబ్బకొట్టి ప్రకటించి మరీచెప్పాడు. మానవ శరీరంతోనే మృత్యువును జయించటం సాధ్యమని నిరూపించే సుదీర్ఘ ప్రయాణంలో శ్రీ అరవిందులు, రమణమహర్షి, రష్యన్‌సిద్ధుడు గుర్జేఫ్, మాస్టర్ C.V.V. నడచిన అడుగుజాడలు చివరిమెట్టుకాదు! కాకపోవచ్చు — కానీ చివరిమెట్టుకు అందించే కొండపైకెక్కే ముందరిమెట్లుగా నిలిచిపోతాయి.

సైన్సు పురోగతిలో ఐన్‌స్టీన్, రూథర్‌ఫోర్డు, నీల్స్‌బోర్ వంటి అణు సిద్ధాంతులు నిరూపించిన మహాసత్యమే — "అణువును పదార్థాన్ని శక్తిగా మార్చవచ్చు! శక్తీ–పదార్థమూ వేరుకాదు!" అన్న మహాసత్యాన్నే జ్యోతి రామ లింగస్వామి తన జీవితంలో అణుబాంబులవసరం లేకుండానే నిరూ పించాడు. **కేవల భక్తీ, శరణాగతీ వల్లనే!** ఇది మాస్టర్ C.V.V. పరిశోధకులకు కూడా గొప్ప వెలుగురేఖ!



## 22

# "నన్ను"-"నీవు"గా చేసుకో స్వామీ!

**మాస్టర్ CVV** అవతరణ ద్వారా భూమిమీదకి దిగిన నూతన "బ్రహ్మ శక్తి" మానవజాతికి అందుబాటులోకి రావడంతో, అది పూర్వకాలపు మతాల లోని బ్రహ్మానుభవాలవలే ఊహలమీదా ఊహించుకునే ధ్యానంమీదా* ఆధారపడకుండా మనిషియొక్క **నిత్యజీవితానుభవంలోకి** రావడం అన్న విషయం మానవజాతి పరిణామం ఒక అపూర్వమైన కొత్త అధ్యాయం! ఈ నేపథ్యంలో అనేక విషయాలు ఒకేసారి ఏకముఖంగా కేంద్రీకరించడం జరిగింది. అవి :- (i) భూమిమీద — మానవజాతి పరిణామం, (ii) దాని ప్రయోజనం, (iii) అందులో **మాస్టర్ CVV** యోగంయొక్క పాత్రగురించీ, ఇంతవరకూ గడిచిన అధ్యాయాలలోనుంచి ఒక అస్పష్టమైన అవగాహన ఏర్పడుతోంది!

మనిషి కేవలం జంతువులూ చెట్లలాగా మూఢదశలో అజ్ఞాన అవస్థలో ఆహారము, సంతానమూ, భయము — వంటి ఆవేశాలకు లోబడి

---

చూ. * "భావనా మాత్రసంతుష్టా"... లాగ

జవించడం కాకుండా భగవంతుడి సృష్టిలో మనిషికి ఒక కొత్తపాత్ర ఏర్పడింది! అదేమిటంటే (1) ఇటు భూలోకంమీద జరిగే — ప్రాణులయొక్క పరిణామానికీ, (2) అటు సూర్య కుటుంబంలోని గ్రహాలలో జరిగే ఆధ్యాత్మిక పరిణామానికీ — కలిపి ఒక నిచ్చెనవంటి 'లింకు' గా మనిషిని ఏర్పాటు చేయడం జరిగింది అన్న విషయం — మనం గ్రహించవచ్చు!

అంటే భూమిమీద నిచ్చెనవేస్తే దాని కాళ్ళు మట్టిమీద నేలకి తాకి వుంటాయి — అక్కడినుంచి మెట్లుమెట్లుగా పైకి వెళ్ళడానికి ఒక మార్గమే ఈ నిచ్చెన! ఈ నిచ్చెనలోని **మెట్లు** ఒకదానికంటే పైన ఇంకొకటి 'అంతస్థులుగా' మెట్లు మెట్లుగా వున్నట్టి

**ప్రాణమయ,**

**మనోమయ,**

**విజ్ఞానమయ,**

**బ్రహ్మమయ,**

**పరబ్రహ్మమయమైన**

— ప్రజ్ఞయొక్క అంతస్థులుగా **(Levels of Consiousness)** ఏర్పడి వున్నాయి! ఈ పై **లోకాలతో** ఏర్పడివున్న నిచ్చెన వంటి **అంతస్థులలో** మనిషియొక్క శరీరం — సరిగ్గా **నడిమధ్యన** ఏర్పడివున్నది!

అంటే ఇటు **పదార్థా** (Matter) **నికీ** విద్యుత్తు (Current) అయస్కాంతం (Magnetism) వెలుతురు వంటి **శక్తికీ** — ఆపైన ఆహారంతో జీవించే "ప్రాణశక్తి" శ్వాసతో ఆలోచించే 'మనోమయశక్తి'కీ బయటప్రపంచాన్ని అర్థం చేసుకుని ఇలా బయట ఎందుకు ఈసృష్టి ఏర్పడివుందో గుర్తించగల విజ్ఞాన శక్తి — ఇంకా ఆపైన మనిషి — ఎందుకు సృష్టించబడ్డాడో మానవ సృష్టియొక్క ప్రయోజనమూ, ఇలా మనిషిని సృష్టించడంలో ఈ ప్రపంచాన్ని

సృష్టించిన విశ్వకర్తయొక్క సంకల్పమేమిటో గ్రహించగలిగే దశకు మానవుడు ఈ 20వ శతాబ్దం చివరలో ఎదిగి — ఇంకా ఉన్నతస్థాయికి, చేతులు జాపుతున్న పరిణామపు మెట్లపైన (Evolutionary Steps) నిచ్చెనవంటివాడు!

## "చక్రాలు" – పై'లోకాలూ' :

ఈ నిచ్చెనలోని మెట్లు — మనిషి శరీరంలో వెన్నెముకకు అనుకుని వున్న యోగచక్రాల ద్వారా మనిషి శరీరంలోని (a) శక్తికేంద్రాలు, (b) ప్రాణ కేంద్రాలు, (c) మనోమయకేంద్రాలు, (d) బుద్ధికేంద్రాలు, (e) జ్ఞానకేంద్రాల వంటి స్విచ్ (Switch) ల ద్వారా బైటి విశ్వంతో సన్నిహితమైన లింకు ఏర్పాటు చేసుకోవడం సాధ్యమౌతుంది!

ఇదెలా సాధ్యపడుతుందో ఒక ఉదాహరణ చాలు! మనం లండన్, బొంబాయివంటి పెద్ద నగరాలలో అనేకవందల అంతస్థులుకల బిల్డింగులలో మెట్లులేకుండా పైకివెళ్ళడానికి 'లిఫ్టు' (Lift) ఏర్పడివుంది కదా? ఈ లిఫ్టులో ఏముంటుంది? బిల్డింగులోని ప్రతీ అంతస్థుతో లింకు కలిగివున్న స్విచ్ — (1), (2), (3) అంకెలతో వుంటాయి! ఏ అంకె నొక్కితే ఆ అంతస్థుకు మనల్ని ఈ లిఫ్టు తీసుకుపోయినట్టే మన శరీరంలోని ఈ యోగ చక్రాలు కూడా ఒక్కొక్క యోగచక్రం నొక్కినట్లైతే దానికి సంబంధించిన పై లోకాలకు మనల్ని తీసుకువెళుతుంది!

"మనల్ని" తీసుకువెళ్ళేది — అంటే మన శరీరాన్ని కాదు! మన లోపల అన్నిటినీ గమనించే — ప్రతీ విషయాన్ని గుర్తించే ప్రజ్ఞతో 'ఎరుక' (Awareness) అన్న ఆత్మను తీసుకువెళుతుంది! ఇలా మనలోని ఈ చక్రాలు పై లోకాలతో కనెక్షన్ కలిగిన లిఫ్టులోని స్విచ్‌లవంటి కరెంటు కేంద్రాలు! ఈ స్విచ్ నొక్కాలంటే కావలసింది చేతితో నొక్కడం కాదు! ప్రతీ స్విచ్‌నీ కదిలించే ఇంగ్లీషు మంత్రాలవంటి మాస్టర్ CVV కోర్సుల ద్వారా ఈపని

జరుగుతుంది! ఈ విషయం — ఇప్పటిదాకా గత అధ్యాయాలు జ్ఞానదృష్టితో పరిశీలనాదృష్టితో చదివినవారికి తేలికగా అర్థమయ్యే విషయం!

## మానవ-సృష్టి ఎందుకు?

దీనివల్ల ఏర్పడే ప్రయోజనం ఏమిటి? **మనిషి ఎందుకు** సృష్టించబడ్డాడు! మనం జీవించే బ్రతుకుకు **ప్రయోజనమేమిటి?** — అన్న ప్రశ్నలకు అర్థం చూచాయగానైనా పొగమంచులో దూరాన కొండలు కనిపిస్తున్నట్లుగా, లీలగా గోచరిస్తుంది!

ఇంకా స్పష్టంగా గోచరించాలంటే ఏంచేయాలి? మనం కళ్ళు మూసుకుని — పొద్దున్నే లేవడం, కాలకృత్యాలు, స్నానము, టిఫిన్, ఆఫీసు, భోజనం; ఇంటికిరావడం మళ్ళీ భోజనం, నిద్ర అనే — గానుగెద్దు లాంటి చక్రంలో జీవించకుండా లోపలినుంచి గట్టి ప్రయత్నం చేస్తూ మనిషిగా మనలోని దేవుడ్ని బహిర్గతం చేసుకోవడానికి ప్రయత్నిస్తేనే ఇది సాధ్యపడుతుంది!

ఎలా సాధ్యపడుతుంది? మనిషి చుట్టూ నిత్యజీవితంలో గానుగెద్దులా తిరిగే గుండ్రటి సిమెంటుగోడవంటి పొర అడ్డం వుండి కోడిగుడ్డులో వున్న కోడిపిల్లను బయటికి రాకుండా కాపాడినట్లే మనల్ని దైనందిన **గానుగ-చక్రంలో** బంధించివుంచుతుంది! ఇందులోంచి బయటపడాలంటే ముందుగా మనం గానుగచక్రంలో **బంధించబడి వున్నామని** తెలియాలి — అంటే, గట్టిగా **ఫీలవ్వాలి!**

అంటే జైలులోవున్నవాడు జైలుగది గోడను రక్షణగానూ — జైలును తేరగా **భోజనంపెట్టేదని** అంటూ **సంతోషిస్తే** — ఏనాటికీ విడుదలకానట్టే మనం మన జీవితంలో పూర్తిగా గానుగెద్దు జీవితంతోనే సంతోషిస్తూ బ్రతికే గుడ్డివాళ్ళమైతే — మన కింతకంటే ఉన్నత జీవితానికి యోగ్యతవుందని

**తెలియకుండానే మరణిస్తాము!** కాదు అసలు మరణించే జీవిస్తున్నాం మనలో చాలామంది! జీవిస్తూ **మేలుకొనాలి!**

దీనికి లోపలనుండి ప్రయత్నం రావాలి! అంటే గట్టిగా **ఊపిరి** పీల్చుకునే ప్రయత్నం లాంటిది కావాలి! ఇది ప్రతి నిత్యం చేయాలి! అప్పుడొక **తహతహ** ఊపిరితో శ్వాసకు-గాలి అందకపోతే ఏర్పడే ఉక్కిరిబిక్కిరి వంటి తహతహ ఏర్పడుతుంది!

శంకర భగవత్పాదులు ఒకసారి తమ శిష్యుడిని చెరువులో స్నానం చేస్తూ అకస్మాత్తుగా నీటిలోముంచి నొక్కిపట్టుకున్నారట! అతడు గిలగిలా కొట్టుకున్నాక ప్రాణం కడపట్టేదాకా అపి వదిలిపెట్టి ఆత్రంగా ఊపిరి పీల్చుకుంటూ ఆయాసపడుతుంటే అడిగారట

"నీకెలావుంది అప్పుడు?" — అన్నారు. దానికతడు :

"కేవలం **శ్వాసకోసమే** నా తహతహ తప్ప **ఆలోచించటానికి** కూడా నాకు **వ్యవధిలేదు"** — అన్నాడా శిష్యుడు!

అలాగే సాధకుడు తనకు ఉన్నతమైన ప్రజ్ఞ-'బ్రహ్మజ్ఞానం' గనక అందకపోతే **ఊపిరికోసం** తహతహపడి అతడిలోని జీవుడు ఎలాగ గిలగిలా ప్రాణంకోసం పోరాడినట్టుగా — **తీవ్రప్రయత్నంచేస్తేనే** సాధ్యం! అప్పుడు మన మనస్సుకు పైనవుండే దైవిక అనుభవాలు, **కోడిగుడ్డు పగిలి** పిల్ల బయటకి వచ్చినట్టుగా **మనస్సుపొర బద్దలై** బుద్ధి, ఆత్మ, మనస్సూ ఉల్లిపాయలోని పొరలవలే అరలు అరలుగా **విచ్చుకుంటాయి!** తెరలు తెరలుగా వెలుతురు మరింత స్పష్టంగా వెలుగుతుంది! ఇదే **సాధన** అంటారు!

కాని **మాస్టర్ CVV** యోగం తెలియజేసే మహాసత్యం ఇంకొకటి

వున్నది! అదేమిటంటె మనిషికి బ్రహ్మసాక్షాత్కారంగాని లెక భగవత్ సాక్షాత్కారంగాని కేవలం వీడి స్వార్థప్రయోజనాలకోసం ఇవ్వబడవు! తానొక్కడూ ముక్తిపొంది జైలులోంచి దొంగ తప్పించుకున్నట్టు బాధ్యతలనుండీ, కష్టాలనుండీ, జన్మలనుంచీ తప్పించుకుందామనుకుంటే మనల్ని సృష్టించిన సృష్టికర్త మనకీ సంకెళ్ళు విప్పడు!

అంటే ఏమిటి? మనం విడుదలకావడానికి **మానవజాతికి మేలు** చేసే ఒకగొప్ప నిస్వార్థమైన ప్రయోజనం వుండితీరాలి! అప్పుడే దైవం మనిషికి ఉన్నత బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు! ఇలాంటి తీవ్రమైన **మానవజాతిని ఉద్ధరించే** సంకల్పం ఉన్నందువల్లనే **మాస్టర్ CVV గారికి** పరబ్రహ్మనుండి ఇన్ని అనుభవాలు, ఇన్ని సిద్ధులు, ఇన్నిరకాల ఇంగ్లీషుకోర్సులు, ఇంకా గ్రహమండలాలను కంట్రోలుచేయగల యోగరహస్యాలూ ఇవ్వబడ్డాయి! ఇది, మాస్టర్ CVV అధ్యయనం చేయడంలో మనకి స్పష్టంగా గోచరించే రెండవ మహాసత్యం! ఇది ఒక **ప్రకృతి సత్యం** (Law of Nature)! **స్వార్థంకోసమని** ఎవరికీ బ్రహ్మజ్ఞానం ఇవ్వబడదు — అన్నదే ఈ మహాసత్యం!

ఇంకా ఎన్నో విషయాలు మానవ పరిణామం గురించి, కర్మగురించీ నిస్వార్థంగా మానవజాతిని ఉద్ధరించడంగురించీ ఎవరిబుద్ధికి తగ్గట్టు వారు గుర్తిస్తారు, మాస్టరుగారి చరిత్రను వివేకంతో, విశ్వాసంతో, జిజ్ఞాసదృష్టితోనూ అధ్యయనంచేస్తే! అలాగే ఇతర యోగులైన శ్రీ రమణమహర్షి, గుర్జీఫ్, శ్రీఅరవిందయోగి, జ్యోతిరామలింగస్వామి వంటి కారణజన్ములు, అవతార పురుషులైన మహామహుల జీవితాలను విశ్లేషణా దృష్టితో సరిపోల్చి అధ్యయనంచేస్తే మరికొన్ని నూతన కోణాలనుంచి **యోగ పరిణామం** (Inner Development) అంటే ఏమిటి? అన్న విషయం మానవ శరీరాన్ని, మనిషి మనస్సునూ, హృదయాన్నీ, మనలోని ప్రాణకేంద్రాన్ని ఎలా క్రమక్రమంగా

ఒక గులాబీపూవులాగ వికసింపచేసుకోవడమెలాగో తెలియచేస్తాయి! అప్పుడే మరికొన్ని మహాసత్యాలు మనకి బోధపడతాయి! ఉపయోగపడతాయి!

అందులో మాస్టరుగారి జీవితంద్వారా మనకందించిన మహాసత్యం :

1) ఈ **విశ్వమే** మనిషి **శరీరం**;

2) విశ్వమంతా వ్యాపించిన **ప్రాణమే** — మన **ఊపిరినీ**, మన జీవితాన్నీ నిలబెట్టివుంచి మనశరీరాన్ని ఆరోగ్యంగానూ, సంతోషంగానూ మనుషులందరూ ఒక కుటుంబంలోని బంధువులులాగానూ, ప్రేమగానూ బ్రతికించే **'ప్లెంటీ-ప్రాణ'** (Plenty Prana) అనే విశ్వ ప్రాణచైతన్యం (Universal Vital Awareness);

3) మనిషి **జీవాత్మ** అనగా మనలో అత్యంత లోతైన కేంద్రమైన "నేను" అన్న ఆలోచనగా వెలిగే కేంద్రం — ఈ విశ్వానికి అంతటికీ ఒకే ఆత్మగా వెలిగే **పరమాత్మయే** సైజులో తేడాయే!

4) ఇలా తెలుసుకోవడం ప్రపంచంలోని **అందరి కష్టాలు తనవే** అనుకున్నవాడికి అందరి రోగాలు నివారణ కావాలని బాధతో ఆపేక్షతో ఇతరుల గురించి ప్రార్థించేవాడికీ ప్రపంచంగురించే జీవించేవాడికి లభ్యమయ్యే **విశ్వజీవితం** (Universal Life) ఇదే!

5) మనిషి అవసరాలు ఉద్రేకాలు, స్వార్థము, భయమూ, మృత్యువు వంటి సంకెళ్ళను జయించి ఈ బ్రహ్మాండమంతటికీ నిండివున్న దైవశక్తి తన శరీరంలో — తనరూపంలో జీవిస్తూ తనను ప్రాణంగా పోషిస్తూ తనకు మనస్సుగా జ్ఞానమిస్తూ తనకు అంతరాత్మగా అందరినీ ప్రేమించే కేంద్రం హృదయకేంద్రం అనుగ్రహిస్తూ **నడిపించేదే** — జీవించివుండగా **ముక్తి!**

అట్టివారికి శరీరం విడిచిపెట్టినా మరణం వుండదు! ఇది చేయలేని

నిస్వార్థపరులకు వారు జీవించివుండగానే మరణించివున్నట్టే!

శ్రీ రామ శ్రీ కృష్ణాది అవతారాలలోకూడా భగవంతుడు మానవ రూపంలో పుట్టి మామూలు శరీరంతో బ్రతుకుతూనే భగవంతుడిగా లోపలి అనుభూతిని నిత్యం ఆనందంగా జీవించినట్టే — **సమస్త విశ్వాన్నీ** తన **కుటుంబంగా** నియమిస్తూ జీవించే దివ్యజీవనమే — **ప్రతీ మనిషి భగవంతుడి అవతారమే** అన్న సత్యాన్ని మానవజాతికి గుప్తంగా అందించారు!

ఈ భగవత్‌సందేశమే **మాస్టర్ CVV** యోగ **సందేశం!**

"నన్ను **నీవుగా మార్చుకో ఓస్వామీ!** — అప్పుడే పరిమితుడనై నేను చేసే అపరాధాలన్నీ ఆగిపోతాయి! **నాలో నీవైన ఓస్వామీ!** నీవే నాలో **నీవై** నిలిచి వుండు! నాలో పూర్తిగా **అవతరించి వుండు!**" — అన్నదే మాస్టరుగారు ప్రభాకరశాస్త్రిగారికిచ్చిన యోగసిద్ధిద్వారా మన కందించిన ప్రేమలేఖ

**మాస్టర్ CVV — నమస్కారం!**



## 23

# వ్యాస-గణపతులు

శ్రీపిలకా గణపతిశాస్త్రిగారు ప్రఖ్యాత తెలుగు రచయితగా ఆంధ్రదేశ మంతటా పరిచితులు! వీరు మద్రాసులో "**ఆంధ్రప్రభ-వారపత్రిక**" సహాయ సంపాదకులుగానూ 'భారతి', '**ఆంధ్రప్రతిక**' కార్యాలయాలలోనూ పనిచేసారు. వీరి రచనలలో కొన్ని విశేషజనాదరణనుకూడా పొందినవి.

పిలకావారిది తూర్పు గోదావరిజిల్లా. కాలాంతరాన ఉద్యోగ నిమిత్తమై మద్రాసులోనే స్థిరపడిపోయారు. వ్యాసమహాభారతమును తెలుగు వచనంలో తర్జుమాచేసి ధారావాహినిగా ప్రజలకు అందించిన అదృష్టవంతుడు శ్రీగణపతి శాస్త్రిగారు! తదుపరి దేవీభాగవతం ధారావాహినిగా వ్రాశారు.

వీరు 1968 లో '**మద్రాసు తెలుగు రచయితల**' సమావేశం వేదిక '**రచన**' ఏర్పడిన సందర్భంగా మేము కలుసుకోవడం జరిగింది! అదే సమావేశంలో శ్రీమతి మాలతీ చందూర్‌గారు కూడా ఆ సభలలో గురుదేవు లను కలుసుకున్నారు కాని గణపతిశాస్త్రిగారి పరిచయం మాత్రం నాతో రానురాను మరింత పెరిగి అభిమానం లతలా అల్లుకుపోయింది!

ఆ సభలో :

**"తమరెవరండి?"**

**"నాపేరు వేదవ్యాస అంటారు. తమరండి?"**

**"ఓహో! వ్యాసమహర్షిగారా? — అయితే నేను మీ గణపతినే".**

అని కడుపుబ్బ నవ్వించేలా చమత్కరించారు, గణపతిశాస్త్రిగారు ప్రధమ సమావేశంలోనే! అదే ప్రారంభం వ్యాసగణపతుల అనుబంధానికి నాంది!

ఆరోజునుంచీ, ప్రతినిత్యం గణపతిశాస్త్రిగారు గురుదేవులను చూడందే ఉండేవారు కారు. సాయంత్రం అయ్యేసరికల్లా కాఫీ అయినా త్రాగడం మర్చిపోయేవారేమోగాని గురుదేవులను కలవటంమాత్రం మానరు! ఆదరా బాదరాగా దొరికిన బస్సును అందిపుచ్చుకుని గురుదేవుల ఆఫీసుకి రావడం, వీరిద్దరూ కలిసి సాయంకాలం 'మెరీనా'-బీచ్‌కో లేదా విశ్రాంతికై 'పానగల్ పార్క్'కో వెళ్ళి గంటల తరబడి కూర్చుని గంటలను నిమిషాలలాగ గడిపేసే వారు! క్షణకాలంలో వీరి పరిచయం సన్నిహితమై — ఆ, సన్నిహితం అనుబంధమై, అనుబంధం విడరాని 'గురుశిష్య బంధం'గా వీరిని బంధించి వేసింది.

ప్రతి నిత్యం గణపతిశాస్త్రిగారు తమ కావ్యగానంచేసి గురుదేవులను ఆనందపరచేవారు. ఏరోజు వ్రాసిన పద్యాలు ఆరోజు, "ఈరోజు వేడిగా వ్రాసినవి — చదవండి" అని అడిగి గురుదేవులు చదివించుకునేవారు! రోజులు గడిచినకొద్దీ గణపతిశాస్త్రిగారికి గురుదేవుల యెడల వారి జ్ఞానానికి మిత్రభావంతో బాటు అపార గౌరవమూ భక్తిప్రపత్తులూ ఏర్పడినాయి!

సంస్కృత మహాభారతంలోని అనేక నిగూఢ విషయాలూ, శ్రీమద్భాగ

వతంలోని ఆధ్యాత్మక విషయాలూ ఎన్నెన్నో అవలీలగా విశదీకరించి పసిపిల్ల వానికి మాదిరిగా చిన్న మాటలలో చేప్పేవారు, గురుదేవులు! దానితో తనలో సంస్కృత మహాభారత విమర్శలో ఏళ్ళతరబడి నిలిచివున్న సందేహాలు అలా నివృత్తి అయ్యేవి.

"ఇందుకే కాబోలు భగవంతుడు మీతో ఇలా నాకు ఈ మైత్రిని సంధానపరచాడు! ఆనాడు వ్రాసిన **తెలుగు భారతం** తదుపరి ఒక సంపుటిగా మీయొక్క పీఠికతో ప్రచురించాలని అనిపిస్తున్నది. అక్కడక్కడ తగుమార్పులు కూడా చేసి ఈ నూతన విషయాలను చేర్చి ప్రచురించవలెను" అంటూండే వారు గణపతిశాస్త్రిగారు.

ఇట్టి చర్చలలో తరచు వీరి సోదరులు ప్రఖ్యాత చిత్రకళాకారులు అయిన శ్రీపిలకా లక్ష్మీనరసింహమూర్తిగారు కూడా పాల్గొనుచుండేవారు. వారు శ్రీగురుదేవులకు చిత్రకళలో గల అశిక్షిత నైపుణ్యాన్ని చూసి సమ్మోహ పడేవారు.

ఇలావుండగా గురువుగారికి మద్రాసునుంచి బదిలీ అయిందన్న వార్త శ్రీగణపతిశాస్త్రిగారికి తెలిసి, నెత్తిన పిడుగు పడ్డట్టయింది. మిత్రబృందమంతా, చిన్నబోయింది!

"మీరు లేకుండా ఆ బీచ్‌కిగాని ఏఇతర విహార స్థలాలకిగాని ఎట్లా పోగలను?" అని పరితపించారు శాస్త్రిగారు. కనీసం తమ కోర్కెనుతీర్చగా, సతీసహితముగా తమ ఇంటికి భోజనమునకు రమ్మని ఆహ్వానించారు. ఆ సమయంలో శాస్త్రిగారు — "జీవితంలో నాకిదే ఆఖరి సావకాశము! మీరు నాకు **యోగ-దీక్ష** నిప్పించరా?" అని ప్రార్థించారు. "నా వయస్సుకూడా 55-సంవత్సరాలు దాటింది! ఆరోగ్యంకూడా సరిగాలేదు! వృత్తి సమస్యలు ఎన్నో కాచుకుని వున్నవి. గంపెడు పిల్లలు! సంసారం భరించుట ఎట్లా?

ఆశాజ్యోతివలె మీరు కనిపించి దూరమైతే ఇకనేనెట్లాగ?"

గురుదేవులు చిరునవ్వుతో 'సరే' అన్నారు. "పూజకేమి తేవలెనో?" అని ఆయన అడిగితే, "కొద్దిగా అగరు వత్తులు, పువ్వులూ, చాలు!" అన్నంతలోకే, మాట మాట్లాడుతూవుండగానే — ఎవరో పూలు కొనివచ్చి కిటికీలోనుంచి లోపలికి పడవేశారు! శాస్త్రిగారాశ్చర్యపోయారు!

## మాస్టరు CVV యోగం – ఉపదేశము :

గురుదేవులు తమ హస్తము ఒక అరక్షణం శాస్త్రిగారిపై నిమిరినట్టు, వీచిరి (తాకలేదు). తోడ్తోడనే ఒక పెద్ద 'కరెంటువంటి-షాక్' కొట్టినట్లయి శాస్త్రిగారి శరీరమంతా ఆపాదమస్తకమూ కదలిపోయింది!

వేయి సూర్యులు వెలిగినంత తెల్లని ధవళాతిధవళమైన దివ్యతేజము శాస్త్రిగారిని తనలోనికి గైకొన్నట్లాయెను! నలభై సంవత్సరాలు మహాయోగుల వద్ద మంత్రదీక్ష పుచ్చుకున్ననూ జీవిత కాలమంతా గాయత్రీ మంత్రదీక్ష తీసుకొన్ననూ తనకేనాడూ కలుగని — ఊహకే అందని ఒకానొక **యోగ–శక్తి** విజృంభణము శాస్త్రిగారిలో అర్థ-క్షణకాలములో మెరుపులా జరిగింది!

కుండలినీ ప్రబోధము జరిగి — తల ఇటూ అటూ, ఊగుతూ నాగుపామువలే ఆడసాగెను! కన్నీరు జల్లుగా వర్షించగా — ఇక శాస్త్రిగారు తట్టుకో లేక చేతులెత్తి నమస్కరించి.

"ప్రభో! (దుఃఖమున) **"You are an Ocean of Mercy"! నిష్కారణముగా నాపై ఇంత కరుణ ఏల? శతసహస్ర వందనములివిగో!"** — అని అంటూ బోరగిలపడి నమస్కారంలోనే అచేతనులై వుండిరి.

ఇంతలో గురుదేవుల సతీమణి క్రిందనుండివచ్చి ఆ పరిస్థితిచూసి అర్థంచేసుకొనలేక "ఇదేమిటి? శాస్త్రిగారిట్లయిరి? మీరేమైనా అంటిరా?"

అనిరి. గురుదేవులు చిరునవ్వుతో ఆమెను వారించి "త్వరగా మంచినీళ్ళు తే! వారికేదో, కొంచెం వికారపెట్టినట్టున్నది" అని అంటూ ఆమె అటుపోగానే, తమ అమృత హస్తముతో తిరిగి శాస్త్రిగారిని తాకిరి! దాంతో గణపతిశాస్త్రిగారు, దిగ్గున లేచి అటూ ఇటూ ఆశ్చర్యముగా చూచిరి!

శాస్త్రిగారు, ఆనాటినుండీ — వేరే వ్యక్తి!

నిత్యమూ 'ప్రేయరు' చేయుట కారంభించి, వేదవ్యాసగురుదేవుల వద్ద 'మాస్టరు **CVV**' యోగదీక్ష తీసుకున్న — యోగమిత్రులలో నొక్కరుగా ఐనారు! శాస్త్రిగారి ఆంతరంగిక జీవితములో ఆనాడే, ఒక **దివ్యజ్యోతి** ప్రవేశించింది.

తర్వాత సంవత్సరకాలము దాటీ - దాటకముందే శాస్త్రిగారు "**నాగ-మల్లిక**"అనే తమ **నవలను** — వేదవ్యాస గురుదేవులకు అంకితంచేశారు.

ఇది శ్రీకృష్ణునిపై గోపికల ప్రణయగాథ! శాస్త్రిగారుకూడా గురుదేవుల గోపికలలోని వారమేనని ఋజువుచేసుకొనటానికే నేమో వారు అలా వ్రాశారు!

ఇది మనం గణపతిశాస్త్రిగారి స్వంత మాటలలోనే చూడగలము.

## గణపతిశాస్త్రిగారి దివ్యానుభూతి – మహత్తర దివ్యదర్శనం :

"అది చల్లని పున్నమి పండువెన్నెల! ఆ వెన్నెలలో **ఆత్మీయమిత్రులు** శ్రీవేదవ్యాసగారివద్ద కూర్చుని, నేను ధ్యానం ప్రారంభించాను.

చంద్రమండలం నించి దివ్యదంపతులిద్దరు దిగి వస్తున్నట్టు ఒక మహ నీయానుభూతి! ఆ అనుభూతి జాజ్జ్వల్యమాన తారళ్యం — నేనెన్నటికీ విస్మరించలేను!

లోలోపలనించి, వేయి మనోజ్ఞ కమలా లొక్కమారు విచ్చుకున్నాయి!!!

శరీరం జలదరించింది! ఆహా! ఏమి? — ఆ అపూర్వానుభూతి?

"శ్రీమాష్టరుగారి మంత్ర స్వీకరణ అంతా అత్యాశ్చర్యంగా జరిగింది! ఆసమయంలో నాశరీరంలో ఒక్కమారుగా విద్యుత్తరంగ మొకటి ఉవ్వెత్తుగా పైపైకి ఉప్పొంగింది! క్షణకాలం నా శ్వాస — స్తంభించింది! శరీరం గగుర్పొడిచింది ఆనందభాష్పావళి చెక్కిళ్ళమీద జాలువారింది.

"ఆతరువాత కాలంలో స్వర్గీయ వేటూరి ప్రభాకర శాస్త్రి మొదలైన మహనీయుల అనుభవాలు కొన్ని చదివాను.

"కాని, వాటి అన్నిటికన్నా అత్యద్భుతం మా అబ్బాయి శ్రీనివాసశాస్త్రి విషయంలో నాకు జరిగింది! మా చిరంజీవి శరీరంలోని హృదయ రుగ్మత శ్రీమాష్టరుగారి నమస్కారాలతోనే నయమైంది." — అదెలా జరిగిందో చూతము.

## గుండెజబ్బు నివారణ!

పైన చెప్పినట్టు, శ్రీ పిలకాగణపతిశాస్త్రి (ఎడిటర్ "ఆంధ్రపత్రిక" మద్రాసు) గారి మొదటి అనుభవం 1968 నవంబరు-డిసెంబరు ప్రాంతాలలో జరిగింది!

ఆ తరువాత ఉద్యోగ రీత్యా నేను మద్రాసునుండి బదిలీ అయి వెళ్ళి పోయిన చాలాకాలానికి — అంటే సుమారు సంవత్సరం కావచ్చింది! తిరిగి గణపతిశాస్త్రిగారిని నేను మద్రాసు వచ్చినపుడు కలవడం జరిగింది! అప్పుడు శాస్త్రిగారొక కోరిక కోరారు!

"గురుదేవా! మీరు నాకు మాస్టరుగారి యోగదీక్ష నిప్పించి అనుగ్రహించారు! నా ఏభై అయిదేళ్ళ జీవితంలోనూ ఇలాంటి ఆధ్యాత్మిక అనుభవం గురించి వినిగాని, చదివిగాని వుండలేదు! ప్రతి నిత్యం నాకు ప్రేయరులో — నాకే నమ్మశక్యంకాని అద్భుత అనుభవాలు భరించ శక్యం

కాని ఆనందం, ఉద్రేకం, తన్మయత్వం కలుగుతున్నాయి!

మాస్టరుగారి ప్రేయరు లో కేవలం పది పదిహేను నిముషాలసేపు కూర్చున్నంతనే నేను ఎక్కడవున్నానో మరిచిపోయేటంత తాదాత్మ్యం కలుగుతున్నది! గతంలో నేను ఎందరో మహాత్ములను సేవించాను, పెద్దవారినే! కాని, ఎక్కడా నేను ఇలాంటి అనుభూతి రుచిచూడలేదు అన్నారు!

"పెద్దవారా! అంటే?" అన్నాను!

నేను చాలాకాలం క్రితం అరుణాచలంవెళ్ళి అక్కడ భగవాన్ శ్రీరమణ మహర్షివారిని సేవించుకున్నాను! కొంతకాలం వారి ఆశ్రమంలో కూడా వున్నాను! అప్పుడు కూడా నాకు ఇలాంటి అనుభవం ఎప్పుడూ కలుగలేదు! ఆరోజుల్లో నాలాగే యువ వయస్సులోవున్న ప్రఖ్యాత సినీనటుడు శ్రీచిత్తూరు నాగయ్యగారు (వీరి అప్పటి పేరు నాగేశ్వర శాస్త్రి) కూడా శ్రీరమణమహర్షివారి వద్దకు వచ్చారు! అప్పుడుకూడా నేనిలాంటి అనుభవాన్ని పొందలేదు! దీనికి నేను సర్వదా కృతజ్ఞుడిని! అయినా నాకొక చిన్నకోరిక బాధిస్తున్నది!

"అదేమిటంటే నా పిల్లవాడు, చిన్నవాడు. అయిదారేళ్ళువుంటాయి! పుట్టుకతోనే గుండెజబ్బు డిఫెక్టివ్ వాల్వ్ (Deffective Valve) అన్న దోషంతో పుట్టాడు! దీనికి వైద్యశాస్త్రంలో మందే లేదు! కేవలం శస్త్రచికిత్స — అదికూడా 'ఓపెన్ హార్ట్‌సర్జరీ' చెయ్యాలట! అప్పుడు గుండెను కోసి లోపలికి వాల్వ్ అనబడే ఒక మూతను కృత్రిమంగా పెట్టాలి! ఇందులో చాలామంది ఆపరేషన్ టేబుల్‌మీదే కన్నుమూస్తారు! పోనీ ఊరుకుందామా అంటే పిల్లవాడు గుక్కపట్టి ఏడ్చినప్పుడల్లా శ్వాస అందక గుక్క నిలిచిపోయి ముఖం కాళ్ళూ చేతులూ నల్లబడిపోతున్నాయి! డాక్టర్లు పిల్లవాడిని గుక్కపట్టి ఏడవనీయకుండా జాగ్రత్తగా చూడాలని హెచ్చరిక చేశారు! మేము ఎంత

జాగ్రత్తగా చూసినా పిల్లవాడు గారాబంచేత ప్రతి చిన్నదానికీ ఏడవటం మేము భయపడి అడిగినదల్లా ఇచ్చేస్తామని తెలిసి ప్రతీ చిన్నదానికీ గుక్కపట్టడమూ దాంతో పిల్లవాడు ఏక్షణాన మరణిస్తాడో అన్న భయంతో అనుక్షణం కుమిలిపోయి — చివరికి విసిగి వేసారిపోయి రాయవెల్లూరు హాస్పటల్‌కు ఆపరేషన్‌కై చేర్పించాము!"

"ఆ పిల్లవాడికి ఇక రేపో ఎల్లుండో ఆపరేషన్ చేస్తారు! మీరు నాకడుపు కోతను అర్థంచేసుకొని పిల్లవాడికి **మాస్టర్‌గారి** అనుగ్రహానికై ఆశీర్వదించండి! ఆతరువాత మా అదృష్టం పిల్లవాడి ఆయుష్షూ ఎలావుంటే అలా జరుగుతుంది" అన్నారు కన్నీళ్ళతో!

నేను క్షణకాలం మాస్టరుగారికి నమస్కరించి వారి నిష్కారణ దయకూ అనుగ్రహానికై రెండే రెండు నిముషాలు — ప్రేయరుచేసి శాస్త్రిగారిని ధైర్యంతో వుండమనీ, పిల్లవాడిని రాయవెల్లూరు తీసుకువెళ్ళమని చెప్పడంతో శాస్త్రిగారు అదిరిపడి నిరుత్సాహ పడిపోయారు — ఇంక కుర్రవాడికి ఆశ లేదేమోనన్న భయంతో!

తర్వాత కాలాంతరంలో శ్రీ గణపతిశాస్త్రిగారు మళ్ళీ నన్ను కొన్ని నెలలతర్వాత కలవడం జరిగింది! నన్ను చూడటంతోనే వారు పట్టరాని ఆనందభాష్పాలతో నాకంటే వయస్సులో పెద్దవారైనా సాష్టాంగపడి పాద నమస్కారం చేశారు! సందర్భానుసారంగా పిల్లవాని క్షేమ సమాచారాల గురించి నేర్పుగా ప్రశ్నించాను!

శాస్త్రిగారు చెప్పిన — రాయవెల్లూరులోని అనుభవం ఇలావుంది :-

"పిల్లవాడిని డాక్టర్లు చెప్పిన తేదీన రాయవెల్లూరు తీసుకొనివెళ్ళి ఆపరేషన్‌కై చేర్పించాము! ఆపరేషన్‌కు ముందు చేసే పరీక్షలు జరిపి మరునాడే గుండె ఆపరేషన్‌కు తేదీ నిశ్చయించారు! పిల్లవాడిని ఆస్పత్రిలోని

గదిలోకి తిరిగి తీసుకొనివెళ్ళి బలమైన ఆహారం, టానిక్కులు ఇవ్వమని అన్నింటికీ సిద్ధంగా వుండమని చెప్పారు! నేనూ నాభార్యా లోలోపలే దిగులుతో కుమిలిపోతూ, పుత్రశోకంతో కడుపు సముద్రంకాగా ఇక పిల్లవాడి బ్రతుకుపై ఆశ వదిలేసి పైకిమాత్రం మా కడసారి ప్రేమను అతడికి వొలక బోస్తూ నిర్జీవంగా గడిపాము! రాత్రంతా మా ఇద్దరికీ కునుకులేదు!

"మరునాడు ఉదయాన్నే కాలకృత్యాలు, స్నానాదులు పూర్తికాగానే పిల్లవాడు ఆపరేషన్ వద్దని ఏడుస్తూ బతిమాలితే ఏమిచెయ్యాలా? అను కుంటూ సర్జరీకోసం సిద్ధమౌతున్నాం!

ఇంతలో మాపిల్లవాడు తాను పడుకున్న బెడ్‌మీద లేచి కూర్చున్నాడు! కూర్చుని నిటారుగా చేతులు, తలపైకెత్తి గాలిలో ఏమీ కనిపించని ఆకాశంవైపు ఎవరినో చూసినట్టు మాట్లాడటం చేతితో తడిమి స్పర్శిస్తున్నట్టు చేస్తున్నాడు! పిల్లవాడి ఆ ప్రవర్తనకు వింతపడుతూ —

"నాయనా! ఏమిటి? అలా చేతులు పైకెత్తి గాలిలోకి చూస్తూ మాట్లాడుతున్నావు? నీకేమైనా భయంగా, బాధగావుందా?" అన్నాను! దానికి పిల్లవాడు —

"నాన్నా! అరుగో మన గదిలోకి **మాస్టర్** CVV గారు వచ్చారు! గురువుగారూ పక్కనే వున్నారు! వారిద్దరూ నాతో ఏదో మాట్లాడుతున్నారు! ప్రేమతో వారిని తడిమి చేతులతో ముట్టుకుని చూస్తున్నాను" — అన్నాడు!

బాంబు పేలినట్టు ఆశ్చర్యపడి గణపతిశాస్త్రిగారు —

"మాట్లాడుతున్నరా? ఏమని చెప్పారు? (బహుశా పిల్లవాడు 'ఆపరేషన్ వద్దు ఇంటికిపోదాం అని చెప్తున్నారు' అంటూ ఆ సాకుతో సర్జరీ తప్పించు కోవచ్చునన్న భయం కారణంగానే, అలా అంటున్నాడు అనుకుంటూ) అన్నాను!

కాని పిల్లవాడు దానికి వ్యతిరేకంగా — "మాస్టర్‌గారు నాకు 'భయపడ వద్దని ఆపరేషన్ చేయించుకోమని' చెప్తున్నారు! వెళ్ళేముందు నమస్కారం పెట్టుకోమన్నారు!" — అంటుంటే శాస్త్రిగారు నోటమాటరాక కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యారు!

చివరికి పిల్లవాడ్ని సర్జరీకోసం టేబుల్‌మీద పడుకోపెట్టగానే సర్జరీకి ముందు ప్రాధమిక పరీక్ష మళ్ళీ ఒకసారి చేసారు! గుండెను పెద్దదిగాచేసి ఎక్స్‌రేలో చూస్తూ గణపతిశాస్త్రిగారితో చిరాకుగా ఆ డాక్టర్ గారు

"ఏమండీ! మీరు ఆ పిల్లవాడినే తీసుకొచ్చారా? ఇతడు కాదే? నేను పరీక్షించింది! అన్నారు; శాస్త్రిగారు ఆశ్చర్యపడుతూ! "ఆపిల్లవాడే! రాత్రి హాస్పటల్‌లోనే వున్నా" మని వివరాలుచెప్పగా మళ్ళీ ఒకసారి ఎక్స్‌రే ఫొటోలో చూసి, "చూడండి మీరుకూడా! — అదే, పిల్లవాని హృదయం! స్పష్టంగా ఆరోగ్యంగా కొట్టుకుంటోంది — ధన్ ధన్‌మని! ఎక్కడా గుండెలో రోగంగాని అవ లక్షణాలుకాని కనిపించడంలేదే? ఆశ్చర్యం! మీ పిల్లవానికి ఏరోగమూ లేదు! నిశ్చింతగా ఇంటికి తీసుకువెళ్ళండి ఆపరేషన్ ఏమీ అవసరంలేదు" అన్నాడు!

నమ్మశక్యంకాని ఈ అనుభవానికి వింతపడుతూ శాస్త్రిగారు "ఆ పిల్లవాని గుండెఫొటోలు తీసుకొని తర్వాత కూడా అనేక మంది డాక్టర్లకు చూపించగా పిల్లవానికి ఏరోగమూ లేదని అన్నారు!"

ఈ విషయం చెప్పి శాస్త్రిగారు నాకు మరీమరీ కృతజ్ఞతాపూర్వకంగా రోదిస్తూ నమస్కరించారు!

"మాస్టర్‌గారి అనుగ్రహం అమోఘం! ఆస్పత్రిలో నా ఆయుష్షుపోసి అయినా పిల్లవాడిని బ్రతికించమని మనస్సులో ప్రార్థించాను!" — అన్నారు శాస్త్రిగారు!

ఇలా అద్భుతంగా పుట్టుకతోనే వికారం (Congenital Defect) కలిగిన గుండెతో పుట్టిన పిల్లవాడు అద్భుతంగా **శస్త్రచికిత్స లేకుండా** నివారణ కావడమేకాక, ఆ తర్వాత చాలాకాలం ఏ బాధాలేకుండా అందరుపిల్లల్లాగా ఆరోగ్యంగా వున్నాడు!

అయితే శాస్త్రిగారుమాత్రం — అకస్మాత్తుగా మరణించారని తెలిసింది! బహుశా వారి **ఆయుష్షు** పిల్లవానికోసం మాస్టర్‌గారు '**అడ్జెస్ట్‌మెంటు**' చేశారా? — ఇది ఎప్పటికీ తేలని శేషప్రశ్న!



# 24

# ‘అద్భుత-యోగానుభవాలు’! డాక్టర్ పేషంటుకు మాస్టర్ యోగంతో రోగనివృత్తి!

**[ఇది రాజమండ్రిలోని ప్రఖ్యాత అలోపతివైద్యులు డా. C.S. శాస్త్రి, MBBS స్వయంగా రాసిన అనుభవం]**

నాపేరు C.S. శాస్త్రి! నేను ప్రసిద్ధ అలోపతీ డాక్టరుగా రాజమండ్రిలో చాలా సంవత్సరాలుగా వైద్యవృత్తిలో రోగులకు వైద్యంచేసి సేవచేస్తున్నాను!

నావృత్తి సందర్భంగా రాజమండ్రిలో తరచూ పెద్దలైన డా॥ వేదవ్యాస గురుదేవుల గురించి వినేవాడిని! ఒకసారి అకస్మాత్తుగా వారిశిష్యుడు కోనాల నూకరాజుద్వారా శ్రీవేదవ్యాస గురుదేవుల పరిచయభాగ్యం కలిగింది! అప్పటికే నేను వారిగురించి వారి అఖండమైన కీర్తిగురించి చాలా వినివున్నాను! అంతేకాక వారి ఆధ్యాత్మిక పత్రిక **‘శుభవార్త’**లో వ్రాసే అద్భుత జ్యోతిష

విషయాలెన్నో అనూహ్యమైన రీతిలో యథాతథంగా జరగటం నేను ప్రత్య క్షంగా ఎన్నుకున్న విషయం!

ఇలావుండగా ఒకసారి శ్రీవేదవ్యాసగురుదేవులు కండ్లకు పెట్టుకునే ఒకచిన్న మందుగురించి ఊరికే నిమిత్తకారణంగా నావద్దకు శ్రీ నూకరాజు గారిని పంపించారు! నేను షిరిడిసాయిని నిత్యం ఆరాధిస్తాను! శ్రీవారు రాసిన సాయినాథచరిత్రకూడా చదువుతున్నాను! అందుకని వేదవ్యాస గురు దేవులు పరిచయభాగ్యం కలుగుతున్నదన్న సంతోషంతో స్వయంగా నేను వెళ్ళి వారు బసచేస్తున్న రీజెన్సిహోటల్‌లో వారి గదికివెళ్ళి వారిని కలిసాను! అలా కలవడంలో నాకు మరొకపనికూడా ఉన్నది! అదేమిటంటే నా చిరకాల మిత్రుడు ప్రఖ్యాతిగన్న అపోలో హాస్పిటల్‌లో పనిచేస్తున్న డాక్టరు అయిన శ్రీ బోడపాటి చంద్రమౌళిశర్మ గురించి శ్రీవేదవ్యాస గురుదేవులను సంప్ర దించాలని, నా డాక్టర్‌మిత్రుని జాతకం పరిశీలించి వ్యాధిగ్రస్తుడై మంచంపట్టి వున్న అతనికి జాతకరీత్యా ఎప్పుడు రోగనివారణ అవుతుందో, కనీసం అతడు ఆరోగ్యవంతుడై లేచి తిరగగలిగే యోగం వున్నదోలేదో దయచేసి యదార్థం తెలుపమని శ్రీవేదవ్యాస గురుదేవులను ప్రార్థించాను!



దీనికి కారణం నా వైద్యమిత్రుడైన బోడపాటి చంద్రమౌళిశర్మ బాల్య మిత్రుడు! నాకు చాలా ఆత్మీయుడు! ఉన్నట్టుండి అకస్మాత్తుగా కాళ్ళూ చేతులూ చచ్చుబడి నిర్జీవంవలే శవంలా పడిపోయాడు! వైద్యునిగా మాకు తెలిసిన ఎన్నిరకాల చికిత్సలు, పరీక్షలు ట్రీట్‌మెంట్లు చేసినా కనీసం రోగం ఏమిటో అసలు ఎప్పుడు నయమౌతుందోకూడా తలాతోకా కూడా తెలియ లేదు! ఇలాగ ఆరుమాసాలకుపైన గడిచిపోయింది! దాంతో అతడి భార్యాబిడ్డ లకు కూడా అతడు యావజ్జీవం వికలాంగుడిలా మంచంపట్టి ఇలా పడి వుండాల్సిందేనా? అన్నదిగులు పట్టుకుంది! వైద్యప్రయత్నాలు విఫలమైన పరిస్థితిలో ఎటూతోచక వేదవ్యాసగారు గొప్ప జ్యోతిష్కులని, వారి ఉపన్యాసా లను తరచూ విని ఆయన యోగశాస్త్రంలోనూ వేదవేదాంగ శాస్త్రాలలో గొప్ప పండితులని ఏదైనా సాయం వారినుండి పొందగలరని ఆశతో నా మిత్రులు డా॥ చంద్రమౌళిశర్మగారి జాతకం ఆరోజు వేదవ్యాసగారికివ్వాలని హోటల్‌కి తీసుకువెళ్ళి వారికిఇచ్చి దయతో మా మిత్రులు ఎప్పటికైనా మామూలుమనిషి కాగలడా? అతడు లేచి తిరుగగలడా? తెలియచేయమని వారికి నామిత్రుని జాతకం ఇచ్చాను! శ్రీవారు దానిపై ప్రత్యేకమైన శ్రద్ధ కనపర్చకుండా దానిని తీసుకొని వారి పూజాసామాగ్రి పెట్టుకునే సూట్‌కేసు వేపు గిరాటువేశారు? అసలు సంగతేమిటి? అతడికి వచ్చిన రోగమేమిటి? అనికూడా ప్రశ్నించారు? నేను అతను ఆరుమాసాలుపైగా దాదాపు 9 మాసాలుగా మంచంపట్టి ఉన్నారని — అది రోగమో, మరోకటో గ్రహమో, ప్రయోగమో మాకెవరికీ అంతుపట్టలేదని అతనికెలాగైనా సహాయం చేయమని దానికై జాతకాన్ని శ్రీవారికిచ్చాను!

నేను తిరిగి వెళ్ళేముందు ఏదో ఆలోచన తోచి —

అవసరమైతే నామిత్రుని చేతులమీద మోసుకొని వస్తాను — అతడి

భార్యాబిడ్డల సహాయంతో అయినా! మరొకసారి చూసి విభూదివంటిదేమైనా ఇస్తానంటే తప్పకుండా తీసుకొనిరాగలను! హోటల్‌లోని ఈ మీరూముకే తీసుకువస్తాము! అనికూడా అన్నాను నా ఆదుర్దాలో!

దానికి శ్రీవారు నవ్వి — మంచంపట్టివున్న వ్యక్తిని ఇక్కడికి మోసుకు రావలసిన శ్రమ ఏమీ అవసరంలేదు! అవసరమైతే మనమే అతనింటికి వెళ్ళి రోగిని పరిశీలించి చూడవచ్చు అన్నారు!

"నాకు వెయ్యిఏనుగుల బలం వచ్చినంత సంతోషం వేసింది! రేపు నేను కారుతీసుకొని వస్తాను! అందులో శ్రీవేదవ్యాస గురుదేవులు డాక్టరు మిత్రుని ఇంటికి స్వయంగా తీసుకువెళ్ళగలనని చెప్పి వారి అనుమతి తీసుకొన్నాను!

శ్రీవారు అనుమతించాక మళ్ళీ క్షణకాలం కళ్ళు మూసుకొని రేపు 10 గంటలప్రాంతంలో అతడింటికి వెళ్ళి రోగిగది శుభ్రంచేసి మనం వెళ్ళ టానికి అన్నీ సిద్ధంగావుంచి మీరు నావద్దకు వచ్చేముందు అక్కడినుంచే ఫోన్‌చేయండి! సరిగ్గా 10 - 10-15 ని॥మధ్యన చేయండి! అప్పటికి నా ప్రేయరు పూర్తిఅవుతుంది" అన్నారు! ఇక వారే స్వయంగా నామిత్రుడి ఇంటికివచ్చి అక్కడి పరిస్థితిని పరిశీలిస్తానంటే నాకు మరింత ఆనందంగా వుంది! జాతకంకంటే మనిషినిచూసి యదార్థపరిస్థితి చెప్పగలరుకదా అన్న ఆశ!

మర్నాడే నా పూజాదికములు పూర్తిచేసుకొని ఉదయం 9-30 ని॥ల కల్లా తయారై నాకారు తీసుకొని డా॥ మిత్రుని ఇంటికి సుమారు 9-45 ని॥లకి చేరుకున్నాను! కారుదిగి లోనికివెళ్ళి అతడి భార్యతో గురుదేవుల ఆదేశం తెలిపి అక్కడినుంచి శ్రీవారి హోటల్‌రూముకు తీసుకువెళదామని — తీరా వెళ్ళిచూస్తినికదా — నాగుండె గతుక్కుమంది!

నాడాక్టరు మిత్రుడు పడుకునివుండే గదిలోని మంచం ఖాళీగావుంది! మిత్రునిజాడ ఎక్కడాలేదు! చెడుశంకిస్తూ భయపడుతూ ఇంట్లోవారిని ప్రశ్నించగా —

"ఇప్పుడే మీ డాక్టరుమిత్రుడు వారంతటవారే లేచినిలబడి గదిలో అటూఇటూ నడిచారు! మా ఆశ్చర్యానికి మేరలేదు! స్నానంచేసి బట్టలు వేసుకొని స్వయంగా మార్కెట్టులోకి వెళ్ళారు! శ్రీవేదవ్యాస గురుదేవులకోసం పూజకై పుష్పాలు, పండ్లుతెస్తానని వెళ్ళారు వారొక్కరే!" అని అతడిభార్య చెప్పగా నిర్ఘాంతపోయాను!

ఏమిటీ దైవలీల? శ్రీవారు ప్రేయరు చేస్తానన్న టైము అరనిముషమైనా పట్టకుండా మాడాక్టరుమిత్రుడు కరెంటుష్షాకు కొట్టినట్టు లేచినిలబడి అర క్షణంలో ఆరోగ్యవంతుడు కావడమేమిటి? అనుకుంటూ అతనికోసం వేచి వున్నాను! తర్వాత ఇద్దరమూ కలిసి నాకార్లోనే శ్రీవేదవ్యాస గురుదేవుల హోటల్‌గదికి వెళ్ళాము! శ్రీవారేమీ ఆశ్చర్యపోలేదుసరికదా ఆనందంగా చిరునవ్వు చిందిస్తూ బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్నారు! మా ఇద్దరినీ చూసినవ్వి :

"మీ మిత్రుడు బాగయ్యాడుకదా! ఇంకా జాతకం ఏమిటి? మీకు మాస్టర్‌గారి అనుగ్రహం లభించింది! ఇక గ్రహబలమేమిటి — రామానుగ్రహ బలముండగా? అన్నట్టుగా బాగయ్యింది!" అన్నారు.

నేనింకా భయపడుతూనే 'మా మిత్రుని రోగనివారణ స్థిరంగా ఉండ గలదా? లేక ఇంత అకస్మాత్తుగా బాగయ్యిందో తాత్కాలికంగా మళ్ళీ తిరగ బెట్టి పీడిస్తుందా?' అన్నభయం కడుపులో వుండగా శ్రీవారిని మనసా అభినందించాను! దీనికి ఇంకేమైనా మా మిత్రుడు చేయాలా? అంటూ!

"ఇక్కడ దుద్దుకూరు శ్రీపర్వతంమీద మనస్వామి వేంకటేశ్వరస్వామి

వేంచేసివున్నారు! మీమిత్రుడు స్వయంగా ప్రతీ శుక్రవారం బక్కెట్‌లో 10 లీటర్లపాలు అభిషేకానికి తీసుకువెళ్ళి సమర్పించాలి! అభిషేకం పూర్తిఅయ్యే దాకా నిలబడివుండి శ్రీవారిని సేవించుకుని వారి తీర్థప్రసాదాలు తీసుకొని ఇంటికి వెళ్ళాలి! ఇలాగ అయిదువారాలు విధిగా చెయ్యాలి! మీ మిత్రుడు ఈ పాలను స్వయంగా పట్టుకెళ్ళాలి! మరెవ్వరిచేతా పంపించరాదు! అని గట్టిగా ఆదేశించారు!

పరమానందంగా అయిదు శుక్రవారాలు అభిషేకానికి ఆవుపాలు సమర్పించడం తొమ్మిదినెలలు మంచం పట్టివున్నా దాదాపు నిర్జీవుడై పడివున్న నామిత్రుడు ఆరోగ్యం, బలం, తేజస్సు పుంజుకొని ఇప్పుడు తిరిగి అపోలో హాస్పిటల్‌లో ఒకపెద్ద డాక్టరుగాచేరి అనేకమంధి రోగులకు వైద్యం చేస్తున్నారు!

శ్రీవారి అనుగ్రహం ఊహకందనిది! భగవంతుడు కూడా బహుశా ఇంతత్వరగా కరగడేమో! మంత్రాలుగాని, జపాలుగాని రోజులు నెలలకు పనిచేస్తాయి! శ్రీవేదవ్యాస గురుదేవులు సంకల్పమాత్రంచేత అరక్షణంలో నా బాల్యమిత్రుని భయంకర రోగవిముక్తుణ్ణిచేసి ఆరోగ్యవంతుడిని చేశారు! శ్రీవారికి నా కృతజ్ఞతలు భక్తిప్రణామములు ఎన్నిసార్లు తెలుపుకోవాలని ప్రయత్నించినా వారు దానిని తేలికగా తోసివేస్తూ ఇలాఅన్నారు :

"సైన్సుకూ, వైద్యశాస్త్రానికీ అందని తెలియరాని మహాసత్యాలు ప్రకృతిలో చాలావున్నాయి! ఇది మీరు అనుభవంతో చూశారు — డాక్టరుగా ఆశ్చర్యపోతున్నారు! రోగం నివారణ, మనిషిలో ప్రాణము రాకడ, పోకడ మృత్యువు బ్రతకడం ఇవన్నీ మనలోని ప్రాణశక్తిచేత చేయించేవాడు పరబ్రహ్మ! ఆయనయే ఈ విశ్వంలో నిజమైన పరమాత్మశక్తి! ఒక్కసారి చేతులెత్తి నమస్కరిస్తే సమస్త రోగములనూ క్షణంలో 10వవంతు తృటిలో

నివారించగలడు! ప్రాణమే మనకి ఉచితంగా ఇచ్చినవాడు రోగాల్ని బాధల్ని నివారించలేడా? ఆయనేమైనా డాక్టరా? మనదగ్గర ఫీజు ఆశించడానికి?" అంటూ నాపై ఒక ఛలోక్తి విసిరినారు.

డాక్టరుమిత్రుని శాశ్వతంగా రోగవిముక్తుణ్ణి చేశారు — ఒక్క అగరు బత్తి మాత్రమే వెలిగించి! ఇది నా యదార్థ అనుభవం! ఇలాంటివి ఇంకా ఎన్ని శ్రీవారు మనకెవరికీ తెలియకుండా నిర్వహిస్తారో అది వారికీ ఆ పరబ్రహ్మకే తెలియాలి!

